# సాలగ్రామశాస్త్రము

తాత్పర్య విశేష సహితము



సంపాదకుడు

కపిలవాయి లింగమూర్తి

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాయముచే ప్రచురింపబడినది

**SALAGRAMA SASTRAMU** : A Sanskrit religious work, with Telugu Commentary dealing with the origin, classificat:on and mode of worship of Salagrama, a unique lithic symbol of the Almighty, available naturally in the Himalayas - by Sri Kapilavayi Lingamurthy, Nagarkurnool, Mahboobnagar Dist.

---

ప్రతులు : 1000 

ప్రథమ ముద్రణ : రక్తాక్షి శ్రావణ, 1984

**వెల : 15-00**

ప్రతులు దొరకుచోటు :

**కె. కిశోర్‌బాబు**

**15-34** వాణీసదనం

నాగర్‌కర్నూలు - 509 209.

ముద్రణ

**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**

హైదర్‌గూడ - హైదరాబాద్.

# ఎందరో మహానుభావులు

నాకీ గ్రంథ పరిష్కరణలో పరోక్షంగాను ప్రత్యక్షముగాను సహాయ పడిన వారెందరో ఉన్నారు. అట్టివారిలో మొదట చెప్పదగినవారు శ్రీ తీర్థం శ్రీధరమూర్తిగారు. వారు నాకు సుదూరంలో ఉన్నప్పటికీ ఎప్పటికపుడు నా జాబులకు సమాధానం వ్రాస్తు, కోరినదేతడవుగా తమ దగ్గరగల ఈ సాలగ్రామ శాస్త్రప్రతిని నాకు కాపీ చేయించి పంపినారు. వారది పంపకుంటే నా యొక్క ఈ కృషియే లేదు.

గ్రంథానికి నాకు శ్రీ శ్రీధరమూర్తిగారి ప్రతితోడ్పడితే, పీఠికకు శ్రీ ఎమ్. ఎస్.కృష్ణమాచార్యగారి సాలగ్రామ శిలోత్పత్తి విమర్శనం అనే తమిళ పుస్తకం ఎంతో సహాయపడింది.

ఇక నాకు ప్రక్కగా ఉండి ప్రత్యక్షంగా తోడ్పడినవారిలో శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రిగారు ముఖ్యులు. విషయమంతా నేను సంపాదించిన తరువాత దానిలో సాధుపాఠ నిర్ణయానికి తాత్పర్య రచనకు వారి సహాయం పూర్తిగా ఉన్నది. అతడు లేకుంటే నా యొక్క ఈ రచనయే సాగేది కాదు.

నేను సంపాదించిన ప్రతిని ఓం ప్రథమంగా తప్పులు దిద్దియిచ్చిన బ్రహ్మ శ్రీ మామిడి సీతారామశాస్త్రిగారికి-

తమిళ పుస్తకాన్ని చదివి పీఠికకు అవసరమైన విషయాన్ని వివరించిన మిత్రులు శ్రీ గురూజీగారికి-

దీనికి శ్రీ వై.బి. రెడ్డిగారి యొక్క మరియు నాయొక్క పరిచయ శ్లోకాలు రచించి యిచ్చిన పెద్దలు బ్రహ్మ శ్రీ తెలకపల్లె రామచంద్రశాస్త్రిగారికి-

నేను కోరగానే తమ అమూల్యాభిప్రాయం వ్రాసిన డా॥ పుల్లెల శ్రీరామ చంద్రుడుగారికి-

వీరేగాక నా రచనా వ్యాసంగంలో ఇదీ అని నిర్దేశింపరాకుండ బహు ముఖంగా తోడ్పడే ఆత్మీయులు శ్రీ శ్రీరంగాచార్యగారికి-

నేను రచనా వ్యాసంగంలో కాలు పెట్టగానే మొదట నుతించినవాడు పాండురంగడు గాబట్టి మరోరూపంలో నాకు మిత్రుడై, నా ప్రచురణల కమూల్యమైన సహాయం లభింప జేస్తున్నతనికి-

ఇల్లు నిరుపహతి స్థలం కాదు కనుక నేనేవిధంగా వ్రాసినా దానినర్థం చేసికొని ప్రూఫులు దిద్దిన మిత్రులు శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారికి,

ఈ పుస్తకానికి విషయాన్ని ఎఱిగి ముచ్చటగా ముఖచిత్రం వేసియిచ్చిన శ్రీ డి. వీరయ్యగారికి-

వీరందరికంటే ముందుగా-

రచయితలు పంపిన గ్రంథాలను శ్రద్ధగా పరిశీలించి వానికి ఆర్థిక సహాయం అందిస్తు హిందూ సంస్కృతి రక్షణకు హిందూ ధర్మ వ్యాప్తికి ఎనలేని సేవలు చెల్లిస్తున్న శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన కమిటీ కార్యనిర్వహణాధికారి గారికి, మరియు వారి సభ్యులకు-

ఇందు మూలంగా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు తెలుపుకుంటూ, నా కృషికి నిరంతరం చేదోడు వాదోడుగా నిలిచిన మా చిరంజీవులు కె. కిశోర్ బాబు, అశోక్‌బాబులను ఇతోధికాభివృద్ధిగా ఆశీర్వదిస్తున్నాను.

వాణీసదనం-
విద్యానగర్ కాలనీ,
నాగర్‌కర్నూలు-509 209.

ఇట్లు
సాహిత్యారాధకుడు
కపిలవాయి లింగమూర్తి

# అంకితం

ఒకప్పటి మాట. నేను, మిత్రులు శ్రీ ఎమ్. రంగారావుగారు కలిసి బ్రహ్మశ్రీ తెలకపల్లె రామచంద్ర శాస్త్రి గారి దగ్గరకు వెళ్ళితిమి. అపుడాయన మాతో తన విద్యార్థిదశను ముచ్చటించుచు ఎందరెందరినో గురించి చెప్పెను. వారిలో నెల్లూరి రెడ్లొకరు. వారి సౌజన్య సాహిత్య ప్రియత్వమగ్గించుచు-

క. తిక్కన కాలంబున భూ భుక్కులుగా బుట్టకునికి భువినతని ఋణం
బిక్కరణి దీర్తురిప్పుడు నిక్కపు బంధువులు జేసి, నెల్లూరి రెడ్డుల్.

అని వారు జరుపు తీయనాళ్లను దెలిపి, ఆ సందర్భమున రాజశ్రీ ఎఱ్ఱంరెడ్డి బాల కృష్ణారెడ్డి దంపతులకు తనపైగల యభిమానమును, విశేషించి వారి సాహితీ ప్రియంభావుకతను వివరించెను. అపుడు వారన్న మాటలివి-

క. సాహిత్యము తనయూపిరి సౌహిత్యమె భోజనంబు, సత్కావ్యగుణ
గ్రాహిత్వము తన వ్రతముగ నూహయెఱిఁగి నంతనుండి, యుండు
నతండున్.

క. నెఱయోఁజల కాణాచిగ గుఱుతింపగ బడినపురిని గుణముల ప్రోవై
పఱలెడు Y. B. రెడ్డిని ఎఱుఁగని వారుండ రెందు నిందును నందున్.

ఆ. కపన మల్లలేరు గాని నాలుకతుదఁ గదలుచుండు నెపుడు కావ్యలక్ష్మి
మాటమాట కొక్క చాటువై తెరచాటు కాంతవోలె రెడ్డిగారి నోట.

ఆయన సతీమణి రంగనాయకమ్మ గారు లక్ష్మీదేవికి మారు.

ఆ. ఈడు జోడుగుదురు టిలలోన నరుదగు పేర్లు గుదురుటనిన పెద్దవిషయ
మిన్ని గుదురుగాక నింగితాలేకమై సరసులగుట యెంత జన్మఫలము!

తే. అతడు ప్రియసతి కెదనిచ్చె సతతముగ న దెంతటి రసానుభూతియో
నితడుగూడ
నంతియేయని యార్యులు నాడుచూడఁ దాను పురుషోత్తముండయి
దనరుచుండు.

నేనిల్లు జేరిన పిమ్మట మఱికొందరిచే గూడ రెడ్డిగారి సాహిత్య ప్రియత్వము విని-

క. ఎవరీ ఎఱ్ఱని కృష్ణుడు నవనీతము విడిచి కావ్య నవనీతంబున్
చవిగొనునట సతతంబని ప్రవిమల బుధగణములెల్లఁ బ్రస్తుతిసేయున్.

అని తలచి నా రచన లొకటి రెండు బంపుచు పరిచయమునకై జాబు వ్రాసితిని. అవి జదివి వారు తీరికగా సమాధానము వ్రాసిరి. దానితో మా పరిచయము క్రమముగా బెరిగినది. ఏటేట జరుపు శ్రీనాథ జయంతులకు మరియు నితరములకు గూడ వారి ఆహ్వానములు నాకందసాగినవి.

సతీ వియోగము గలిగి ఆంధ్ర సారస్వత పరిషత్తున వారామె స్మృతి చిహ్నముగా పండిత సత్కార మేర్పాటు జేసినపుడు-

క. పతిమదికి నింతయెక్కిన అతివగదా పుణ్య యనియె నాంధ్రవ్యాసుం
డతని కృతికి లక్ష్యంబీ సతియెంతటి ధన్యురాలొ, చర్చింపంగన్.

అని భావించి నేనా సభకు వెళ్ళితిని. అపుడు వారు నాతో మాటాడి తరువాత తమ పురమునకుగూడ రప్పించుకొనిరి. నేను వారి ఆదరణమంది అతిథ్యమును బొంది ముగ్ధుడనై యిల్లు జేరితిని.

నేనచటికి వెళ్లనపుడీ గ్రంథమును తిరుపతికి బంపుచు నీ పర్యాయ మిది ముద్రించ వలసి వచ్చినయెడల తగినవారికి కృతినీయ వలెనని సంకల్పించితిని. ఇల్లు జేరిన పిమ్మట నిది శ్రీనివాసుని యనుగ్రహ పాత్రమై తిరిగివచ్చెను.

ప్రాచీన సాహిత్య ప్రచురణ - అందును శాస్త్ర గ్రంథ ప్రచురణ-యరుదగుచున్న ఈ దినములలో తిక్కన శ్రీనాథాదులవంటి వారిపై పరిశోధనాత్మకమైన కృషికి చేయూత నిచ్చుచు, బాలకృష్ణ భారతి పేర స్వయముగా నొక ప్రచురణ సంస్థ నేర్పరచి సాహిత్యారాధన జేయుచున్న శ్రీ రెడ్డిగారు నా సంకల్ప ప్రకారమీ శాస్త్రకృతికి తగిన వారనిపించినది. అందుచేత మా పరిచయమును పురస్కరించుకొని నేను దీనిని వారి కంకితమిచ్చుచు శేషాద్రి శేఖరుడగు శ్రియఃపతి వారి కుటుంబమున కాయురారోగ్య సౌభాగ్యములు దయసేయుగాక యని ప్రార్థించుచున్నాను.

రక్తాక్షి ఆషాఢము - హరివాసరము

వాణీసదనం
విద్యానగర్ కాలనీ
నాగర్‌కర్నూలు - 509209.

ఇట్లు
సాహిత్యారాధకుడు
కపిలవాయి లింగమూర్తి

# పరిచయం

శ్రీః

"జన్మాద్యస్యయతః" (బ్రహ్మసూత్రం 1-1-2) అని బాదరాయణుడు పరమేశ్వరుని లక్షణం చెప్పి ఉన్నాడు. "జగత్తు యొక్క జన్మ స్థితి లయము లకు కారణభూతుడు పరమేశ్వరుడు" అని దీని అర్థం. ఈ పరమేశ్వరుడు సర్వగతుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తుడు, నామరూపాతీతుడు. ఐహికాముష్మిక సుఖాలు పొందడానికైనా, సర్వోత్తమ లక్ష్యమైన మోక్షాన్ని సాధించడానికైనా పరమేశ్వరుని అనుగ్రహం అవసరం. పరమేశ్వరానుగ్రహం లేనిదే ఏ పనీ జరగదు; జరగడానికి వీలులేదు. "తేన వినా తృణమపి నచలతి." ఇది ప్రపంచకములోని అందరి ఆస్తికుల విశ్వాసం.

పరమేశ్వరుడు నామరూపాతీతుడు అవడంచేత ఈయనకి పేరు కాని రూపం కాని లేవు. ఐతే మన సౌకర్యం కోసం ఏవేవో పేర్లు పెట్టి వాటితో పరమేశ్వరుణ్ణి పిలుస్తున్నాము. ఈ పేర్లు అన్నీ కాల్పనికాలే. అయినా ఆయన నిజమైన భక్తులకి పలుకుతూనే ఉన్నాడు. అదే విధంగా అనేక రూపాలు కల్పించి వాటిలో పరమేశ్వరుణ్ణి చూడడం కోసం ప్రయత్నం చేస్తున్నాం. వారి వారి ప్రయత్నాల వైశిష్ట్యాన్ని పట్టి ఎంతో మంది ఆ రూపాలలో పరమేశ్వరుణ్ణి చూడ కలిగినారు. ఈనాటికీ చూస్తున్నారు కూడా. అందుచేత కొందరు అనుకున్నట్లుగా పరమేశ్వరుడికి రూపాలు కల్పించడం మహా పాపం ఏమీ కాదు. పరమేశ్వరుడు సర్వశక్తుడుకదా? సర్వశక్తుడైనప్పుడు ఏ ఆకారాన్నైనా ధరించి పైనుండి క్రిందికి దిగే (అవతరించే) శక్తి కూడా ఈయనకి ఉంది అనుకోవడంలో తప్పు ఏమున్నది? భక్తుల కోరికను అనుసరించి ఏ ప్రతిమలోనైనా, ఏ మూర్తిలోనైనా ఆయన సన్నిహితుడై, అర్చామూర్తి స్వరూపంతో ఉంటాడని విశ్వసించడంలో తప్పు ఏమున్నది? ఆయన అట్లా చేయలేనినాడు ఆయన సర్వశక్తత్వానికి పరిధి కల్పించినట్లే అవుతుంది కదా? నామం కల్పిస్తే తప్పులేనప్పుడు రూపం కల్పిస్తే తప్పు ఏమున్నది? భారతీయుల అవతారవాదంలోను, మూర్తి పూజా విధానంలోనూ ఉన్న రహస్యం ఇదే. ఇవన్నీ మానసికైకాగ్రత కోసం ఏర్పడినవి.

కావలసిన సత్ఫలితాన్ని ఇస్తున్నాయి. కాబట్టే అనూచానంగా నిరంతరంగా సాగుతున్నాయి.

మనం ఆరాధించే మూర్తులలో రెండు విధాలు ఉన్నాయి. ఆవాహన చేయడం ద్వారా తత్తద్దేవతాసాన్నిధ్యం కల మూర్తులు కొన్ని-ఇవి దేవాలయాల లోని విగ్రహాలు, వ్రతాదులలో నెలకొల్పే మూర్తులు మొదలైనవి; సహజంగానే దేవతా సన్నిధి కలవి కొన్ని - ఇవి నర్మదానదిలో దొరికే బాణలింగాలు (శివ సన్నిధి కలవి), శోణానదిలో దొరికే గణపతి సన్నిధానం కల శిలా శకలాలు, గండకీ నదిలో దొరికే సాలగ్రామాలు (ఇవి ప్రధానంగా విష్ణు స్థానాలు). వీటి అన్నింటిలోనూ ఆవాహనాదుల అవసరం లేకుండా నిత్యమూ ఆయా దేవతలు సన్నిహితులై ఉంటారు.

సాలగ్రామ పూజా సంప్రదాయం అతి ప్రాచీనమైనది. శంకర భగవత్పాదులు తమ బ్రహ్మసూత్ర భాష్య-ఉపనిషద్భాష్యాదులలో సాలగ్రామంలో విష్ణువు సర్వదా సన్నిహితుడై ఉండడంచేత సాలగ్రామం కేవలం విష్ణు ప్రతీకమే కాదు, విష్ణు స్వరూపం కూడా అని ఐదారు స్థలాలలో సూచించి ఉన్నారు. ''ఆశ్వలాయన గృహ్యసూత్ర ప్రతిష్ఠ'' అనే గ్రంథంలో ''స్వాకృతిషు హి శస్త్రాసు'' అనే సూత్రం ఉన్నది. విష్ణు స్థానాలైన సాలగ్రామాదులమీద, శివ స్థానాలైన బాణ లింగాదుల మీద ఆయా దేవతల ఆవాహన విసర్జనలు చేయవలసిన పనిలేదు, వారు నిత్య సన్నిహితులు అని దానికి అర్థం చెప్పబడింది. దీనిచేత ఆశ్వలాయన గృహ్యసూత్రం కంటె పూర్వమే సాలగ్రామ పూజ ఉన్నదని స్పష్టం అవుతున్నది. అట్లే-

వీరమిత్రోదయంలో — ''ప్రణవోచ్చారణాచ్చైవ శాలగ్రామ శిలార్చనాత్,
బ్రాహ్మణీగమనాచ్చైవ శూద్రశ్చణ్డాలతాం వ్రజేత్''

అనే ఆపస్తంబుని వాక్యం ఉదాహరించబడింది. ఆపస్తంబుడు క్రీ. పూ. 600 - 600 మధ్యవాడని పండితుల నిర్ణయం.

సాలగ్రామ పూజనమే కాకుండా సాలగ్రామ దానంకూడా అత్యుత్తమ ఫలప్రదమని ధర్మశాస్త్ర గ్రంథాలలో చెప్పబడి ఉన్నది. సాలగ్రామ సన్నిధిలో పెట్టే శ్రాద్ధం ద్విగుణీకృతఫలం అవుతుందని కూడా ధర్మశాస్త్ర కథనం. అంత పవిత్రమైనది సాలగ్రామం.

సాలగ్రామ మాహాత్మ్య-పూజా విధానాదులను గూర్చిన విషయాలు అనేక పురాణాలలో విక్షిప్తరూపంలో నిక్షిప్తములై ఉన్నాయి. వీటిలో ఉన్న విషయాలే 'నిర్ణయ సింధు' 'ధర్మ సింధు' మొదలైన ధర్మశాస్త్ర గ్రంథాలలో ఉద్ధృతములై ఉన్నాయి. ఈ విషయాలనే క్రోడీకరించి కొన్ని స్వతంత్ర గ్రంథాలు - "సాల గ్రామ పరీక్షా", "సాలగ్రామ లక్షణమ్", "సాలగ్రామ కల్పః" "సామగ్రామ దానకల్పః", "స్తాలగ్రామ నిర్ణయః" "సాలగ్రామ మాహాత్మ్యమ్" "సాలగ్రావ తీర్థ సేవనక్రమః", "సాలగ్రామ స్తోత్రమ్" మొదలైనవి, చాలావరకు అప్రకటి తాలుగాను, కొన్ని ప్రకటితములైనా అలభ్యంగానూ ఉన్నాయి. మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాగారంలో ఉన్న "సాలగ్రామ లక్షణం"లో—

"బ్రహ్మాణ్డాం బ్రహ్మవాయుశ్చ బ్రహ్మ సంహితయా తథా
వారాహం గారుడం స్కాన్దమేతేషాం సార ముద్ధృతమ్"

అని వ్రాస్తూ విషయాలు వివిధ పురాణాల నుండి సంగ్రహింపబడినవని చెప్పబడింది.

**సాలగ్రామ నామధేయం:** శాలఙ్కాయనుడనే మునిని అనుగ్రహించడం కోసమై శ్రీ మహావిష్ణువు గండకీ నదీతీరంలో సాలవృక్షరూపంలో వెలిసినాడట. ఆ ప్రాంతంతో ఉన్న గిరి కూడా విష్ణు రూపమే. ఈ విషయాన్ని వరాహ పురాణంలోని ఈ క్రింది శ్లోకాలు తెలుపుతున్నాయి:

"పశ్యతే చ పునః శాలం శుభానాం శుభదర్శనమ్
తతోదృష్ట్వా మహాశాలం పరిశ్రాన్తో మహామునిః
శాలస్య తస్య పూర్వేణ స్థితః పశ్చాన్ముఖోమునిః
శాలవృక్షం సమాశ్రిత్య నిభృతే నాన్తరాత్మనా
యోఽయం వృక్షస్త్వయా దృష్టః సోఽహమేవ న సంశయః"
"శాలగ్రామ గిరిర్విష్ణుః"...
శాలగ్రామే గిరౌ తస్మిన్ శిలారూపేణ తిష్ఠతి
తవప్రీత్యా ప్రవక్ష్యామి యేనైతత్ క్షేత్రముత్తమమ్
శాలగ్రామమితి ఖ్యాతం తన్నిబోధ మునే శుభమ్

మమతద్రోచతే స్థానం గిరికూట శిలోచ్చయే
శాలగ్రామమితిఖ్యాతం భక్త సంసార మోక్షణమ్."

ఈ సాలగ్రామ క్షేత్రం హిమవత్పర్వతానికి దక్షిణంగా గండకీ నది ఉత్తరపు టొడ్డున ఉన్నదని "సాలగ్రామ లక్షణమ్" అనే గ్రంథం చెప్పుచున్నది—

"గణ్డాక్యాశ్చోత్తరే తీరే గిరిరాజస్య దక్షిణే
క్షేత్రంతు విష్ణుసాన్నిధ్యాత్ సర్వ క్షేత్రోత్తమోత్తమమ్"

విష్ణురూపమైన సాలవృక్షంతో పాటు ఇంకా సాలవృక్షాల సముదాయం ఉండడంచేత (గ్రామ శబ్దానికి సముదాయమని కూడా అర్థం) అ ప్రదేశానికి సాలగ్రామం అనే పేరువచ్చి ఉండవచ్చును. లేదా ఆ సాలవృక్షం దగ్గర ఉన్న గ్రామం సాలగ్రామం "సాలోపలక్షితః (సాలముచే గుర్తింపబడిన) గ్రామః సాలగ్రామః." అచట పుట్టిన శిలలన్నీ సాలగ్రామ శిలలు. ఐతే ప్రయోగంలో 'శిల' అనే పదాన్ని విడిచివేసి 'సాలగ్రామం' అనే పేరుతో మాత్రమే ఈ శిలకు ప్రసిద్ధివచ్చి ఉంటుంది. పేరులో ఉన్న కొంత భాగాన్ని మొదటనో చివరనో విడచివేయడం ప్రసిద్ధమే. సత్యభామని 'భామ' అనీ, భీమసేనుణ్ణి 'భీముడు' అనీ అన్నట్లు.

ప్రకృత గ్రంథమైన "సాలగ్రామ శాస్త్రమ్" అనేది ఈ సాలగ్రామానికి సంబంధించిన అన్ని విషయాలనూ ప్రతిపాదించిన గ్రంథం. ఈ గ్రంథాన్ని సంపాదించి సులభశైలిలో తెలుగులో తాత్పర్యం కూడా వ్రాసిన శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు ఆంధ్రులకు ఎనలేని సేవ చేసినారనడంలో సందేహం లేదు.

"సాలగ్రామక్షేత్ర యాత్ర" అనే పేరుతో వ్రాసిన దాదాపు 50 పేజీల ఉపోద్ఘాతంలో శ్రీ లింగమూర్తిగారు అస్మాదృశులకు చాలామందికి తెలియని ఎన్నో విషయాలు ముచ్చటించి ఉన్నారు. ఇందులో ఎన్నో ప్రాచీన సంప్రదాయాలు అలవాట్లు మొదలైన వాటిని కూడా తెలిపి ఉన్నారు. ఈ ఉపోద్ఘాతం ఈ గ్రంథానికి వన్నె తెచ్చి పెట్టింది. సాలగ్రామాలు ఎలా ఏర్పడతాయి, వాటిపై చక్రాదులు ఏ విధంగా వజ్రకీటం అనే కీటకంచేత నిర్మింపబడతాయి ఇత్యాది విషయాలు ప్రామాణికంగా నిరూపింపబడినాయి. ఈ సాలగ్రామ శిలా కృత్యాకృతులను చూస్తే భగవత్సృష్టిలోని వైచిత్ర్యం తెలుస్తుంది. ఈ

మూల గ్రంథానికి తులసీ చరిత్ర పూజా విధానము మొదలైనవాటిని అను బంధాలుగా చేర్చడం చేత ఈ గ్రంథంయొక్క ఉపయోగిత అధికం అయింది. మూలప్రతిలో వారు చేసిన సవరణలు (చూ. ఉపోద్ఘాతము P. xxxvi, xxxvii) ఉపయుక్తముగా ఉన్నవి. ఇలాంటి గ్రంథాలు ఒకసారి ఎవరిచేతనో ముద్రితములైనవి కదా అని పునర్ముద్రణం చేయడానికి సందేహించ వలసిన పనిలేదు. ఇలాంటి గ్రంథాలు ఎన్ని బైటకువస్తే అంత మంచిది.

హేతువాదం అనే పేరుతో ప్రాచీన సంప్రదాయాలన్నింటినీ నిర్లక్ష్యం చేయడం ఇప్పుడు అలవాటైపోయింది. ప్రాచీన మహర్షులు తమ దివ్యదృష్టిచే కనుగొని చెప్పిన విషయాలను నిరాకరించడం ఆత్మహానికరమే అవుతుంది. ఎవరైనా వైజ్ఞానికుడు-విదేశీయుడైతే ఇంకా శ్రేష్ఠం- సాలగ్రామంలో విశేషం ఏదో ఉన్నదని చెపితే, మళ్ళీ మరొకడు వచ్చి ఏమీలేదని చెప్పేవరకూ, సాలగ్రామాలని మెడలో కూడా వేసుకొని తిరుగుతారు చాలామంది. వైజ్ఞానికుల దృష్టి సామాన్యుల దృష్టికంటె గొప్పదే; సందేహం లేదు. ఐతే మహర్షుల దివ్య దృష్టి ముందు ఈ వైజ్ఞానిక దృష్టి సూర్యునిముందు మెరుగుడు పురుగువంటిది.

పూర్వం ఒకప్పుడు ఒక భక్తుడు శృంగేరీ పీఠాధిపతులైన శ్రీ చంద్ర శేఖర భారతీ శ్రీచరణుల దగ్గరకి వెళ్ళి తానేవో కష్టాలలో ఉన్నట్టు విన్నవించు కున్నాడట. అపుడాయన నీవు పంచాయతన పూజ చేయుచున్నావుకదా. అందు లోని సాలగ్రామం తీసికొనిరమ్మని చెప్పి, దానిని తీసికొనిరాగా దానిని చూచి ''ఈ సాలగ్రామానికి నైవేద్యం సరిపోవడం లేదు. ప్రతిదినమూ పాయసం నైవేద్యం పెట్టు'' అని ఆనతిచ్చినారట. ఆనాటినుంచీ ఆతడు కష్టాలనుంచి గట్టెక్కినాడట. ఇలా ఉంటుంది దివ్యదృష్టి అంటే.

ఏడెనిమిది సంవత్సరాల క్రితం నా దగ్గరకు నాలుగు సాలగ్రామాలు చేరినాయి. వాటిలో ఒకటి నారసింహం అనిపించింది. వాటిని నాల్గింటినీ పూజించ వచ్చునా, కూడదా అని సందేహం బయలుదేరింది. ఆ సందర్భంలో ధర్మ సింధువు, నిర్ణయ సింధువు వంటి గ్రంథాలను పరిశీలించి, ఒకటి చాలునని నిశ్చయించుకొని, పూర్వంనుంచీ వస్తూన్న సాలగ్రామం మాత్రం ఉంచుకొని మిగిలిన మూడూ శంకరమఠంలో ఇచ్చివేసినాను. ఈ పుస్తకం చూడగానే,

ఇదే ఆనాడు లభించి ఉన్నట్లైతే అంత శ్రమపడవలసిన అవసరం ఉండేది కాదు కదా అనిపించింది. అంత సమగ్రంగా ఉన్నది ఈ గ్రంథం.

సాలగ్రామ పూజ భారతీయ సంస్కృతికైక్యానికి చిహ్నం. ఎక్కడో హిమాలయాలలో పుట్టిన సాలగ్రామాన్నీ, సముద్రంలో పుట్టిన శంఖాన్నీ ఒక చోట చేర్చి పూజచేయడం అనే సంప్రదాయం ఆసేతు హిమాచలంలో ఈనాటికి కూడా జరుగుతూన్నదంటే ఇంతకంటె ఏమి ప్రమాణం కావాలి భారతైక్యం విషయంలో! భారతదేశం అంతటా అనూచానంగా వస్తూన్న ఇలాంటి సంప్రదాయాల మీదా, ఏతాదృశ సంప్రదాయ పరిరక్షణకు ప్రధాన సాధనమైన సంస్కృత భాషా ధ్యయనం మీదా - ఎంతటి పెన్నిధిని కోల్పోవుతున్నామో తెలుసుకోకుండా - ప్రయత్న పూర్వకంగా గొడ్డలిపెట్టు పెడుతూ మరొకమూల ''భారతదేశ సమైక్యత'' (భారతదేశ సమైక్యం-అనాలి) అని అంటూ ఆక్రోశించే ఈ కాలంలో ఈలాంటి గ్రంథాల ఆవిర్భావం ఎంతైనా అవసరం.

హైదరాబాదు
6-8-1984

పుల్లెల శ్రీరామచంద్రుడు.

# సాలగ్రామక్షేత్ర యాత్ర

మహాతీర్థాలు మూడుకోట్ల ఏబది లక్షలని పురాణ వచనం. వానిలో దివ్య తిరుపతులు 108 స్వయం వ్యక్త స్థలాలు 8 మాత్రమే.

మనం మన దేశంలోని తిరుమలను మొదటిదిగా తీసికొని లెక్కిస్తే ముక్తినాథ క్షేత్రం 107వది అవుతుంది. ఆ పిమ్మటదిక పరమపదమే. అనగా వైకుంఠం. ఇక స్వయంవ్యక్త స్థలాలలో సాలగ్రామం మిక్కిలి ముఖ్యమయిందిగా చెప్పబడింది. ఈ రెండుయాత్ర లిపుడు నేపాలుదేశంలో ఖాట్మండుకు పశ్చిమంగా ఉన్నవి. ఇవిగాక ఆదేశంలో శక్తిపీఠాలుగూడ మిక్కిలిగానే ఉన్నవి. ఖాట్మండుగూడ ఒక శక్తిపీఠమనే చెప్పబడుతుంది. అక్కడ గుహ్యేశ్వరదేవి ఉంది.

ఖాట్మండుపదం కాష్ఠమండప వికృతి. అది నేపాలుదేశానికి రాజధాని. విష్ణుమతి భాగ్యమతీ నదుల సంగమస్థానంలో ఉంది. భాగ్యమతీనదీ తీరంలో పశుపతి నాథాలయం, విష్ణుమతీ తీరంలో మత్స్యేంద్రనాథాలయం ఉన్నది.

మనకథ లర్జునుడు పాశుపతాస్త్రం కొఱకు విజయవాడ దగ్గరగల యింద్రకీలాద్రిపై తపస్సు చేసినాడని చెబితె, అక్కడ కథలు పశుపతి నాథాలయానికి వెనుకగల యింద్రకీలాద్రిపై తపస్సు చేసినాడని, అతనికి శివుడక్కడ పాశుపతాస్త్రం దానంచేసినాడు కనుక అక్కడిస్వామికి పశుపతి నాథుడని వ్యవహార మేర్పడిందని స్థలచరిత్రలు చెబుతవి. ఇక్కడిస్వామి పంచముఖేశ్వరుడు. ఆ స్వామి ఉష్ణలింగమట. శీతాకాలంలో స్వామి నభిషేకం చేసినపుడా జలం ఆరుతుంటె అవిరి లేపటం కనిపిస్తుందట. శివరాత్రికి స్వామికి గొప్ప ఉత్సవం జరుగుతుంది. అపుడు లక్షలకొలది జనం వెడతారు.

పశుపతి నాథునికి వలెనే మత్స్యేంద్ర నాథునికిగూడ గొప్ప ఉత్సవం జరుగుతుంది. అతడు నేపాలు ప్రభువుల కులదైవం. పూర్వం ఆస్వామి రథోత్సవాన్ని చూడటానికి కల్పవృక్షం పురుషరూపాన్ని ధరించి వచ్చింది. అదియొఱిగి ఒక సిద్ధుడా పురుషుని నేనిక్కడ ఒక గొప్పమండపం కట్టించవలె ననుకొంటు

న్నాను, దానికి సరిపడే కట్టనీయమని కోరినాడు. అందుకాపురుషుడు సరేనని రథోత్సవానంతరం అక్కడొక మహావృక్షమై వెలసినాడు. అపుడా సిద్ధుడా చెట్టును కొట్టించి దానితో "మరుశతల్" అనబడే మేరు సప్తతల మండపాన్ని కట్టించాడు. దానిపేరనే అక్కడ "ఖాట్మండు" అనేనగరం వెలసిందని నేపాలు స్థలపురాణం చెబుతుంది.

ఆ దేశంలో సాలగ్రామక్షేత్రం, "సాలగ్రామ్" అనే క్షేత్రంనుండి గండకీ నది ఉద్గమస్థానం వరకు వ్యాపించిఉంది. అది దాదాపు 60 మైళ్లు. బ్రహ్మ వైవర్త పురాణ ప్రకారం పూర్వం పులహ పులస్త్యబ్రహ్మల ఆశ్రమా లక్కడనే ఉన్నవి. పులస్త్యాశ్రమంలోనే రావణ కుంభకర్ణులు పుట్టినారు. పెద్ద వాడైనపిమ్మట రావణుడు పుట్టించిన బాణగంగగూడ అక్కడుంది. రాజర్షియైన భరతుడు రాజ్యంవిడిచిన పిమ్మట అక్కడనే తపస్సుచేసినాడు. మరుజన్మలో కాలంజర పర్వతంపై జింకగా పుట్టినపుడు తనబలగాన్ని విడిచి మళ్లీ ఇక్కడికే వచ్చి నివసించినాడు. వరాహపురాణ ప్రకారం ఒక కల్పంలో కరిమకరుల పోరి క్కడనే జరిగింది. దేవీభాగవత ప్రకారం తులసీదాసు శాపంతో శ్రీమహావిష్ణువు సాలగ్రామ పర్వతమై యిక్కడనే నిలచినాడు. దానిపై శివుడు సోమేశ్వర లింగ రూపంలో వెలసినాడు. ఈ విధంగా ఆ క్షేత్రానికి ఎంతో పురాణ ప్రశస్తిఉంది.

ఇక్కడ గండకీనదిలో చక్ర-దేవిక అనే మరో రెండునదులు కలిసి ఒక త్రివేణి యేర్పడుతుంది. అదిగాక ఇంకాఎన్నో తీర్థాలు క్షేత్రాలిక్కడ ఉన్నవి. వానిలో హరిహరప్రభ, హంస, తీర్థాలు ముఖ్యమైనవి.

తీర్థే త్రిధారే యస్నాత్వా సంతర్ప్య పితృదేవతాః,
మహాయోగిన మభ్యర్చ్య నభూయో జన్మభాగ్భవేత్ 144-172

ఎవరక్కడి తీర్థాలలోను త్రిధారలలోను స్నానంచేసి పితృతర్పణం చేస్తారో, అచ్చటి శంకరు నర్చిస్తారో వారు పునర్జన్మకు పాల్పడరని వరాహ పురాణం చెబుతుంది.

నేపాలయాత్ర చేయటానికి ప్రభుత్వానుమతి యవసరం; కాని దాన్ని వారు శివరాత్రికి పదిదినాల ముందునుండి ఆ పిమ్మట వారంవరకు సడలిస్తారు. కాబట్టి అపుడెవరైనా నిరభ్యంతరంగా వెళ్లవచ్చు.

మాఘమాసం చలికాలమైనా ఖాట్మండు వరకు ఎలాగో వెళ్లవచ్చు గాని అవతల వెళ్లదలచిన వారుమాత్రం ఈ యాత్రను చైత్రంలో చేయటల మంచిది. లేకుంటె శివరాత్రికి వెళ్లిన వారక్కడి యాత్రీకుల కార్యాలయంలో అనుమతి తీసికొని చైత్రంవరకు ఏదైనా సత్రంలో నిలువవలసి ఉంటుంది.

సాలగ్రామ క్షేత్రంలో సాలగ్రామ్-ముక్తినాథ్- దామో- ధర్‌కుంజ్ అనే మూడు ముఖ్యమైన స్థలాలున్నవి. వీటిలో ముక్తినాథం అన్నింటి కంటె ముఖ్యమయింది. ఆయాత్ర చైత్రశుద్ధం నుండి కార్తీక పూర్ణిమవరకు చేస్తారు.

నేపాలు వెళ్లదలచిన వారికి ''రక్సోలు'' చివరి స్టేషను. అక్కడికి "బీర్‌గంజ్'' రెండుమైళ్ళు ఉంటుంది. ''బీర్‌గంజ్" నుండి యిపుడు ఖాట్మండుకు నారాయణ్ ఖేడ్ మీదుగా కొత్తదారి యేర్పడి సర్వీసుల సౌకర్యం కలిగింది. ఈ దారిని రాత్రి బండ్లుగూడ నడుస్తవి గాబట్టి నేరుగా ఖాట్మండు చేరవచ్చు. అక్కడికి సాలగ్రామ్ 60 మైళ్ళు, ముక్తినాథం 140 మైళ్ళు ఉంటవి.

సాలగ్రామం — ముక్తినాథం దారిలోనేఉంటుంది. ఇది మొదట జెప్పిన అష్ట స్వయంవ్యక్త క్షేత్రాలలో మిక్కిలి ప్రధానమయింది. అక్కడికి వెళ్లటానికి సన్నని కాలిబాటతప్ప యానసౌకర్యం లేదు. దారికి ఎనిమిది పదిమైళ్ల దూరంలో కుగ్రామాలుంటవి. ఈదారిలోని అడవులలో నరభక్షకు లుంటారు గాబట్టిఅక్కడికి వెళ్లదలచిన వారు ముందుగా నేపాలు ప్రభుత్వామతి పొందట మవసరం. ప్రభుత్వానుమతి 50 మందికంటె తక్కువగా ఉన్నజట్టుకు లభించదు.

అక్కడిస్వామికి శ్రీమూర్తి పెరుమాళ్ళు భగవతికి శ్రీదేవి యనిపేర్లు. స్వామి ఉత్తరాభిముఖంగా బ్రహ్మ రుద్రులకు, గండకిదేవికి ప్రత్యక్ష మైనట్టున్నాడు. ఒక నాట్య ప్రతిమ గూడ ఉంది. అది స్వామి నిత్య సన్నిహితమైన క్షేత్రం కనుక ఏ కారణంచేతనైనా ఆరాధన ఆగిపోయినా దోషం ఉండదు. తక్కిన స్థలాల్లో అయితె మళ్ళీ సంప్రోక్షణ చేయవలసి ఉంటుంది. అక్కడ అది అవసరముండదు.

అక్కడ ఇంకను నాచియార్ విమానము, కనక తీర్థము చూడదగినవి. ఆక్షేత్రంలో గండకితోపాటు చక్రనదిగూడ ఉంది. సాలగ్రామ శిలలు చక్ర

నదితోనే గండిలోనికి కొనిరాబడుతవని ఈ శాస్త్రం చెబుతుంది. ఈ దారినిగూడ ముక్తినాథం వెళ్లవచ్చు.

ముక్తినాథం - ఇది నూటెనిమిది తిరుపతులలోనే గాక ఏబదిఒక్క శక్తి పీఠాలలోగూడ ఒకటిగా లెక్కింపబడుతుంది. పూర్వం సతీదేవి తండ్రియైన దక్షునివలన అవమానంపొంది ఆత్మాహుతి చేసికొనగా శివుడామె కళేబరాన్ని భుజంపై పెట్టుకొని దుఃఖోన్మత్తుడై అటులే దేశాలు తిరుగసాగెనట. అపుడతని భుజంపై గల సతీదేవి శవం క్రుళ్ళుచుండ విష్ణు వతనివెనుక అదృశ్యరూపంలో వెళ్ళుతు చక్రంచేత సతీదేహంలోని ఒక్కొక్క భాగాన్ని ఖండించి వేసెనట. అపుడామె శరీరభాగాలు పడిన స్థలాలన్ని ఈనాడు శక్తిపీఠాలుగా నిలచినవి. ఇక్కడ సతీదేవి దక్షిణ గండస్థలం పడిందట. సతీదేవి దేహం మొత్తం ఈ విధంగా 51 ఖండాలై పడిందని నేపాలు దేశపుకథల్లో ఉంది.

ఆ క్షేత్రం ఉడయవరుల సందర్శనంచేత మరింత ప్రశస్తిని, పవిత్రతను సంతరించుకొన్నది. శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణజియ్యరుగారు తమ శ్రీరామ మహాక్రతువుకు సంబంధించిన 88వ స్తంభాన్ని క్రీ. శ. 1967 మార్చిలో 4వ తేదీనాడు అక్కడనే ప్రతిష్ఠించినారు. ఈ యాత్రలో "వోఖారా" ఒక పెద్ద మజిలి.

వోఖారా గూడ ఒక క్షేత్రమే. అక్కడ గ్రామం ప్రక్కగా శ్వేతగంధకి నది ఉంది. యాత్రికులు దానిలో స్నానంచేసి పితృతర్పణాలు చేస్తారు. ఇప్పుడిదొక నగరం. బస్సు సౌకర్యమేగాక విమాన సౌకర్యము గూడ ఉంది. అక్కడికి ముక్తినాథం 47 మైళ్ళు. అక్కడికి వెళ్ళేవారు పూజా సామగ్రితో దేకీలు అన్ని ఇక్కడనే కొంటారు.

వోఖారా కిపుడు మూడు దారులున్నాయి. వానిలో భగవద్రామానుజులు నడిచింది మొదటిదారి. అదిపుడు గోరఖ్‌పూర్ మీదుగా వెళ్ళుతుంది. ఆ దారిలో బుటవల్ చివరి గ్రామం. అక్కడినుండి తాన్‌సేన్ రాణీఘాట్ మీదుగా "రిదీ"కి నడువవలసి ఉంటుంది. అది గండకీతీరంలో ఉంది. విభీషణుడు తపస్సు చేసిన స్థలం. గండకీతీరంలో అక్కడ మహావిష్ణ్వాలయం ఉంది. రామానుజుడా స్వామిని దర్శించి మంగళాశాసనం పాడినాడు. అక్కడినుండి బయలుదేరితే

దారిలో గాలేశ్వర్ అనే శక్తిపీఠం (సతీదేవి కంఠం పడినచోటు). "రాజు" అనే జడభరతుడు, అతనిచేత ఉపదేశం పొంది రహూగణుడు తపస్సులు చేసినచోటు, "పులహా" అనే రావణ కుంభకర్ణులు పుట్టినచోటు వస్తవి. ఈ దారి "ధారా" అనే చోట "వోఖారా" దారికి కలుస్తుంది కాని మిక్కిలి శ్రమకరమైన మార్గం.

ఇక తక్కిన రెండు రైలు మార్గాలు. మొదటిది ముజఫర్‌పూర్ మీదుగా రక్సోలు చేరితే, రెండవది నేపాలువైపు వెళ్లే భారత్ రైల్వేవారి దారి.

కల్యాణ్ పత్రికవారి తీర్థాంక్-వోఖారానుండి ముక్తినాథానికి నాగ్‌దండా, ఘోరేవాని, దాన్‌భర్‌సార్, టుకచేబాజార్ అనే నాలుగు మజిలీలు చెప్పింది. గండకీ తీరంలో "దాన్‌భర్‌సార్" నుండే సాలగ్రామాలు దొరకటం మొదలవుతుందట. ఈ దారిని శ్రీ రాగం వెంకటేశ్వర్లుగారు తమ హిమాచల యాత్రా మార్గదర్శిలో ఇంకా వివరించి 11 మజిలీలు చెప్పినారు. వారు తెలిపిన దారిలో నాగ్‌దండా, ఘోరావానీ, దారా, జంనా అనేవి పెద్ద గ్రామాలు. అక్కడివరకు ఇంచుమించుగా అన్ని దారికే వసతులు మరియు పోస్టాఫీసు గూడా ఉంది.

ఈ దారిలో "కాగవేణి" అనే మరో క్షేత్రం ఉంది. అది సనకాదులు తపం చేసిన స్థలం, పితృక్షేత్రం. యాత్రికులు పిండతర్పణాలు చేస్తారు. దీని తరువాత "ముక్తినాథ" అనే పల్లె ఒకటి మొదట వస్తుంది. అక్కడ ముక్తినాథాలయ నిర్వాహకులంతా ఉంటారు. అక్కడ గూడ బియ్యం, చక్కెర వంటివి దొరుకుతవి కాని మిక్కిలి పిరియం.

ముక్తినాథాలయంలో నేపాల్ ప్రభుత్వంవారు నియమించిన పూజారులున్నారుగాని అక్కడ పూర్వంనుండి దేవదాసీలదే పెత్తనం. వారిని "జుమ్మా" లంటారు. వారు నిష్ఠాపరులై తీరిక సమయాలలో టోపీలు, మేజోళ్ళు, స్వెట్టర్లు అల్లుకొని బ్రతుకుతారు ముక్తినాథాలయం ఆ పల్లెకు మైలున్నర ఉంటుంది.

ముక్తినాథాలయం చిన్నగా ఎనిమిదడుగుల చదరంగా ఉండి బెంగాలీ పద్ధతిలో టోపీవలె ఎత్తుగా కట్టబడింది. దాని ముందు ప్రాకారం, దానికి రెండు ద్వారాలున్నవి. ప్రాకారానికి వెలుపల 20 గజాల దూరంలో గండకీనది ఉంది. ఇక్కడ వ్యాపించిన కొండలకు సాలగ్రామపు కొండలని పేరు. గండకీ నది

వానిలో గుప్తంగా పారుతూ ఇక్కడ ఎనిమిదడుగుల ఎత్తునుండి 108 ధారలుగా దూకి మైదాన దశను పొందుతుంది. ఆలయ నిర్వాహకు లాధారల కన్నిటికి పుదు ఇత్తడితో గోముఖాలు చేయించి అమర్చినారు. యాత్రికులా ధారల క్రింద 20 గజాల దూరం నడుస్తూ స్నానాలుచేసి పితృ తర్పణాలు చేస్తారు.

గండకి అక్కడ సాలగ్రామపు కొండలలో పారుతుంది గాబట్టి "సాల గ్రామి" అని పిలుస్తారు. దానిలో నారాయణి అనే మరో నది కలుస్తుంది. కొందరి మతంలో గండకికి గూడ ఆ పేరుంది. నారాయణి నదిలో ఏడు వేడినీటి ఊటలు ఉన్నవని, వానిలో ఒకటి ఒక పర్వతం నుండి బయలుదేరుతుదని, అక్కడ జ్వాలలు కనిపిస్తుంటవని తీర్థాంక్‌లో ఉంది.

ఇక్కడి స్వామికి ముక్తినాథ పెరుమాళ్ళని పేరు. ఆ స్వామి చతు ర్బాహుడు, పద్మాసనాసీనుడు. తలపై ఏడు పడగల శేషుడు, స్వామివారి కిరు వైపుల శ్రీదేవి, భూదేవి, ఎదురుగా గరుడాళ్వారు ఉన్నారు. అక్కడ ఉత్సవ మూర్తులేగాని ధృవమూర్తి లేదు. ఆలయంలో మధ్య భూమినంటి 4 చిన్న గుహ లున్నవి. వానిలో కులూలోని జ్వాలాముఖీదేవి ఆలయంలోవలె ఎప్పుడూ నాలుగు జ్వాలలు వెలుగుతుంటవి. ఒక జ్వాల క్రిందినుండి ఒక ఊట ఉంది. అదొక చిత్రం. దాన్ని జలజ్వాల అంటారు. మరొకటి ఒక రాతిపై మండుతుంది. దాన్ని "బోనిజ్వాల" అంటారు. తక్కినవానిలో ఒకదానికి స్వయంజాల, మరొకదానికి మహాజ్వాల అని పేర్లు.

ఈ ఆలయం చుట్టు అడవిగులాబి, కొండతులసి దండిగా దొరుకుతవి. కాబట్టి యాత్రికులు వోఖారా నుండి తెచ్చిన పూజాద్రవ్యాలతోపాటు వీనితోగూడ స్వామిని తృప్తిగా పూజించవచ్చు. జ్వాలలను గూడ దర్శించి అర్చించవచ్చు.

ముక్తినాథాలయానికి ఒక ఫర్లాంగు దూరంలో నృసింహస్వామి ఆలయం ఉంది. అక్కడగూడ పెత్తనమంతా దేవదాసీలదే. అక్కడి ప్రజలు బౌద్ధులు గాబట్టి వారి కొఱకక్కడ చిన్నవి పెద్దవి బౌద్ధస్తూపాలు చాలా ఉన్నవి. ముక్తి నాథునికి 100 గజాల దూరంలో ఒక బౌద్ధాలయం ఉంది. అది ఈ ప్రాంతం లోని వానికంటె పెద్దది.

ముక్తి నాథాలయానికి ఒక ఫర్లాంగు దూరంలో సాలగ్రామ పర్వతమనే గుట్టఉంది. దానిపై శ్రావణ భాద్రపదాలలో సాలగ్రామా లెక్కువగా దొరుకుతవి.

ప్రత్యేకంగా సాలగ్రామాలకు వెళ్లేవారు ఈ పర్వతశ్రేణి ముఖద్వార మైన తక్కాయికోట్ వరకు వెళ్ళుతారు. అక్కడికి దక్షిణంగా ఒక గ్రామం ఉంది. దానికి శైలపురి, లేక సాలగ్రామి అనిపేరు. సాలగ్రామాలకు వెళ్లేవారు సరుకులా గ్రామంలోనే కొంటారు. దాని సమీపంలో ఒక కొండ ఉంది. దాన్ని గూడ "సాలగ్రామ్" అనియే అంటారని సాలగ్రామ శిలోత్పత్తి విమర్శనంలో చెప్పబడింది.

దామోదరకుండ్ : దీనిలో సజీవ సాలగ్రామా లుంటవని నేపాలీయుల నమ్మకం. ఇది ముక్తినాథంనుండి 16 మైళ్ళు ఉంది. దారి ఏదీ ఉండదు. కనుక ముక్తినాథం దారిలోని టుకచేబజార్ నుండియే మార్గదర్శకులను, దారికి సరిపడే ఆహార పదార్థాలను తీసుకోవలె. రెండు దినాలు పయనించిన పిమ్మట మొదట నకిలీ దామోదరకుండ్, ఆ తరువాత మరొకనాటి పయనంతో అసిలీ దామోదర్ కుండ్ వస్తావి. కాని ఈదారి మిక్కిలి కఠినం గనుక వెళ్ళేవారరుదు అని తీర్థాంక్ చెబుతుంది.

హిమాచల యాత్రాదర్శినిలో ఇది ముక్తినాథంనుండి ఆరుదినాల పయన మని, దారిలో 40 మైళ్ళపైన చక్రతీర్థ, నారాయణ తీర్థా లున్నవని చెప్పినారు. ఈ దారిలో జూన్‌లో వర్షపాత మెక్కువ. మంచు కరిగే ప్రమాదం కూడా ఉంటుంది. అంతకు మొదలు దారి తెరిపి ఉండదు. సెప్టెంబర్ పిమ్మట హిమ పాత భయం కాబట్టి అక్కడికి వెళ్ళదలచినవారు ఆగస్టు మొదటి నుండి సెప్టెం బర్ చివరి వరకు వెళ్ళుతారు.

గండకీనది మధ్యటిబెట్టుకు దక్షిణంగా హిమాలయాలలోని ధవళగిరి శ్రేణిలోగల సప్తగండకి కొండల్లో పుట్టి, టిబెనీఘాట్ వరకు పారుతుందని భౌగోళిక కోశం చెబుతుంది.

కొందరు ధవళగిరినే "సప్త గండకి" అంటున్నారు. అక్కడ ఇది రెండు గుహల నడిమినుండియో, ఒక కుండంనుండియో లేక పర్వతాకారం గల

విష్ణుదేవాలయం నుండియో పుట్టిందని నేపాలీయుల నమ్మకం. గండకి కొండలలో పుట్టటం చేతనే దీన్ని ''గండకి'' అని వారు పిలుస్తున్నారు. పురాణాలు దీన్ని శ్వేతగండకి, కృష్ణగండకి అని రెండుగా చెప్పినవి.

బుద్ధభగవానుడు నిర్యాణంచెందిన ''కుసింగర'' నగర ప్రదేశం గండకీ తీరంలోనే ఉంది. హూయెన్‌త్సాంగ్ మనదేశానికి వచ్చి దాన్ని దర్శించేనాటికి దాని గోడలు శిథిలావస్థలో నుండెనట.

''కన్నింగ్‌హామ్'' గారి కథనం ప్రకారం ''బుద్ధుని నిర్యాణ ప్రదేశం'' అరుద్వానగరానికి వాయువ్యంగా, చిన్నగండకియొక్క పాతపాయకు పశ్చిమంగా, అతని దహనప్రదేశం అరుద్వాకీశాన్యంగా చిన్నగండకియొక్క పాతపాయకు తూర్పుగా ఉన్నవి.

## గండకీనది గాథలు

ఈనది తులసీదేవియొక్క శరీరంనుండి పుట్టిందని దేవీభాగవతం బ్రహ్మ వైవర్త పురాణం చెబుతవి. మరికొన్ని భిన్నంగా గూడ చెబుతున్నవి కనుక అవి యిక్కడ మనవిచేస్తాను.

జగన్మోహినిని శివుడు రమించటంచేత ఆమెకు రతిశ్రమవలన చెమటపట్టి అది గండకీనదిగా మారిందని స్కాంధపురాణం చెబుతుంది.

ఆర్యకథానిధిలో దీన్నిగురించి మరోగాథఉంది. గండకి భూలోకంలో ఒక వేశ్య. ఒకప్పుడు దేవలోకంలో పరమపతివ్రత లెవ్వరనే ప్రశ్నవచ్చింది. అపుడు నారదుడు ఈమెపేరు చెప్పినాడు. అదివిని లోకమాతలునవ్వి ఆమెను పరీక్షించ టానికి పతులను పంపినారు.

మొదట విష్ణువామె యింటికి కౌశికునివలె వ్యాధిపీడితుడై వచ్చినాడు. ఆమె వేశ్యయైనప్పటికి ప్రతిదినం తనయింటికి మొదలెవరు వస్తారో ఆనాటికిక అతడే పతియనే తాత్పర్యంతో సమస్తోపచారాలు చేసేది. ఆతరువాత మరెందరు వచ్చినా అంగీకరించేదిగాదు.

విష్ణువు తరువాత బ్రహ్మ, అతని పిమ్మట శివుడు మంచి రూపవంతులుగాను, ధనవంతులుగాను వచ్చి ఎంతో ప్రలోభపరచినారు. కాని ఆమె లొంగిపోలేదు. ఆనాటికి ఆ కుష్టుగ్రస్తుడే తనపాలి దైవమనినమ్మి చేయవలసిన సపర్యలన్ని చేసింది. అతడన్నం తింటుండగా వ్యాధిలో చివికిన వ్రేలొకటి ఊడి దానిలో పడింది. అయినా ఆమె దాని నసహ్యించుకోకుండా ఆవ్రేలిని తొలగించి ఆభుక్త శేషాన్ని భుజించి ఆరాత్రి అతనికోరికను తీర్చింది. తరువాత తెల్లవారుతుండగా అతడు మరణించినాడు. అదిచూచి ఆమె అతనికోసం మిక్కిలి దుఃఖించి శవసంస్కారానికి చేయవలసినవన్ని సక్రమంగా నిర్వర్తించి సహగమనానికి సిద్ధపడి, శవాన్ని చితిపైఉంచిన తరువాత తాను మండుతున్న చితిపై ఎక్కింది. అపుడు విష్ణువామె పాతివ్రత్య ధర్మానికి సంతసించి మాయారూపాన్ని విడిచి నిలిచి ఏమికావలెనో కోరుకొమ్మన్నాడు. అపుడామె మీరు నాగర్భంలో పుత్రుడుగా పుట్టవలెనని కోరించి, అది విని విష్ణువు ఈ రూపంలోనేను పుట్టటం మనిద్దరికీ గౌరవకారణం కాదని చెప్పి దేహావసానంలో ఆమె నదీరూపాన్ని ధరించేటట్లు, తాను దానిలో సాలగ్రామ రూపాన పుట్టేటట్లు వరమిచ్చినాడు.

శ్రీ M. S. కృష్ణమాచార్యగారు తమ సాలగ్రామ శిలోత్పత్తి నిదర్శనం అనే తమిళ పుస్తకంలో మరోరెండు గాథలిచ్చినారు.

శనీశ్వరునిబాధ మానవులకేగాదు దేవతలకుగూడ తప్పదు. శివుడొకప్పుడతని దశకు వెఱచి కంపకోట బెట్టుకొని దానిలో దాగినట్లొక కథ ఉంది. ఒకప్పుడావంతు విష్ణువు పాలికిగూడ పడింది. ఆయన ఆ శనిభగవానుని పీడ నను భవించటాని కిష్టపడక శిలాపర్వతంగా మారి ఒకచోట దాగినాడు. శని అది ఏ విధంగానో పసిగట్టి ఒక కీటకరూపం ధరించివెళ్లి ఆ శరీరాన్ని తొలవటం మొదలుపెట్టినాడు. అపుడా బాధ భరించలేక పర్వతరూపుడైన విష్ణుశరీరం నుండి రెండు చెమట బిందువులుపుట్టి ధారలై ఒకటి తూర్పుముఖంగాను, మరొకటి పశ్చిమముఖంగాను పారినవి. అవే ఈనాడు మనం గండకిఅని పిలిచే నదులు.

శనిదశతొలగి విష్ణువు యథారూపం ధరించిన తరువాత అంతవరకు తాను ధరించిన పర్వతరూపాన్ని ఎవరు పూజిస్తారో, దానినుండి పుట్టిన నదులలో ఎవరు స్నానంచేస్తారో వారికి మోక్షం కలుగుతుందని వరమిచ్చినాడు. ఈ కథ దేనిలోనిదో వారుచెప్పలేదు.

రెండవకథ ప్రకారం ఒకనాడు బ్రహ్మ భూలోకంలో పాపం మితిమీరి పోయిందని ఆలోచిస్తుండగా గండస్థలం చెమరించి రెండు బిందువులు నేలపై బడి కన్యారూపం ధరించినవి. గండస్థలంనుండి పుట్టినందుకు బ్రహ్మ ఆమెకు "గండకి" అనిపేరుబెట్టి పంపించినాడు. ఆమెవెళ్లి ఒక ఏకాంత ప్రదేశంలో బ్రహ్మను గురించి పెద్దగా తపస్సు చేసింది. అపుడతడు ప్రత్యక్షమై ఏమి కావలెనని యడిగినాడు. ఆమె దేవతలందరు నాకడుపున పుత్రులుగా పుట్టవలెనని కోరింది. బ్రహ్మ అదివిని దేవతలు నీయొక్క కోరిక నంగీకరించరు కనుక ఇది అయ్యేపని గాదన్నాడు. అదివిని ఆమె కోపించి దేవతలందరూ కీటకరూపు లౌదురుగాక"! అని శపించింది. అది తెలిసిన వారామెను జడరూపిణి వౌదువు గాక!" అని శపించినారు.

గండకి, దేవతలు పరస్పరం ఆ విధంగా శపించుకొని వాని విముక్తికై బ్రహ్మ దగ్గరకు వెళ్ళినారు. అతడు నేను దీనికి సమర్థుడును గానని వారిని విష్ణువు దగ్గరకు పంపినాడు. విష్ణువు వారి శాపాలు విని అవి మార్చటానికి సాధ్యం గాక, దీర్ఘంగా ఆలోచించి-

దేవహూతి కర్దమ ప్రజాపతుల పుత్రులైన జయవిజయులు నాభక్తులు. ఒకానొక కారణంచేత కరిమకరులై పోరి వారు ముక్తినంద పలసియున్నారు. కనుక ఓ గండకి నీవు దేవతల శాపప్రకారం ఒక నదీ రూపాన్ని ధరించు. వీరు నీలో కరిమకరులై పోరుతారు. నేను మకరిని ఖండించటానికి చక్రాన్ని పంపు తాను. దాని స్పర్శచే నీవు పవిత్రమౌతావు. నాటినుండి నీకు చక్రనది అని వ్యవహార మేర్పడుతుంది. ఓ దేవతలారా! మీరు కీట రూపాలు ధరించి మీ మీ చిహ్నాలతో ఆ నదిలోని శిలల్లో నివసించండి. దానితో గండకీదేవి కోరిక తీరి నట్లవుతుంది. మీకు శాపవిమోచనం కలుగుతుంది. మీరు విడిచిపోయిన పిమ్మట ఆ శిలలు నాకు ప్రీతికరమైనవై పూజింపబడుతవి- అని వారి శాపాలను పరిష్కరించి పంపినాడు. ఈ కథ వరాహ పురాణంలో ఉన్నట్లు తెలుస్తుంది.

## -: తులసీదేవి చరిత్ర :-

ఈ కథను శివపురాణం అన్నిటికంటె విస్తారంగా చెప్పింది. దానిలో ఆమెవి రెండు జన్మల వృత్తాంతాలున్నవి. ఆమె మొదట జన్మలో కాలనేమి అనే రక్కసుని బిడ్డ; పేరు బృందాదేవి.

ఒకప్పుడింద్ర బృహస్పతులు శివుని దర్శించటానికి కైలాసానికి వెళుతున్నారు. అపుడు శివుడు వారిని పరీక్షించటానికి మాయా జటియై దారిలో ఒక చోట కూర్చున్నాడు. ఇంద్రు డతనిని చూచి శివుడిప్పుడు కైలాసంలో ఉన్నాడా అని యడిగినాడు. అతడు బదులు పలుకలేదు. ఇంద్రుడు కోపించి వజ్రాయుధం ఎత్తినాడు. అతని చేయి అలాగే నిలిచిపోయింది. అంతేగాక ఆ జటి కంటి నుండి ఒక అగ్నిజ్వాల యింద్రుని పైకి వచ్చింది. అది చూచి బృహస్పతి ఆ జటి శివుడేనని తలచి, స్తుతించి దాని నుండి తన శిష్యుని రక్షించుకున్నాడు.

ఇంద్రుని కావిధంగా ప్రాణదానం చేసి గురుడు జీవనామకుడైనాడు. అనంతరం శివుడు తన కంటిజ్వాల నేమి చేయవలెనని అడిగినాడు. గురువు దానిని సముద్రంలో విడువున్నాడు. శివుడా విధంగా చేయగా ఆ యగ్ని ఒక బాలుడై యలలపై తేలుతు ఏడువ సాగినాడు. సముద్రుడా బాలుని జూచి బ్రహ్మను బిలిచి వీడు నా కుమారుడు. ఇతని జాతకం పరిశీలించి నామకరణం చేయమని కోరినాడు. అంత బ్రహ్మ ఆ బాలుని పరిశీలించటానికి దగ్గరకు వెళ్లగా బాల్యచేష్టతో వాడు బ్రహ్మకంఠాన్ని బిగ్గరగా పట్టుకున్నాడు. ఆ పట్టును సముద్రుడేలాగో సిడిపించినాడు. అపుడా బాధకు బ్రహ్మ కన్నులనుండి నీరు రలింది. అందుచేత బ్రహ్మ వానికి ''జలంధరు'' డని పేరు బెట్టి, వీడు పెరిగిన పిమ్మట మహాబలశాలి అవుతాడు. దేవతలందరిని జయిస్తాడు అని చెప్పి వెళ్ళినాడు

జలంధరుడు పెద్దవాడై బృందాదేవిని పెండ్లి చేసుకున్నాడు. పిమ్మట ఒకనాడు తన వారితో దేవతలంతా తన తండ్రిని మథించి ఐశ్వర్యాన్నంతా కొల్లగొట్టినారని తెలిపి, యింద్రుని దగ్గరకు మా సంపద మా కిమ్మని దూతను పంపినాడు. అత డంగీకరించలేదు. జలంధరుడు దండెత్తిపోగా వారు సమూలంగా ఓడిపోయినారు. విష్ణువుగూడ ఓడి ఏంకావలెనో కోరుకో అన్నాడు. అది విని జలంధరుడు నాకేదీ అక్కరలేదు. నీవు మా యక్కగారితో వచ్చి మా యింటిలోనే ఉండిపో! అన్నాడు. విష్ణువునకది యిక తప్పలేదు. అపుడు దేవతలందరూ విష్ణువు వైకుంఠం విడిచి వెళ్ళినందుకు శంకరునితో మొరపెట్టుకోగా అతడు మనస్సులో నారదుని తలచుకొని అతడు రాగానే విష్ణువును తెచ్చేపని అతని కప్పగించినాడు.

కార్యభారం పూని నారదుడు జలంధరుని దగ్గరకు వెళ్ళి చూసినావా! శివుడు ఎంతో పేదవాడైనా సర్వమంగళ భార్యగాబట్టి అంత ఐశ్వర్యవంతుడైనాడు. నీ వంటి వానికట్టి వనిత లేకుండటం వెలితి అన్నాడు. అదివిని వాడు అయితే నేను శివుని గెలిచి ఆమెనే తెస్తానని కైలాసం పైకి వెళ్ళగా శివుడు దారిలోనికి వృద్ధవేషంతో ఎదురుగా వచ్చినాడు. జలంధరు డతన్ని చూచి శివునికి గౌరినిమ్మని సందేశం కొనిపోవలసిందిగా చెప్పినాడు. ఆ ముసలివాడది వినలేదు. పైగా అక్కడ ఉండే ఒక సుదర్శనాన్ని చూపి దీన్ని యెత్తి తలపై పెట్టుకో చూదాం అన్నాడు. అది విని వాడు కోపించి నీవు నన్ను పరీక్షిస్తున్నావా! అని లేచినాడు. అది చూచి శివుడాగ్రహంతో ఆ చక్రాన్నెత్తి అతనిపై విసరినాడు. దానితో జలంధరుడు రెండు తునకలైనాడు. శివుడు కైలాసానికి వెళ్ళినాడు.

జలంధరుడు శివునిపైకి యెత్తి వెళ్ళే అపుడు బృందాదేవి యెంతో వారించింది. కాని ఫలం లేకపోయింది. భర్తరాక ఆలస్యమై ఆమె దిగులుతో ఉద్యానానికి వెళ్ళింది. అక్కడ అంతవరకా ఇంటిలో ఉండి ఆమె సౌందర్యం జూచి మరులుగొన్న విష్ణువు మాయా సన్యాసియై రెండు కోతులను సంపాదించుకొని కూర్చున్నాడు. బృంద అతన్ని చూసి నిజమైన వాడనితలచి నమస్కరించి తన భర్త సంగతి తెలిపి అతనిరాక ఎందుకాలస్య మయిందని అడిగింది. అపుడతడు తన కోతులకు సైగచేసినాడు. అవి వెళ్ళి జలంధరుని శరీరాన్ని చెరొక తునకతెచ్చి అక్కడ పెట్టినవి. అదిచూచి ఆమె మిక్కిలి విలపించి తన పతి నేవిధంగానైనా బ్రతికించమని ఆ కపటముని కాళ్లపై పడింది. అతడు కరుణించినట్లు నటించి ఈ శరీర భాగాలు తీసికొనివెళ్ళి గంధపుష్పాలతో అలంకరించి నీ యింటిలో ఒకచోట ఉంచు, బ్రతుకుతాడు పొమ్మనిచెప్పి ఆమె అవి కొనివెళ్ళి అలంకరించిన పిమ్మట తాను మాయారూపంలో ఆ శరీరంలో ప్రవేశించి దాన్ని జీవింపజేసినాడు.

పునర్జీవితుడైన పతినిచూసి బృంద సంతోషించింది. కొన్ని దినాలు గడిచిన పిమ్మట ఒకనాడామె అతడు ఒంటరిగా నిద్రించే సమయంలో గదిలోనికి వెళ్లగా తన పతి శరీరంలో నీలమేఘ శ్యాముడు కనిపించినాడు. ఆమె వెంటనే జరిగిన మోసం గ్రహించి నీ భార్యగూడ నావలెనే మరొకరికి చిక్కుగాక. కోతుల సాయంతో నీవీమోసం చేసినావు. గాబట్టి అవే నీకు తోడగుగాక అని శపించి పతిదేహంతో తాను సహగమనం చేసింది.

బృంద మరణించి నప్పటికీ విష్ణువు కామెమీద మక్కువ చావలేదు. రాత్రింబవళ్ళా శ్మశానంలోనే పడిఉండ సాగినాడు. అదిచూచి లక్ష్మీదేవి వెళ్ళి శివునితో చెప్పుకున్నది. అపుడాయన మూల ప్రకృతియైన అంబికను పిలచి విష్ణువు నేవిధంగానైనా యింటికి తెమ్మని పంపినాడు. అపుడామె లక్ష్మికి శక్తి మయాలైన మూడు బీజాలిచ్చి యివి తీసుకువెళ్ళి ఆమెచితి ప్రదేశంలో చల్లుమని చెప్పింది. లక్ష్మీదేవి వానిని బృందాదేవి చితిప్రదేశంలో చల్లగా వానినుండి అక్కడ ఉసిరిక-తులసి-మాలతి అనే మూడు చెట్లు మొలిచినవి. వాని పరిమళం సోకగానే విష్ణువుకు మోహపరితాపం తీరిపోయి వైకుంఠానికి వెళ్ళినాడు. ఆ వృక్షాలలో అతనికి తులసి మిక్కిలి ప్రియమైన దయింది.

వృక్షాధిష్ఠాత్రియైన తులసీదేవి లలితమూర్తియై గోలోకంలో యెల్లపుడు సంచరిస్తుండేది. శ్రీకృష్ణు డామెను విడిచి ఉండేవాడుగాదు. అది చూచి అసూయా పరురాలైన రాధ ఆమెను భూలోకంలో పుట్టుమని శపించింది.

ఆ లోకంలో శ్రీకృష్ణుని నిరంతరం అంటిపెట్టుకొని సేవించేవారిలో సుదాముడు అనే గోపాలుడొకడు. వాడొకప్పుడు రాధాదేవి కోపానికి గురియై భూలోకంలో పుట్టవలసిందిగా శపింప బడినాడు.

రాధాదేవి శాపానికి గురియైన తులసీదేవి ధర్మధ్వజుడనే రాజుగారికి కూతురై పుట్టింది. సుదాముడు కశ్యపమహర్షి వంశంలో శంఖచూడుడై పుట్టినాడు.

కశ్యపుని కుమారుడు విప్రచిత్తి. అతని పుత్రుడు రంభుడు. వాని తనయుడు శంఖచూడుడు. ఇది వాని వంశక్రమం.

తులసీదేవి పెరిగిన పిమ్మట బదరికావనం వెళ్ళి తపస్సు చేసికొనసాగింది. శంఖచూడుడు గూడ తల్లిదండ్రి యాజ్ఞను పొంది పుష్కర తీర్థానికి వెళ్ళి తపంచే బ్రహ్మను మెప్పించి అజేయమైన వరాలు పొందినాడు. అపుడు బ్రహ్మ వాని తపానికి మెచ్చి నీవు బదరికా వనానికి వెళ్ళి అక్కడ "తులసి" అనే కన్య తపం చేస్తుంది ఆమెను పెండ్లి చేసికొని సుఖించు అని చెప్పినాడు. బ్రహ్మ మాటపై అతడక్కడికి వెళ్ళగా ఆమె అంగీకరించలేదు. అపుడు బ్రహ్మ మరల తులసికి ప్రత్యక్షమై అతనిని వివాహమాడుమని చెప్పినాడు. వారిద్దరు గాంధర్వ విధితో దంపతులైనారు.

వివాహానంతరం యింటికి వచ్చి రాజ్యమేలుతు శంఖచూడుడు గూడ ఒక నాడు తన వారితో దేవతలు తమకన్యాయం చేసినారని విని స్వర్గంపైకి దండెత్తి పోగా వారందరూ ఓడిపోయి వెళ్ళి శివునితో మొరపెట్టుకున్నారు. అది విని శివుడు శంఖచూడుని దగ్గరకు దూతను పంపినాడు. కాని అతడు సంధికంగీకరించలేదు. విగ్రహానికి సిద్ధమై ఉభయులూ సైన్యాలతో శ్రీశైలానికి ఉత్తరంగా ఉండే సిద్ధాశ్రమం దగ్గర విడిసినారు. శంఖచూడుడు శివుని చూడబోయినాడు. శివుడపుడు తపోనిష్ఠలో ఉన్నాడు. శంఖచూడు డతని మూర్తిని జూచి ఆశ్చర్యపడి నమస్కారం జేసి సెలవు తీసుకొని యుద్ధానికి సిద్ధమైనాడు. దానిలో అతడు శివుని శూలానికి బలియైనాడు.

విష్ణువదివరకే తులసిపై మరులుగొన్నవాడు గాబట్టి శంఖచూడుని దేహంలో ప్రవేశించి యిల్లుజేరి బ్రహ్మవచ్చి తమకు సంధిజేసెనని బొంకినాడు. తులసీదేవి నిజమని నమ్మి కాపురం చేసింది. కాని దినాలు గడుస్తుండగా ఆమె కతనిలో కొన్ని అపరిచితమైన చేష్టలు కనిపించి నీవెవరో నిజం చెప్పు లేకుంటే శపిస్తానని నిలదీసింది. విష్ణువు విధిలేక నిజరూపం చూపినాడు. అపుడామె అమాయకురాలైన నా శీలాన్ని బలిగొన్నావు. కాబట్టి రాయివై పడిఉండుమని శపించింది. అది విని విష్ణువు తులసీ నీయొక్క ఈ దేహం పవిత్రమైన గండకీ నదిగా మారుతుంది. నేనా నదిలో సాలగ్రామ శిల నౌతానని చెప్పినాడు. ఇది శివ పురాణం చెప్పిన తులసీదేవి కథ.

దేవీ భాగవతంలో గూడ తులసీదేవిపతి శంఖచూడుడే; కాని కథనం దీనికి కొంత భిన్నంగా ఉంది. దానిలో ఆమె బ్రాహ్మణ కన్య. అందంలో ఆమెకు తులలేనందుచేత పండితులామెను "తులసి" అన్నారు. తన పాతివ్రత్య మహిమ చేత పతికి మరణం ఉండదు. అందుచేత విష్ణువు ఒకవైపు శివుని శంఖచూడుని పైకి యుద్ధానికి పంపి మరోవైపు తాను శంఖచూడుని రూపం ధరించి ఆమె ఇంటికి పోతాడు. ఆమె అతనిని నమ్మి శీలచ్యుత కావటంతో అక్కడ శంఖచూడుడు శివునివలన మరణిస్తాడు.

శ్రీ M. S. కృష్ణమాచార్యగారు చెప్పిన మరొక కథ ప్రకారం శంఖచూడుని చంపటానికి విష్ణువే శివునికి శూలమిస్తాడు. అంతేగాక అతని కంఠంలో

బ్రహ్మ ఇచ్చిన ఒక కవచం ఉంటుంది. అది ఉన్నంతవరకు వాడు చావడు గనుక తాను బ్రహ్మరూపంలో వెళ్ళి ఇంద్రుడు కర్ణుని కవచకుండలాలు హరించినట్లు యుక్తిగా దాన్ని తీసికొని వస్తాడు. అతడు మరణించిన తరువాత తానా రూపాన్ని ధరించి తులసీదేవి దగ్గరకు వెళ్ళుతాడు.

తులసీదేవికి సంబంధించిన ఈ కథలన్ని విష్ణువునకు మచ్చలేగాని శ్రీవత్సాలుగావు. అవి అతని లోకపాలకత్వాన్ని నిలబెట్టవు. జలంధరునికి ప్రతి నాయకుడుగా, కామలోలుడుగా, శాఠ్యం నడిపినవాడుగా కనిపిస్తాడు. కాబట్టి ఈ కథల్లో దేవీభాగవత కథ నయంగా ఉంది. అది అతని దోషాన్ని ఒక విధంగా దిద్దింది. అది ఈ విధంగా ఉంది.

నిజం తెలిసిన తరువాత తులసీదేవి విష్ణువును నీవిలా ఎందుకు చేసినావు అని నిలదీస్తుంది. అపుడతడిలా చెబుతాడు. "ఓవరాననా ! నీవు నా గురించి తపం చేసిన కాలంలో రెండోవైపు శంఖచూడుడు నిన్ను పొందవలెనని తపం చేసినాడు. అపుడు నీకంటె అతడు చేసిన తపం ఎక్కువయింది మరి తొందరగా ఫలించింది కాబట్టి ఆకారణంచేత నీవతనికి భార్యవైనావు. ఈనాటికి అతని అనుభవం నీతో తీరిపోయింది. నీవు స్త్రీవైనప్పటికి నన్ను గురించి వేదవతి వలె తపం చేసినావు కాబట్టి ఆ ఫలితం నేను నీకు ఈయవలసి ఉంది. అందుకే ఈ రూపంలో వచ్చినాను" అన్నాడు.

తక్కిన పురాణ కథలకంటే ఈ భాగవతంలోని విషయం సత్యశివ సుందరంగా ఉంది. లోకంలో ఎవరైనా కర్మాధీన ప్రాణులే. ఒకరిచేత మరొకరికి కలిగే సుఖదుఃఖాలకు వారి వారి కర్మలే కారణంగాని మరొకటి కాదనే వస్తుధ్వని దీనిలో ఉంది. అందుచేత అవసరమైనంత మేరకు దేవీభాగవత కథను అను బంధంలో యిచ్చినాను.

శంఖచూడుని ఎముకలనుండి శంఖజాతులు పుట్టడం అన్ని కథల్లోనూ సమానమే కాని దేవీభాగవతంలో తులసీదేవియొక్క దేహంనుండి గండకీనది, కేశాలనుండి తులసీ వృక్షాలు పుట్టినట్టు చెప్పబడింది. ఇది దానిలోని మరో విశేషం.

-: కావ్యాత్మ :-

శృతి స్మృతి పురాణాల పిమ్మట భారతీయ వాఙ్మయంలో చెప్పదగినవి కావ్యాలు మరియు శాస్త్రాలు. కావ్యం ఊహాజన్యమైతే శాస్త్రం పరిశీలనాఫలం. కవికి భావనాబల మవసరమైతే శాస్త్రకారునికి సత్యాన్వేషణ దృష్టి అవసరం. కాబట్టి ఉత్తమ కావ్యంవలె ఉత్తమశాస్త్రం గూడ ఒకానొక ప్రతిభావంతునిచేతనే పుడుతుంది. తపఃఫలంచేతనే జనిస్తుంది.

కావ్యాలు మనస్సుకాహ్లాదాన్నిస్తే శాస్త్రాలు బుద్ధికి పదును బెట్టుతవి. అందుచేత పాఠకులు కావ్యాలపై వలెనే శాస్త్రాలపై గూడ అభిరుచి పెంచుకో వలె. శాస్త్రపరిశ్రమ చేసేవాని బుద్ధి తొందరగా దెబ్బతినదు. అంతేగాక పరిశ్రమ చేయను చేయను ఆతనికి శాస్త్రంలో గూడ కావ్యంవలెనే సౌందర్యం కనిపిస్తుంది.

బాలవ్యాకరణం మామూలుగా చదివినపుడు బండనే కాని దాన్ని రమణీ యంతో చదివితే ఎంతో రమణీయంగా ఉంటుంది. ఏ శాస్త్రానికైనా దాని రచనా పద్ధతి, విషయక్రమం, వానికిచ్చిన ఉదాహరణాలు పరిశీలిస్తేగాని దానిలో ఉండే ఔచిత్యంగాని, సౌందర్యంగాని కనిపించదు.

పాఠకులకు దీనిలో గూడ అటువంటి సౌందర్యం కొంత కనిపిస్తుంది. దీనిలో శాస్త్రకారుని ప్రతిభ అంతా సాలగ్రామ శిలలను పరిశీలించి భేదాలు నిర్ణ యించి వానికి నామకల్పనం చేయటంతో కనిపిస్తుంది.

శాస్త్రకర్త దీనిలో వర్ణఫలాలు, ఆకార ఫలాలు చెప్పినపుడు —

వృత్తాననం భుక్తికరం వాదికౌశల దాయకమ్
స్థిరాసనా యుతంచాపి రాజ్యభోగాప వర్గదమ్.

* * *

మేచకా కీర్తిహా ధౌతాం గారవత్సా యశోహరా
పాండు రూపార్థ శమనీ మలినా పాపధీకరీ.

వంటి పంక్తులలో కొంత భావాత్మక పద్ధతి ననుసరించినట్లు కనిపిస్తుంది. ఇక విషయంలోనికి ప్రవేశించిన పిమ్మట మొదట అవతార దర్శనం, దానిలోని రామ

కృష్ణ భేదాలతో రామాయణ భాగవత కథానుసంధానం, అనంతరం కేశవనామ స్మరణ, తదనంతరం ఇష్టదేవతా స్వరూప దర్శనం, అంతంలో ఫలశ్రుతి చెబుతూ ఆస్తికమహాశయులకు దీనిలో ఒక ఉపాసనాక్రమాన్ని చూపించినాడని పిస్తుంది.

ఈ శాస్త్రానికి మూలం సాలగ్రామం కాబట్టి దీనిపుట్టుకకు కారణాలైన కథలు మొదట చెప్పినాను. వానిలో ప్రధాన పాత్రలు ముగ్గురు శ్రీమహావిష్ణువు తులసీదేవి, శంఖచూడుడు. కథాంతంలో మిగిలిపోయిన ప్రేమమూర్తు లిద్దరు-ఒకరు నదిగా మరొకరు శిలగా మారి విశ్వనాథవారి కిన్నెరసానిని తలపిస్తారు. ప్రబంధాలలో పరాంకోటికెక్కిన వసుచరిత్రగూడ నదీపర్వతాలతోనే పుట్టింది.

సాలగ్రామం హిందువులకు విష్ణుస్వరూపం. అతనికి తులసీ సలిలాభిషేకం పరమప్రియం. దాన్ని చేసినవారికి అనంతమైన పుణ్యం కలుగుతుంది.

పూజారులు మొదట పంచపాత్రలో తులసీతీర్థాన్ని సిద్ధంచేస్తారు. తులసిలో కృష్ణతులసి లక్ష్మితులసి భూతులసి అనే భేదాలున్నవి. పూజా సమయంలో కృష్ణతులసిని తీర్థానికి, లక్ష్మితులసిని భూతులసిని అర్చనకు వాడుతారు. ఇది సంప్రదాయం. పంచపాత్రలో జలంపోసి దానిలో కర్పూరం ఏలకులు మొదలైన సుగంధద్రవ్యాల చూర్ణం కలిపినపిమ్మట తులసిదళాలు వేస్తారు. ఆ దళాలుగూడ ఆకులుగాక శిఖలు మాత్రమే మంత్రవిధానంతో గిల్లుకొనివచ్చి వేస్తారు. ఆవిధంగా సిద్ధపరచిన తీర్థాన్ని శంఖంతో ముంచుతు అభిషేక మంత్రాలతో సాలగ్రామాన్ని అభిషేకిస్తారు. అభిషేకానంతరం శంఖంతో పనిముగిసి, పళ్లెరంలో సాలగ్రామం తులసీజలం మాత్రం మిగులుతవి. అవి కథలోని గండకీ నదికి సాలగ్రామ పర్వతానికి ప్రతీకలు.

శంఖతోయం, తులసీజలం, సాలగ్రామతీర్థం విడివిడిగానే ఎంతో మహిమ గలవి. అవి మూడు ఒకేచోట గూడినపుడు ఇక అడుగ నవసరముండదు. ఆ మాహాత్మ్యం త్రివేణీ సంగమంవలె ముమ్మడి అవుతుంది. ఆతీర్థం సకల తాపోప శమన కారకం కావటంలో సందేహముండదు. వస్తుగుణ ప్రకాశికలో తులసీ శంఖాల గుణాలీవిధంగా చెప్పబడినవి.

ii)

తులసి:- దీని గాలియు స్పర్శయు దీర్ఘజీవితమునకు మూలాధారములు. ఇది హృదయమునకు ప్రీతికరమైనది. రుచిని కలిగించును. వాతశ్లేష్మములను రెంటిని హరించును. క్రిములను సంహరించును. కుష్ఠము, పార్శ్వశూల, మూత్ర కృచ్ఛ్రములను బోగొట్టును. భూతభాధలను నివారించును.

తులసివనమున శవ మెంతకాల ముంచినను చెడిపోదని ఆధునిక రసాయన శాస్త్రజ్ఞులును, పూర్వ వైద్యులునుగూడ వక్కాణించి యున్నారు.[1]

శంఖము:- దీనిధ్వని మంగళప్రదమైనది. భూతప్రేత గ్రహ పిశాచములను తొలగించును. బల వీర్యములను ప్రసాదించును. పుష్టిదము. శూల, గుల్మ ము శ్వాసములను హరించును. విష హరమైనది. నేత్రవ్యాధులను బోజేయును. గ్రహణిరోగము నిర్మూలించును. బుగ్గమీది మొటిమలు హరించును. కామిల క్షయ రోగములందు బాగుగా పనిజేయును.[2]

సాలగ్రామం:- వైద్యశాస్త్రజ్ఞులు దీనిగుణాలు చెప్పలేదు గాని మాహాత్మ్యం మాత్రం గొప్పగానే ఉంది. సాలగ్రామానికి హిరణ్యగర్భమని పేరు. ''హిరణ్యగర్భం'' అంటె బంగారు తొడుగుగలది లేదా తనలో బంగారం గలదని తాత్పర్యం. బంగారం ఉండటమో దాని పూతగాని లేదా మచ్చలుగాని కొన్ని చుక్కలు గాని, ఉండటమో సాలగ్రామంయొక్క ప్రధాన లక్షణాలలో ఒకటి. ఔషధోపయోగంగా బంగారంయొక్క గుణాలీవిధంగా చెప్పబడినవి: ఇది ఉత్తమమైన రసాయనద్రవ్యము. పవిత్రమైనది. వీర్యవృద్ధిని పెంపొందించును. బలకరమైనది. పుష్టిని గలిగించును. నేత్రములకు హితకరమైనది. బుద్ధిని వికసింప జేయును. జ్ఞాపకశక్తిని ప్రసాదించును. హృదయమునకు మంచిది. ఆయువును పెంపొందించును. కాంతిని ప్రసాదించును. వాగ్విశుద్ధిని దయచేయును. విషహరము, క్షయను హరించును. ఉన్మాదము నుదుమాడును. జ్వర శోషలను శమింప జేయును.

పద్మపత్రము నందుదకబిందు వెట్లంటదో బంగారము సేవించిన మనుజుని శరీరమున విషమటుల లగ్నముగాదు. స్వర్ణాభరణ ధారణము శరీరము

---

వస్తుగుణప్రకాశిక. పుట. 1. 431; 2. 1004

సందలి రక్తదోషములను శమింప జేయుటేగాక విషమును శరీరమునందు సంక్రమింపజేయదు. సౌభాగ్యకరమైనది. స్వర్ణస్పర్శనము ఆవర్త దోషమున స్త్రీలు పొందుబాధలు కలుగకుండ హరించును. కావున దాని ధారణము పురుషులకంటె స్త్రీలకు మిక్కిలి యవసరము.

స్వర్ణపాత్రలలో భుజించుట ఆరోగ్య ప్రదము, కాంతిని వీర్యవృద్ధిని బలమును ఓజస్సును మరియు పంచేంద్రియములకు శక్తిని ప్రసాదించును.[3]

మానవులకు కలిగే వ్యాధులు దైహికం మానసికం అని రెండు విధాలు. కొన్ని వైద్యశాస్త్రాల మతప్రకారం సమస్త వ్యాధులకు మనస్సే మొదటి కారణం. మనస్సు వాయుతత్వంతో కూడింది కాబట్టి దాని అస్తవ్యస్తతయే భూతబాధలకు కారణ మవుతుంది. అందుచేత పూర్వులు మానసిక వ్యాధులను "గాలిచేష్ట" అని పిలిచినారు.

వస్తుగుణంలో తులసీ శంఖాలు రెండు భూతబాధలు పోగొట్టేవిగనే చెప్పబడినవి. ఇక ఆరాధనా విధానంలో చూస్తే శంఖ సాలగ్రామాలు రెండింటికి ఇటు దక్షిణ మార్గంలోను అటు వామమార్గంలోను స్థానముంది. వస్తుగుణం ఇక సరేకాబట్టి తులసీతీర్థం శంఖాన పోయబడినపుడు దానిలో సాలగ్రామం తడపబడినపుడు అది సర్వవ్యాధి నివారకం అగుటలో సందేహంలేదు.

పూర్వం సదాచారుల యిండ్లలో ఎవరి కేజబ్బు చేసినా ఇంటి యజమానిగారో లేదా కులపురోహితుడో యిచ్చే తీర్థమే మొదటి మందు. ఆనాడదే విధంగా ఎన్నో వ్యాధులు నిమ్మళించినవి. అందుచేత ఆనాటివారి కింటిలో సాలగ్రామం, తులసి, శంఖం తప్పక ఉంచుకొని రక్షించుకొంటూ పూజించుకో వలసినవైనవి. వానిలో ఉండే ఆరోగ్యమైన మరియు ఆధ్యాత్మికమైన మాహాత్మ్యన్ని ఎరిగినవారు కాబట్టే శాస్త్రకర్తలు

సాలగ్రామంచ తులసీం శంఖంచైకత్ర ఏవచ
యోరక్షతి మహాజ్ఞానీ ! —అని అవి రక్షించుకొనే వారిని మహాజ్ఞానిగా పొగడినారనిపిస్తుంది.

---

3. 762

ఇక పైపాదం ఒకపర్యాయం కావ్యదృష్టితో పరికించండి. దానిలోగల సాలగ్రామ శంఖశబ్దాలు రెండు పుంలింగాలు. వానినడుమగల తులసి స్త్రీలింగశబ్దం.

కథలో తులసీదేవి విష్ణుమూర్తిని గురించి తపంచేస్తుంటే రెండోవైపామెను గురించి శంఖచూడుడు తపంచేసినాడు. కనుక ఆమె వారిద్దరినడుమ నిలిచి పోయింది. ''సాలగ్రామంచ తులసీం శంఖంచైకత్ర ఏవచ'' అని పాదం తులసీ దేవి వారిద్దరినడుమ ఏ విధంగా చిక్కిపోయిందో సూచిస్తుంది.

అర్చనా సమయంలో తులసీతీర్థం మొదట శంఖంచేత భరింప బడు తుంది. తరువాత అభిషేకింపబడి సాలగ్రామాన్ని ఆశ్లేషిస్తుంది. కాబట్టి పురాణ కర్తలీ మర్మాన్ని పురస్కరించుకొనే తులసీదేవి కిద్దరు పతులైనట్టు, శంఖచూడుడు తీరిపోయిన పిమ్మట ఆమె అంతంలో విష్ణువుతోనే ఉండిపోయినట్లు కథనశిల్పం సృజించినారేమో అని స్ఫురించక మానదు. తరచి చూచిన కొద్ది మన పురాణా లలో యిటువంటి అర్థవాదాలు ఇంకా యెన్నెన్నో కనిపిస్తవి.

-: సాలగ్రామ శిలలు :-

క్రీ శ. 1928 వేసవిలో ఒకనాడు శ్రీ కొత్తపల్లి సూర్యారావు గారు తమ గ్రామమైన చెందుర్తికి వెళ్ళివస్తూ దారిలో రైలుకోసం గొల్లప్రోలు దగ్గర నిలిచి నారు. అపుడు వారిదృష్టి ప్రక్కనున్న తుమ్మచెట్లకు గల కీటకాలపై పడింది. అవి పదిపన్నెండు ముండ్లను కత్తిరించి బల్లిపొరవంటి ఒక జిగటపదార్థంతో వానిని అతికించి క్రోవిగా జేసికొని దానిలో ఉండి చెట్టుకు వ్రేలాడుతున్నవి. అవి ఆహారసమయంలో గూడ బయటికి రావు. కోశంతో ఆలాగే వెళ్ళుతుంటవి. ఆ వింతను జూచి వారు పాత్రకు ఘృతమాధారమా ఘృతానికి పాత్ర ఆధారమా! అనే శంకతో ప్రపంచ విజ్ఞానం అని ఒకవ్యాసం వ్రాసినారు. దానిలో ఈ సృష్టి చిత్రాలన్ని ఆ జగదంబ యొక్క లీలా విలసాలని అన్నారు. ఈ వ్యాసం విభవ సంవత్సరపు భారతి సంపుటిలో చైత్రంలో అచ్చయింది.

తుమ్మలు లేనిచోట ఆ పురుగులు తంగెడు చెట్లపై ఉండి వాని సన్నని కాడలు కత్తిరించి క్రోవి చేసుకుంటవి. ఏ కారణంచేతనైనా ఆ క్రోవి వేడిదానిపై బడినపుడు దానిలోని పురుగు బలంగా క్రోవితోపాటు ఎగిరి దూరంగా పడుతుంది. తెలంగాణా మండలంలో దీన్ని ''రావణబ్రహ్మ పురుగు'' అంటారు.

కూడు, గూడు-విశ్వంలో పిపీలికాది బ్రహ్మపర్యంతం-అవసరమే గాబట్టి ఇటువంటి ప్రాణులు భూమిపై యింకా చాలా ఉన్నవి. పిసిరికాయ పురుగు, పట్టుపురుగుగూడా ఇట్టివే అనవలె. భూ వాతావరణంలో ఉండే వానికి కోశావసరం తక్కువగాని జలజీవులకు మాత్రం నీటిలోని శీతలానికి లవణాలకు తట్టుకొని తమను కాపాడుకొనే అందుకు ఈ కోశావసరం తప్పనిసరి అనిపిస్తుంది. అందుచేతనే నత్తలు, శంఖజాతి జీవులు వివిధాకారాలైన కవచ కుటీరాలు నిర్మించుకొని గృహస్థాలుగా బ్రతుకుతున్నవి.

మీరెప్పుడైనా సముద్రతీరపు యిసుకను చూడండి. దానిలో వివిధాకారాలైన గవ్వలు, ఆలిచిప్పలు, శంఖాలు కనిపిస్తాయి. వానిలో కొన్ని రంగు రంగులుగాను మరికొన్నిటిపై రంగులగీతలుగాని చుక్కలుగాని ఎంతో చేయి తిరిగిన కళాకారుడు చిత్రించినట్టుండి చూడ ముచ్చటవేస్తుంది. అదొక కళాప్రపంచం. ఇపుడు మనం పూజించుకునే సాలగ్రామాలీ జాతికే చెందుతవి. ఇవి—

చక్రనద్యా గిరివరా దానీతాశ్చ శిలాస్సదా
గండక్యా మపనుద్యంతే
గండూష రూపాత్పాతాల గంగాయా ముత్థితా సమమ్
చక్రాంకిత శిలావాపి ద్వారకాయాం సముద్భవాః.

అనే పంక్తులను బట్టి గండకీ నదిలోను, పాతాళ గంగలోను, ద్వారకలోను పుట్టుతవని తెలుస్తుంది. కాని వీనిలో గండకీ నదిలో పుట్టిన వానికే చుర్యం ఎక్కువ. వీనిలో మళ్ళీ స్థలజాలు అని రెండు భేదాలున్నవి.

"స్థలస్థాః పింగళాజ్ఞేయా శ్చోపతాప ద్రవేరితి."

అనేదాన్ని బట్టి మెట్టవి సూర్యతాపానికి పచ్చబడి పోతుంటవి అని గూడ తెలుస్తుంది. అంతేగాక మెట్టవి గరుకుగా కొంత వేడిగా, నీటివి చల్లగా నునుపుగా నిగనిగలాడుతూ ఉంటవి. పాతాళగంగలో నీటివి మాత్రమే ఉంటవి. మెట్టవి గండకీ తీరంలోనే ఎక్కువగా ఉంటవి.

మన పురాణాలీ శిలలను వజ్రకీటకాలు నిర్మిస్తవని చెప్పుతవి. వాటికి వాడియైన కోరలుంటవట. ఆ కోరలలో శిలలకు గుహలు,చక్రాలు తొలుస్తాయట.

కొన్ని పురాణాలు వాటిని స్వర్ణ భ్రమరాలని గూడ అన్నవి. శీతాకాలంలో అవి ఆత్మరక్షణకై ఈ శిలలను తొలుచుకొని నివసించి తదనంతర కాలంలో వెళ్ళి పోతవని కొందరి మతం.

అవి నివసించటం చేతనే ఆ శిలలను సాలగ్రామా లంటున్నారు గాని అవి నిజంగా గ్రామాలుగాదు. సాలిగ్రావం. "స+అలి+గ్రావం" అని దాని పదచ్ఛేదం. అలి అంటే కీటకం మనం పూజించే శిలలో యిపుడు అది ఉండదు. అయినా దాని సంబంధాన్ని బట్టి శిలను మనం సాలిగ్రావం అంటున్నాం.

అలి శబ్దానికి తుమ్మెద, తేలు అనే అర్థాలుగూడ ఉన్నవి. అయితే మన పురాణాల ప్రకారం సాలగ్రామాలను నిర్మించేది ఒక విధమైన కీటకమేగాని, తుమ్మెదగాని తేలుగాని కాదు.

సాలగ్రామానికి ముఖ్య చిహ్నం చక్రం. అదిలేని సాలగ్రావం ఉండదు. మీరెపుడైనా గూడు అల్లే సాలీడుగాని, గూడును గట్టే కందిరీగనుగాని చూడండి. సాలీడు ఆధారతంతువులు బిగించిన పిమ్మట వానిపై బిరబిరా గుండ్రంగా తిరుగుతూ చిటికలో గూటిని పూర్తి చేస్తుంది. కందిరీగ నిదానంగా గూటి గోడలపై చుట్టు తిరుగుతూ దాని కచ్చులు పెంచుతుంది. ఇక తుమ్మెద అందమైన పూవును జూచి దానిపై వ్రాలేఅపుడు ఊనికను చూసికొని తనను సంబాళించుకోవటానికి ఆపుష్ప సౌమనస్యానికి ప్రదక్షిణలు చేస్తున్నట్టు దానిపై కొన్నిచుట్లు తిరిగితేనే గాని వ్రాలలేదు. అందుకే దాన్ని భ్రమరమన్నారు. వజ్రకీటకం గూడ సాలగ్రామ శిలకు రంధ్రాలు చక్రాలు తొలిచే అపుడు దానిపై ఈలాగే ప్రదక్షిణలు చేస్తుందేమో. అందుచేతనే పురాణకర్తలు దాన్ని హిరణ్య భ్రమరమన్నారు.

ఆధునిక పరిశోధకులీ భ్రమరాలను మత్స్య జాతిలో జేర్చినారు. మత్స్యాలు గాకున్నా జలజీవులైన నత్తలు, శంఖపు పురుగులు, పవడపు పురుగులు మీన-మత్స్యాల క్రిందనే అంగీకరింపవలెనని వారి అభిప్రాయం. వాని అవశేషాలైన శంఖాదులను వారు శిలాస్థికలు (ఫాసిల్స్) అంటారు. ఇవి అలంకారాలకో ఔషధాలకో ఉపయోగపడుతుంటవి.

సాలగ్రామం ఈ కోవకే చెందుతుంది. దాన్ని నిర్మించే కీటకం లేదా మీనం ఒక చిన్నరాయి నెన్నుకుని దానిచుట్టు తన శరీరం నుండి వెలువరించే ఒక ద్రవపదార్థంచేత ఈ కవచాన్ని ఏర్పరుస్తుందని వారి అభిప్రాయం.

ఆ మీనం ఆ విధంగా కవచా న్నేర్పరచే అపుడు శిలపై అది తరుచు చుట్టుగా తిరుగవచ్చు. ఆ సమయంలో ఆర్ద్రితగల ఆ పదార్థంపై దాని మీసలో ముంగాళ్లో, రెక్కలో లేదా వెన్నుగాని పుచ్ఛంగాని వొరుస్తు సాలగ్రామాలపై యిపుడు మనకు కనిపించే శంఖపద్మ వనమాలాది చిహ్నాలేర్పడుతూ ఉండవచ్చు ననిపిస్తుంది. ఈ శాస్త్రాన్నిబట్టి శిలపై చక్రాలు మాత్రం అవి బుద్ధిపూర్వకంగా తమ స్వభావంతో చేస్తున్నట్లు తెలుస్తుంది. కాబట్టి తక్కినవి ఘుణాక్షర న్యాయం కావచ్చును.

సాలగ్రామ శిలలపై మూర్తిబింబాలొక ప్రత్యేకత. ద్వారకా శిలలకు చక్రాలేగాని ఈ మూర్తిబింబా లుండవని-

"మూర్తిబింబేన యష్టవ్య మన్యబింబే తథైవచ
చక్రాంకిత శిలావాపి ద్వారకాయాం సముద్భవాః
యఃపూజ్యో దనుదినం సయాతి పరమాంగతిమ్.

—అనే పంక్తులనుబట్టి మనం ఊహించవచ్చు.

సృష్టిలో శిల్ప నైపుణ్యం ఒక మానవునికే గాదు. సమస్త ప్రాణికోటికి ఉంది. మానవుడెంత నిపుణుడైనా ఏదో ఒక కొద్దిగాని కొలముట్టుగాని లేకుండా ఏ శిల్పాన్ని సృజింపలేడు గాని తేనెటీగలు తమ పెరలోని గదులన్ని సమాన షట్భుజాలుగా, కందిరీగలు సమాన వలయాలుగా నిర్మిస్తవి. రావణబ్రహ్మ పురుగు గూటిపుల్లలన్ని ఒకే కొలతలో కత్తిరిస్తుంది. సాలీడు గూటివలయాలను సమాన దూరంతో ప్రస్తరిస్తుంది. శంఖం పురుగులు, అలిచిప్పల పురుగులు, గవ్వ పురుగులు తమ కవచాలను కుడియెడమ భేదం లేకుండా సమానంగా నిర్మిస్తాయి. గిజిగాడు తనగూటిని చీమదూరకుండా అల్లుతుంది. ఈ నైపుణ్యాలకు "ఏ వేదంబు పఠించెలూత" అనే మనం ఆశ్చర్య పడవలసి ఉంది.

ఈ శిల్ప నైపుణ్యం మెట్ట ప్రాణులకంటె జలజీవుల్లో ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తుంది. బాలవిజ్ఞాన సర్వస్వంలో సముద్రపుటిసుకలలోని ఈ శిలాస్థికల

చిత్రాలు కొన్ని యిచ్చినారు. వాటిని చూస్తే ఆ శిల్పనైపుణ్యం ఎంత మనోహరంగా ఉందో మీకే తెలుస్తుంది.[1]

-: సాలగ్రామ లక్షణాలు :-

అసలైన సాలగ్రామం దాని పరిమాణమైన శిలకంటె తేలికగా ఉంటుంది. కొన్ని నీటిలో గూడ తేలుతవి. ఇవి గండకీ నది తీరంవెంట అనేకమైన రంగుల్లోను ఆకారాలలోను లభిస్తవి.

ప్రకృతిలో రంగులను గురించి ఆకార చిత్రాలను గురించి చెప్పవలసి ఉండదు. శివలింగ పుష్పం చక్కగా పీఠంపై శివుని మలిచి పెట్టినట్టు, అతనిపై శేషుడు పడగవిప్పి పట్టినట్టు ఉంటుంది. లింగదొండ విత్తనం గుండ్రని పాన వట్టంపై గుండ్రని శివలింగాన్ని నిలిపినట్టు ఉంటుంది. కాబట్టి సాలగ్రామాలలోని మత్స్య కూర్మాద్యాకారాలు ఇట్టివే యనవలె

కొన్ని సాలగ్రామాలు అక్షంచుట్టు తొలచబడి ఉంటవి. కొన్నింటిపై సుదర్శన చక్రం ఇంకా ఇతరమైన బొమ్మలుంటవి. కొన్నింటికి రంధ్రాలుంటవి. కొన్నిటికి ఉండవు. రంధ్రాలుండే వానిని జాగ్రతగా రెండు భాగాలు జేసినపుడు నునుపైన లోపలి గోడలపై మత్స్య కూర్మాద్యవతారాల చిత్రాలు కనిపిస్తవి. సాలగ్రామ శిలోత్పత్తి విమర్శనంలో శ్రీ కృష్ణమాచార్యగారొక రాజుగారి దగ్గర హిరణ్యకశిపుని చీరుతున్న ఉగ్రనరసింహమూర్తి ప్రహ్లాదుని జూచి నవ్వుచున్న కల్యాణ నృసింహమూర్తి గల సాలగ్రామాలను జూచినట్లు చెప్పినారు. వానిని జూచి ఒక ఫాదరీగారి దేదో "దయ్యపు చేష్ట" అనెనట. శిలపై ఇటువంటి చిత్రాలేర్పడటం చిత్రమే అయినా ప్రకృతిపరంగా ఆలోచించినపుడది అసంభవం ఏమీ కాదేమో ననిపిస్తుంది. హనుమంతుని ఆకుపై ఈనెలు అతని బొమ్మ గీసినట్లుగా ఏర్పడుతూనే ఉన్నవి మరి.

సాలగ్రామానికి ఉండే మరో ముఖ్య లక్షణం బంగారపు అంటు. అందుకే దానికి హిరణ్యగర్భమని పేరు. ఇపుడు మనం చూసే సాలగ్రామాలకుండే

1. బాలవిజ్ఞాన సర్వస్వం. పు. 252.

రంధ్రాలలో చిన్న బంగారపుటుండలే ఉంటవని అవి తీసికొని పట్టి సాలగ్రామాలు వ్యాపారులు అమ్ముతారని పూర్వీకుల నమ్మకం. ఇప్పుడు వానిలో బంగారం లేకున్నా ఆమచ్చలో లేక చుక్కలో ఉండే సాలగ్రామాలున్నవి. ఆచార్య శ్రీ బి. రామరాజుగారు ఒక యోగిగా రసతైన సాలగ్రామాలు సంపాదించి, పరీక్షార్థమై పగులగొట్టినానని వానిలో స్వర్ణరేఖ లుండటం తాను చూచినానని ఒకప్పుడు నాతో అన్నారు.

బంగారం ఒక్కటే అయినా పుట్టుక ననుసరించి దానిలో ప్రాకృతం, సహజం, వహ్నిసంభవం, ఖనిజం, వేధం అని అయిదు భేదాలున్నట్టు లోహ శాస్త్రం వైద్యశాస్త్రం చెబుతవి. వానిలో మొదటి మూడు పదారువన్నెల బంగారాలు; తక్కినవి పదునాలుగు వన్నెలవని శాస్త్రకారుల మతం.

లోహాలు భూమిలోనే గాక కొన్ని ప్రాణుల శరీరాల్లో గూడ ఉంటవి. ఇపుడు మనం చూసే వానపాముల శరీరంలో రాగి ఉంటుంది. మానవ వీర్యంలో బంగారం ఉందని కొంతకాలం క్రిందట ఆంధ్రప్రభ వారపత్రికలో ఒక వ్యాసం వచ్చింది. కొన్ని పురాతన జాతుల ఎముకల్లో గూడ బంగారం ఉంటుందట. ఇపుడు మనకు సాలగ్రామాలు శిలాస్థికలకొక ఉదాహరణం. ఇట్టి వానిలోని బంగారాన్ని ప్రాకృతం అంటారు.

ఆఫ్రికా గనుల్లోను, కొండల్లోను బంగారం ముద్దలుగా దొరుకుతుందట. అట్టిది సహజం అనబడుతుంది.

స్వర్ణకారక విద్య భారతదేశానికి క్రొత్తగాదు. ఆచార్య నాగార్జునుడు శ్రీపర్వతంపై గల శిలలన్ని బంగారంగా మార్చ సంకల్పించినాడట. ఈకోవలో మనకు నమ్మకంగా తెలిసినవాడు వేమనయోగి ఒకడు.

1983లో సప్తాహిక్ హిందుస్తాన్ అనేవారపత్రిక దీపావళి ప్రత్యేక సంచికలో ఈ క్రింది వార్తను ప్రకటించింది :

మహాత్మాగాంధీగారు 1939లో హృషీకేశ్‌లో ఉండగా పంజాబ్‌కు చెందిన రసాయనాచార్యుడైన యోగికృష్ణపాల్ శర్మగారి నతనిచెంతకు తెచ్చినారు. అపుడాయన ప్రముఖ పారిశ్రామికవేత్త జుగల్‌కిశోర్‌బిర్లా, సనాతన

ధర్మనాయకుడు గోస్వామి గణేశ్‌దత్తా, గాంధీగారి ప్రైవేటు కార్యదర్శి మహా దేవ్‌భాయిగాల సమక్షంలో 200 తులాల పాదరసానికి 1 తులం వేరే రసాయనిక పదార్థంకలిపి నిప్పులపైకాల్చి దాన్ని బంగారంగా మార్చి చూపినాడు. పిమ్మట పరిశుద్ధమైన ఆబంగారాన్ని 75వేల రూపాయలకు అమ్మి ఆసొమ్మును గాంధీగారికి దానంగా ఇవ్వటం జరిగింది.

యోగి కృష్ణపాల్‌శర్మగారీ ప్రయోగాన్ని మళ్ళీ 1941 మే 29 నాడు ఢిల్లీలోని బిర్లాహౌజులో శ్రీబిర్లావియోగిహరి, బిర్లా మిల్సుకు చెందిన విల్సనస్ట్‌ల సమక్షంలోగూడ ప్రదర్శించినాడు. ఈవార్త ఢిల్లీలోని బిర్లామిల్స్ యజ్ఞశాలలో ఒకరాతిపై చెక్కబడింది. మహాదేవ్ భాయిగారి డైరీలోగూడా ఉంది'' అని ఆపత్రిక కావలసిన దాఖలాలతో గూడ ప్రచురించింది.

కాశిలోని తంత్ర శాస్త్రజ్ఞుడైన పండిత గోపీనాథ్ కవిరాజ్‌గారి శిష్యుడు స్వామీ చంద్రశేఖర్, శ్రీరామేశ్వరీజా గూడ ఈ ప్రయోగంలో సఫలీకృతు లైనారట.

బంగారమేగాక పాదరసంతో వెండినిగూడ చేస్తారు. గతశతాబ్దంలో అప్పర్‌ప్లాటులోని పదరగ్రామంలో ఆవంచ అంతయ్యగారని మాబంధువొకాయన ఉండేవాడు. ఆయనకు ఒకఅన్న ఉండేవాడట. అతనికి ఏలాగో బాల్యంలోనే బైరాగుల సావాసం అబ్బి వారితో వెళ్ళి చాలాకాలానికి వచ్చినాడట. వచ్చేనాటికి రసాన్ని వెండిగా మార్చటం నేర్చుకుని వచ్చినాడట, అతడు పెండ్లి చేసికోలేదు. దేశంలోనికి వచ్చిన పిమ్మట కొంతకాలంతమ్మునిదగ్గర ఉన్నాడట. ఆకాలంలో ఎపుడైనా డబ్బుల అవసరంపూర్తికి రసాన్ని వెండిగా మార్చి తమ్మునితోనే కరి గించి అమ్మించుకునే వాడటగాని అది వంశవృద్ధి కారకంగాదని తమ్మునికీ రహ స్యం చెప్పలేదట. అంతయ్యగారిని నేను బాగా ఎరుగుదును.

1960 ఫిబ్రవరిలో ఢిల్లీలో ప్రపంచ వ్యవసాయ ప్రదర్శనం జరిగింది. ఆసందర్భంలో ఒక భారతీయ అణుశాస్త్రవేత్త ఒక ప్లాటినం ముక్కను అణు రియాక్టర్‌లో పెట్టి న్యూట్రోన్ రేడియేషన్ ద్వారా దాన్ని బంగారంగా మార్చి చూపినాడు. ఈవార్తనప్పటి పత్రికలన్ని ప్రకటించినవి. కాబట్టి ఈవిధంగా ఇతర ఖనిజాలను కాల్చి రూపొందించిన దాన్ని వహ్నిసంభవం అంటారు.

బంగారు ఖనిజం ఇపుడు మనకు కోలారు మొదలైన చోటుల్లో లభిస్తుంది. స్పర్శవేది మున్నగు రసాయనిక క్రియలతో యితర లోహాలను వేధించి చేసిన బంగారం వేధం అనబడుతుంది. మన సాహిత్యంలో ఈపరుసనేదికి సంబంధించిన ఉదంతా లనేకం డున్నవి.

బంగారంచేసేవిద్య ఈనాడు మరుగుపడింది. అందుచేత మనం నమ్మలేక పోతున్నాంగాని ప్రాచీనులకది క్షుణ్ణంగా తెలిసిఉండేది అని కీ.శే. నోరినరసింహ శాస్త్రిగా రొకప్పుడు చెప్పగా నేను విన్నాను. దాన్ని అనుసరించియే వారు మల్లా రెడ్డి నవలలో స్వర్ణకారకవిద్యను చెప్పినాడట.

వైద్యశాస్త్రం "వేధం" అనే బంగారాన్ని మాత్రమే ఔషధాల తయారీకి వాడవలెనని చెబుతుంది.

ప్రాణుల్లో కొన్ని కొన్నిటికి ప్రకృతిలోని కొన్నిధాతువులను లేదా వస్తువులను కూర్చే విచిత్రమైన అలవాట్లున్నవి. చమురుకాకి తనగూటిలో సంజీవిపుల్లను తెచ్చిపెట్టుకుంటుందట. ఇది పల్లెవాసుల నమ్మకం. కందిరీగనుగూడ కొందరీ లాగే చెబుతారు. అది గూటిలో సంజీవిని తెచ్చిఉంచుతుందో లేదో చెప్పలేంగాని దానిగూటికి ఒక అద్భుతమైన గుణం డుంది. పిల్లలు లేచిపోయిన ఆగూటిని మూసగా ఉపయోగించి దానిలో ఇతరలోహాలతో కల్తీయై పగులుతున్న బంగారాన్ని కరిగితే అది బాగుపడుతుంది.

సముద్రంలోని శంఖజాతి జీవులు "క్యాల్షియం" అనేదాన్ని కూర్చి తమ కవచాలు నిర్మించుకొంటె, పవడపు పురుగులు మరొకధాతువును కూరుస్తున్నవి. కాబట్టి ఈలాగే సాలగ్రామ కీటకాలు బంగారాన్ని కూర్చుతవి అనుకోవలె. ఈ సందర్భంలో గండకీనదికి హిరణ్యవతి అని, సాలగ్రామ కీటకానికి హిరణ్య భ్రమరం, హిరణ్యగర్భకీటకం అనేపేర్లుండటం గమనింప దగినఅంశం.

అన్ని నదులకంటే గండకీనది యిసుకలో బంగారంపాలు ఎక్కువని పరిశోధకులు తెలిపినారు. నేపాలీయులు ఇప్పటికి కృష్ణగండకీనదీ తీరంలోని యిసుకలో సన్నని బంగారు కణాలు వెదకుతుంటారని స్థలచరిత్రలో ఉంది. "మన కావ్యాలలో జంబూనది" అని ఒకనది వర్ణించబడింది. దానిలోని "బురద"

అంతా బంగారమే. ప్రవరుడు గిరిక మొదలైన కావ్యనాయికా నాయికులందరూ దానితో చేయబడినవారే కాబట్టి ఆ నది ఇదే అవుతుందేమో పరిశీలించ వలసిన విషయం. ఇది విషయాంతరం. కాని హిరణ్యావతి నదిలోని కీటకాలు హిరణ్య భ్రమరాలైనపుడు సాలగ్రామాలు హిరణ్యగర్భాలు కావటంలోమాత్రం అసంభవం ఉండజాలదు.

అసలైన సాలగ్రామం నీటిలో తేలటమేగాదు పాలలో చేపవలె ఈదు తుంది అని గూడ సాలగ్రామ శిలోత్పత్తి విమర్శనంలో చెప్పబడింది. నీటిలో గాని పాలలోగాని తేలుతూ ఈదేదాన్ని సజీవ సాలగ్రామమని పిలుస్తారట. అట్టి సాలగ్రామాన్ని ఒకప్పుడు ఒక ఉత్తరాది మఠాధిపతిగారి పూజా పీఠంలో చూసి నట్లు శ్రీ తెలకపల్లె విశ్వనాథశర్మగారు చెబుతారు.

కార్డువంటి గరుకుగల ప్లాస్టిక్కు కాగితాన్ని చింతాకుకంటె కొంచెం పెద్దగా చేపవలె కత్తిరించి దాని మూతిలో ఒక కర్పూరం బిళ్లను బాగా ముద్దగా నలిపి యిరికించి ఒక పళ్లెంలో నీరుపోసి దానిలో విడిచితే, పళ్లెం చుట్టు అది ఈదుతు మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇది మంత్రంగాదు. వస్తు గుణంలో గూడిన తంత్రం కాబట్టి సాలగ్రామం పాలలో గాని నీటిలో గాని ఈదటానికి యిట్టి విశేషమేదైనా కారణమో లేదా దానిలోని అలి జీవించి ఉండటమో చెప్పలేం.

అసలైన సాలగ్రామం పాలలో ముంచి తీసినపుడు లేదా బియ్యంలో కొంతసేపుంచి తీసినపుడు మొదటి కంటె బరువెక్కు వౌతుందట. దీన్ని బట్టి దానిలో ఏదో అజ్ఞాత చర్యా మాత్రం జరుగుతుందని తెలుస్తుంది. మనవారు ప్రస్తుతం ఈ చర్యను దాని సజీవత్వానికి ఒక చిహ్నంగా అంగీకరిస్తున్నారు.

సాలగ్రామ శిలకుండే మరొక అద్భుతం లక్షణం అది బ్రాహ్మణునికి కొన్ని అడుగుల దూరంలో ఉంచితే, వెళ్లి బల్లివలె అతనిని పట్టుకోవటం. నేపాలు ప్రభువులీ పరీక్షను ఎన్నో పర్యాయాలు సాపేక్షగా చూసినారని "హడ్సన్" అనే ఒక ఆంగ్లేయుడుగూడ దీన్ని కన్నులారా చూసినాడని సాలగ్రామ శిలోత్పత్తి విమర్శనంలోనే చెప్పబడింది.

నిద్ర గన్నిచెట్టు మనిషి సమీపించగానే ఆకులు ముడుచుకుంటుంది. దీన్ని "అత్తిపత్తి" అని, సిగ్గుచెట్టు అనిగూడ అంటారు. సాలగ్రామ శిల మానవునికి ఆకర్షింపబడుతుంది కాబట్టి ఈమొక్క కంటె వ్యతిరేకమైన శక్తి దానిలో ఉంది అనవలె కాని అది అందరిదగ్గరకు ఆ విధంగా చేరదు. నేపాలు రాజా వారది ఎవరి దగ్గరకు చేరుతుందో వారికే అది దానం చేస్తారని చెబుతారు.

బహుశః అది ఓజోవంతుల దగ్గరికే చేరుతుందేమో అందుకే కాబోలు పూర్వులు సాలగ్రామాన్ని పూజించేవారు చాలా నియమనిష్ఠలతో ఉండవలెనని, బ్రహ్మచర్యం పాటించవలెనని హెచ్చరించినారు. శాస్త్రం గూడ ఈ విషయంలో పదేపదే హెచ్చరించి దానికి స్త్రీ శూద్ర స్పర్శను కఠినంగా నిషేధించింది.

మనదేహం ఒకవిచిత్రమైన యంత్రం. దీనిలో ఈశ్వరుడెన్ని శక్తులు నిక్షేపించినాడో చెప్పలేం. అవి మన జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలద్వారా బహిర్గత మౌతుంటవి. మన జ్ఞానేంద్రియాలలో కన్నులు, కర్మేంద్రియాలలో చేతులు ముఖ్యమైనవి. దిష్టికన్నులవారు మనదేశంలో ఎక్కువ పరిచయంగాని యితర దేశాలలో చూపులతో ఇనుపకమ్మీలను వంచేవారు, గడియారాల నాపేవారు, పాత్ర లను, పళ్లేలను శూన్యంలో నిలిపేవారున్నారు. ఇక చేతులశక్తి నంచనావేయలేం. వేళ్లతోతాకి రంగులు చెప్పేవారు, బల్బులను వెలిగించినవారు, త్రెంచిన పూవు లను వాడకుండా చేసినవారు ఇంకా ఎన్నో వింతలు సృజించిన వారున్నారు. పల్లెటూరివారికి డాక్టరుగారిచ్చే మందుకంటె ఆయన హస్తవాసిపైననే నమ్మకం ఎక్కువ. ఇటువంటి ప్రభావం స్త్రీల చేతులకుగూడ లేకపోలేదు, అయితే వారికి ఋతుధర్మం గర్భధారణ అనే ప్రత్యేకతలున్నవి.

ఋతుమతియైన వారు దేన్ని తాకరాదని మనవారి నమ్మకం. ఆ సమ యంలో వారు దేన్ని స్పృశించినా విపరీత ఫలితం కనిపిస్తుందని "ఋతుధర్మాలు" అనే పుస్తకంలో నిదర్శనాలుగూడ ఉదాహరింపబడినవి. గర్భవతుల విషయం గూడా అంతే. అందుచేత సాధారణంగా ఆచారపరుల యిండ్లలో వారిచేత ఊర గాయలను తాకనీయరు, పండ్లను కూరకాయలను కోయనీయరు. అర్చకుల యిండ్లలో వారు దైవనివేదన కొఱకు చేసేపాకానికి పనికిరారు. మార్కండేయ పురాణంలో ముదావతి అనే కన్యాస్పర్శచేత కుజంభుని ఆయుధమైన సునంచం

శక్తిహీనమైన వృత్తాంతం ఒకటిఉంది. కాబట్టి ఇటువంటి దృష్టిచేతనే కాబోలు శాస్త్రం సాలగ్రామాలకు స్త్రీస్పర్శను కఠినంగా నిషేధించింది.

మనదేహానికి జ్ఞానేంద్రియాలు కర్మేంద్రియాలు వేరువేరుగా ఉన్నా వికలాంగుల దేహంలో ఒకదానిపని మరొకటి నిర్వహించిన ఉదాహరణలున్నవి. చేతులలోనేగాక చెవులలో చూసినవారున్నారు కాళ్లతో పరీక్షలు వ్రాసినవారున్నారు. కాబట్టి మనయొక్క దేహమే ఒక మహాయింద్రియ మనవలె. అందుచేత ఒక్క సాలగ్రామాలనే గాదు మనం అవసరంగా ఎవరినీ ముద్దుకోకుండా తిరగటమే మంచిది.

నిజమైన సాలగ్రామం ఇంటిలో ఉండటం ఎంతోమంచిది. దానిచేత ఎన్నో సత్ఫలితాలున్నవి. కాని పూజాపీఠంలోఉండే సాలగ్రామం చిన్నదిగా ఉసిరిక పండంత ఉండటం శ్రేష్ఠం. ఆవిధంగా గాక పెద్దవి లభించినపుడు వానినే ఆలయాలకైనా దానం చేయటమో, మరీపెద్దవిగా ఉన్నపుడు స్వయంగా ఒక చిన్న గుడి గట్టించి దాన్ని ప్రతిష్ఠించటంగూడా కద్దు.

అంతేగాక సాలగ్రామ పూజ అందరికీ అచ్చిరాదనే నమ్మకం కూడా కొందరికుంది. ఆ కారణంగా తమ తాతతండ్రులు పూజించిన సాలగ్రామాల నాలయాలకు ఇచ్చేసేవారు గూడ లేకపోలేదు.

ఆలయాలలో ఏ కారణంచేతనైనా సరే ఆరాధన మాగిపోరాదు. అర్చామూర్తులలో ఈశ్వరుడు మంత్రాధీనుడైన కళాహ్వాన ప్రాణ ప్రతిష్ఠాది సంస్కారపురస్సరంగా వేంచేసి ఉంటాడు గాబట్టి ఆరాధన ఆగితే అర్చామూర్తికి మళ్ళీ సంప్రోక్షణ చేసి స్వామి నావాహన జేసికోవలసి ఉంటుంది. సాలగ్రామంలో ఆ విధంగా గాదు; శ్రీహరి నిత్య సన్నిహితుడు కాబట్టి దానికి ఎంతకాలమాగినా ప్రాణప్రతిష్ఠగాని సంస్కారంగాని లేకుండానే మళ్ళీ పూజించవచ్చు. అందుచేత ఆలయాలలో ఆరాధనా దోషం పట్టకుండా కొన్ని సాలగ్రామాలు తెచ్చి ఉంచుతారు.

పంచాయతనంలో నిత్యాభిషేకం సాలగ్రామ శిలకే చేస్తారు. కనుక ఇండ్లలోగాని ఆలయాలలోగాని సాలగ్రామం లేకుండా తిరువారాధన పూర్తిగాదు.

అద్వైతియైన ఆదిశంకరాచార్యులు సైతం ప్రతిదినం లక్ష్మీనృసింహ సాలగ్రామాన్ని అర్చించేవాడట. కాబట్టి ఆస్తికులకు సాలగ్రామ ప్రాధాన్యము యెంతటిదో ఊహించవచ్చు.

భారతదేశంలో జమ్మూలోని రఘునాథాలయంలో ఉన్నన్ని సాలగ్రామాలు మరే ఆలయంలో గూడలేవట. దక్షిణదేశంలో మంత్రాలయంలోని రాఘవేంద్ర స్వామివారి సమాధి పూర్తిగా సాలగ్రామ శిలలతో నింపబడినట్లు చెప్పబడింది.

సాలగ్రామాలను శిలగా పూజించటమేగాక ఆశిలను మూర్తిగా మలిచి పూజించటం మరీ విశేషంగాని, అవి మూర్తినిర్మాణానికి సరిపడే అంత పెద్దవిగా ఉండవు. ప్రస్తుతం బదరీక్షేత్రంలోను, ఆ క్షేత్రానికివెళ్లే దారిలోగల జోషీ మఠంలోనుగల నృసింహాలయంలోను ఉండే మూలవిగ్రహాలు అచ్చమైన సాలగ్రామ శిలలవని అక్కడివారి నమ్మకం.

జోషీమఠంలోని నృసింహాలయ మూర్తిని గురించి ఈక్రింది విషయం ప్రచారంలో ఉంది. ఆమఠానికి తొమ్మిదిమైళ్ల దూరంలో కైలాస శిఖరానికి వెళ్లే దారిన ఒక తపోవనం ఉంది. దానికి భవిష్యబదరి అనిపేరు. అక్కడ గల ఆలయం ముందొక చెట్టుక్రింద ఒకశిల ఉంది. దీని పరీక్షగా చూస్తే అందులో విష్ణుమూర్తియొక్క ఆకారం సగంసగంగా కనిపిస్తుంది. అది ప్రకృతి సిద్ధ మయింది.

జోషిమఠంలోని నృసింహస్వామికి ఒకభుజం మిక్కిలి సన్నగా అభిషేకం చేస్తుంటేనే విరిగిపోతుందా ఏమి అనేంత సన్నగా ఉంటుంది; కాని అది తరతరాలనుండి అలాగేఉంది. ఇప్పటివరకు విరుగలేదు. అది విరిగిననాడు బదరీ క్షేత్రానికి దారిలోఉండే నరనారాయణ పర్వతాలు రెండూ కలుసుకొని ఆదారి లేకుండా పోతుందట. అంతేగాక భవిష్యబదరిలోని సగంసగంగా ఉండేమూర్తి పూర్తియై నాటినుండి యిక అదే బదరిగా నిలుస్తుందట. ఇది అక్కడివారు చెప్పే సంగతి.

ఈనాడు చాలాచోట్లలోగల ఆలయాలలోని మూర్తులను అక్కడి పూజారులు సాలగ్రామ శిలానిర్మితాలనే చెబుతుంటారు గాని అది నమ్మతగినదిగాదు. ప్రస్తుతం

హైదరాబాదు సమీపంలోని వికారాబాదు కొండలపై అనంతపద్మనాభస్వామి ఆలయం ఉంది. దానిలోని మూలబేరం స్వామివారి బింబంగాదు. ఒక గుండ్రని శిలమాత్రమే. సాలగ్రామాలలో పదునాల్గు చక్రాలుండే వాటికి అనంతమని పేరు కాబట్టి అది అనంతసాలగ్రామ మని అక్కడి పూజారులు చెబుతారు.

ఇటువంటి సాలగ్రామమూర్తి మా జిల్లాలోగూడ సింగపట్నం అనేచోట ఒకటిఉంది. అది ప్రాచీనక్షేత్రం. అక్కడ నృసింహస్వామి ఉన్నాడు. ఈస్వామి ప్రస్తుతం మద్రాసులో నివసించిన సముద్రాలవారికి యిలువేల్పట. వారి పూర్వ నివాసం "మిడిచెర్ల" అనే గ్రామం.

ఇక్కడగూడ స్వామివారి మూలబేరం గుండ్రనిశిలయే అది నృసింహ సాలగ్రామమని కొల్లాపురం వాస్తవ్యులైన కీ.శే. పల్లా చంద్రశేఖరశాస్త్రిగారు చెప్పినారు. ఈస్వామి సాలగ్రామమూర్తి కావటమేగాక ఈయనకు మరొక సాల గ్రామ హారంగూడ ఉంది. సాలగ్రామాలది అగునో కాదో గాని తిరుపతి వెంక టేశ్వరస్వామి వారి ఆభరణాలలోగూడ "సహస్రనామ సాలగ్రామమాల" ఒకటి ఉంది. సాలగ్రామాలు పూజలందుకోవటమే గాక ఈవిధంగా కొన్ని క్షేత్రాలలో విరాణ్మూర్తుల ఎదలపై రత్నహారాలైగూడ ప్రకాశిస్తున్నవి.

## గ్రంథ సంపాదనం

నాకీశాస్త్రం క్రీ.శ. 16-5-1967 నాడు మాయింటిలో శిథిలగ్రంథాలలో లభించింది. దాన్ని మాప్రపితామహుడు రామయ్యగారు సొంతదస్తూరితో వ్రాసి కొన్నాడు. ఆయన గొప్పసాహిత్య వ్యవసాయజీవి. తనజీవితంలో పరీధావిలో గణపతిపూజ చేసి గంటం పుచ్చుకొని వ్యాసపీఠంపైనుండి విక్రమసంవత్స రంలో లేచినాడు. ఈనడిమి కాలమంతా ఆయన వ్రాసిపెట్టిన గ్రంథాలు మా యింటిలో తేదీతప్పకుండా ఉండేవి. దీన్ని అతడు "సన్ 1278 (క్రీ.శ. 1806) స్వస్తిశ్రీ చాంద్రమాన వ్యవహారిక విభవసంవత్సర ఫాల్గుణశుద్ధ దశమి ఆదివారం" నాటికి వ్రాసికొన్నాడు.

పేరుక్రొత్తగా కనిపించి ఈ తాళప్రతినితీసి నేను జాగ్రతచేసినాను. చాలాకాలం గడిచింది. పిమ్మట శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు మత

ధార్మిక గ్రంధాలకు ఆర్థికసహాయం ఆరంభించిన తరువాత ఇది ఏమైనా ముద్రణకు యోగ్యంగా ఉందేమో చూతమని క్రీ.శ. 1980 జనవరిలో ఒకనాడు తీసి చదివి చూచినాను. విషయం నన్నాకట్టుకొన్నది. అంత ఇది ముద్రితమోకాదో చూతమని వావిళ్ళవారి వ్రాతకేటలాగులు, ఆంధ్రపత్రికవారి అముద్రిత గ్రంథ సూచి తిరుగవేసినాను ఈ పేరెక్కడ కనిపించలేదు. పిమ్మట నాకుతెలిసిన ఇద్దరు ముగ్గురు ప్రాచీన పండితులనుగూడ అడిగినాను. వారు శాస్త్రముండవచ్చు గాని ముద్రితమైనట్టు మాదృష్టికి రాలేదన్నారు. దానితో ధైర్యంగలిగి మొదటిసారిగా ఫిబ్రవరి నెలలో 8 వ తేదినాటికి కార్బను సాయంతో మూడు ప్రతులు వ్రాసినాను. విషయంలో ఉత్సన్నభాగాలు, శిథిలాలు మిక్కిలిగా ఉండి అది అనన్వయంగా ఉండింది.

నాకు సంస్కృతంలో ప్రవేశమేగాని పాండిత్యం లేదు. అందువల్ల దీన్ని మొదట మా కళాశాలలోని సంస్కృత పండితులు బ్రహ్మశ్రీ మామిడాల సీతా రామశాస్త్రిగారికి ఒక ప్రతినిచ్చి సవరించి పెట్టుడని కోరినాను. ఆయన దీన్ని ఆమూలాగ్రంగా పరిశీలించి ఉన్నంతవరకు శబ్దదోషాలు సవరించినాడు గాని గ్రంధపాఠాల విషయంలో ఏమీ చేయలేమని అంతకంటె దీనికి మరో ప్రత్యంతర మెక్కడైనా ఉంటె అన్వేషించమని, లేకుంటె ఆశవదులుమని చెప్పినాడు.

ఇక నాకేమిచేయవలెనో తోచలేదు. వారు సవరించిన ప్రతిని తీసికొని శుద్ధప్రతి వ్రాసికొని మాకళాశాలలో గల సంస్కృత వాచస్పత్యంలో ఈ విషయమేమైనా ఉండునేమో అని చూచినను దానిలోని ఆరవ సంపుటంలో 6000 పుట నుండి 6003 వరకు సాలగ్రామాలకు సంబంధించిన విషయాలు వివిధ పురాణాల నుండి క్రోడీకరింప బడినవి.

సాలగ్రామాలను గురించి శివ- స్కంద- పద్మ- విష్ణు- అగ్ని- బ్రహ్మ వైవర్త-వరాహ-మత్స్య-గరుడ పురాణాలలోను, అవిగాక యింకా మేరుతంత్రం, శ్రీతత్వ నిధి, వీరమిత్రోదయం, నారద పాంచరాత్రం, పురుషోత్తమ సంహితలలో గూడ ఉన్నట్లు తెలిసింది.

iii)

సంస్కృత వాచస్పత్య కర్తల కృషి గొప్పదేగాని దాని ముద్రణ బాగు లేదు. అందుచేత ఆ భాగాన్నంతా ఎత్తి వ్రాసికొని తీరిక సమయాలలో నాకు లభించిన ప్రతితో పోల్చిచూచినాను. విషయం ఒకటేగాని వాచస్పత్య పద్ధతి వేరు. నాకు దొరికిన ప్రతి పద్ధతి వేరుగా ఉన్నది. కాబట్టి ఇదొక ప్రత్యేక శాస్త్రం కావలెనని తలచి నాకు తెలిసిన వారినల్లా ఈ శాస్త్రం కొఱకు విచారిస్తు ఒకప్పుడు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక బండాగారంలో ఉండే మిత్రులైన శ్రీతీర్థం శ్రీధరమూర్తిగారికి మీ పుస్తక శాలలో ఈ పేరుగల గ్రంధమేదైనా ఉన్నదా! అని జవాబు వ్రాసినాను. వారొక ముద్రిత ప్రతి ఉన్నదని వ్రాసినారు.

అది ముద్రితమని చదివిన తరువాత నా ఉత్సాహం చల్లారింది. అయినా అది యిదేనోకాదో అనవసరమైన శంకలెందుకని దాన్ని మొదటి పేజీ వ్రాయించి తెప్పించుకున్నాను. నిస్సందేహంగా అది నాకు దొరికిన గ్రంథమే. అది చదువు కొని నా ఉత్సాహం మరీ అడుగంటినా, పాఠభేదాలైనా చూసికోవటానికి వస్తుంది గదా అని దాన్ని 28-9-1981 నాటికి పూర్తిగా వ్రాయించి తెప్పించుకొని నా ప్రతితో సరిచూసినాను. దానిలో నాకు కావలసిన శుద్ధ పాఠాలన్నీ దొరికినవి కాని నాప్రతిలో యింకా సుమారు 180 కొత్త పాఠాలున్నవి. అపుడు నేను నాప్రతిని సవరించుకొని 14-12-81 నాటికి మరో ప్రతిని వ్రాసికొని దానికి తాత్పర్యం గూడ వ్రాయవలెనని అనుకొన్నాను.

తీరిక వేళలో నేను దీనికి తాత్పర్యం వ్రాస్తుండగా 19-4-82 నాడు మిత్రుడు శ్రీ యం. రంగారావు గారితో కలిసి స్థానిక చరిత్రకై కలువకుర్తి తాలూకాలోని బైరంపల్లెకు వెళ్లవలసి వచ్చింది. అక్కడ నాకు అనుకోకుండా శ్రీ ఇరువెంటి దిలీప్‌కుమార్ గారి యింటిలో మరో పీచుప్రతి దొరికింది. అది మరికొన్ని పాఠభేదాల కుపయోగించింది.

ఈ విధంగా నేను పాఠాలన్ని సవరించుకొని 1982 మే ఆఖరు నాటికి ప్రతిని తాత్పర్య రచనతో ముగించి 24-8-1983 నాడు శ్రీ తిరుమల తిరుపతి

దేవస్థానం వారికి పంపగా వారిది ముద్రణ కంగీకరించి 5-11-83 నాడు తిరిగి పంపినారు. పిమ్మట నేను ఆర్థిక పరిస్థితిని సవరించుకొని 10-2-84 నాడు ముద్రణ కిచ్చినాను. అది 30-6-84 నాటికి ముగిసి ఈనాడు పుస్తకం మీచేతికి వచ్చింది. ఇది దీనిడైరీ.

## -: పరిష్కరణం :-

ప్రాచీన గ్రంథ సంపాదన మొకెత్తు. వాని పరిష్కరణ మరో యెత్తు. నాకు మా యింటిలో దొరికిన దానిలో 279, వాచస్పత్యంలో 140. మద్రాసు నుండి తెప్పించుకొన్న దానిలో 367, బైరంపల్లె ప్రతిలో 86 అనుష్టుప్పులున్నవి ఇక వానిలో చెప్పబడిన భేదాలలో-

| | | | | |
|---|---|---|---|---|
| మా యింటిలో దొరికిన దానిలో | 80 | ముఖ్యభేదాలు | 8 | అవాంతర భేదాలు |
| వాచస్పత్యంలో | 74 | ,, | 50 | ,, |
| మద్రాసు ప్రతిలో | 60 | ,, | 99 | ,, |
| బైరంపల్లె ప్రతిలో | 24 | ,, | 7 | ,, |

ఉన్నవి. మా యింటిలో లభించిన దానిలో చెప్పబడిన మొత్తం భేదాల సంఖ్య 81. వానిలో 10 అవతార భేదాలు, 21 కేశవనామాలు, 50 ఇతర భేదాలు. మద్రాసు ప్రతిలో మొత్తం 80 భేదాలు చెప్పబడినవి.

విషయం అన్ని ప్రతులలో సమానమైనా మద్రాసు ప్రతిలో విష్ణువు గరుడునికి, బైరంపల్లె ప్రతిలో బ్రహ్మ నారదునికి చెప్పినట్లుండగా నాకు దొరికిన దానిలో విష్ణువు గరుడునికి, అతడు బ్రహ్మకు, బ్రహ్మ నారదునికి, అతడితర మునులకు జెప్పినట్టు ఉంది. అంతేగాక శాస్త్రకర్త దానిలో తాను లక్షణ స్పష్టతకై కొంత కల్పించినట్లు గూడ చెప్పుకొన్నాడు. అవతారాది భేదాలు మూలంలో ఉన్నట్టే చెబుతున్నాను; వాని శబ్ద దోషాలు నే నెరుగనని మనవి చేసినాడు.

నేను మద్రాసు ప్రతిని ప్రధానంగాను, వాచస్పత్యాన్ని లక్షణ నిర్ణయానికి ప్రమాణంగాను పెట్టుకొని నాను దొరికిన ప్రతిని పరిష్కరించినాను.

మద్రాసు ప్రతి ముద్రితమని పేరేగాని అది పరిష్కృతంగాదు. దానిలో గ్రంథ విషయక్రమం అవతారికలో చెప్పినట్టులేదు. మూర్తి భేదాలు ఒక దానిలో ఒకటి కలిసిపోయినవి. గరుడ ధనంజయ భేదాలు శ్రీ కృష్ణమూర్తిలో, కలికి బలరామమూర్తిలో, పద్మనాభం హృషీకేశంలో, కపిలం హయగ్రీవంలో. సంకర్షణం, ఆకార వివరాలలో- ఈ విధంగా కలగలపై పోయినవి.

దానిలోని అవతారాలలో బుద్ధమూర్తి లేదు. కేశవనామాలు సంధ్యావందన క్రమంలో లేవు. శివుని పంచాననాలలో ఈశాన తత్పురుషాలు మాత్రమే ఉన్నవి. నామావళిలో అవి అఘోరాదిగా ఉన్నవి.

నామ సంగ్రహంలోని పేర్లుగూడ పరమహంస వరాహంస అని, యజ్ఞ భోక్త యజ్ఞభక్త అని, ఈ విధంగా ఇంకా మరికొన్ని గూడ రూపాలు మారినవి.

ఇక నాకు దొరికిన ప్రతి దీనికంటె అర్వాన్నమయిందే కాని దానిలో ముఖ్యభేదా లన్నిటికంటె ఎక్కువగా ఉన్నవి. అవతారాలలో అవాంతర భేదా లన్ని లేకున్నా ఒక్కొక్క దానిలో ఎన్నేసి ఉన్నవో మొదట సంఖ్యా సూచన ఉండింది. అవతారాలలో బుద్ధమూర్తి ఉన్నది. కేశవాదులలో నృసింహ వామన కృష్ణమూర్తి భేదాల నవతారాలలో చెప్పితిని కనుక ఇక్కడ చెప్పనని గూడ ఉన్నది. ఈ విధమైన సూచనలను బట్టి నాకు దొరికిన ప్రతి కొంత సమగ్రం అనిపించింది.

సాధారణంగా ప్రాచీన శాస్త్రాన్ని మార్చరాదు. అది ఉన్నది ఉన్నట్లే ముద్రించవలె గాని నాకు దొరికిన ప్రతిలోగాని, మద్రాసు నుండి తెప్పించుకొన్న దానిలో గాని విషయం అవతారికా క్రమంలో లేదు కనుక మూలప్రతి ఒకటి ఉంది గదా అనే ధైర్యంతో దీనిలోని విషయాన్ని అవతారికా ప్రకారంగా సవరించినాను.

కేశవనామాలను సంధ్యావందన క్రమంలో కూర్చినాను. అవతారాలలోని రామ కృష్ణమూర్తుల నామభేదాలను రామాయణ భాగవత కథాక్రమాన్ని దృష్టిలో పెట్టుకొని కూర్చినాను.

సాలగ్రామ మూర్తిభేదాలలో ఆకారభేదాలు నామభేదాలు అని రెండు విధాల భేదాలున్నవి. ఉదాహరణకు సంకర్షణ మనే పేరుతో మూడు, బలరామ బలభద్ర, సీరపాణి, ప్రలంబఘ్న అని నాలుగు పర్యాయ భేదాలున్నవి. మద్రాసు ప్రతిలో సంకర్షణ భేదాలు మూడొకేచోట లేవు. రెండొకచోట, ఒకటి వేరొక చోట ఉన్నవి. నేనివి మూడు ఒకేచోట జేర్చినాను. వాని పిమ్మట బలరామాది భేదాలు కూర్చినాను. ఇదే రీతిగా కేశవాదులను గూడ కూర్చినాను.

ఈ భేదాల కూర్పులో నేను మొదట ముఖ్య నామభేదాలు, వాని పిమ్మట పర్యాయ భేదాలు ఉండేటట్లు చూచినాను.

కేశవాదుల పిమ్మట చెప్పబడిన వానిలో మద్రాసు ప్రతిలో అవతారికలో చెప్పబడిన భేదాలన్నీలేవు. దానిలో లోపించినవి నా ప్రతిలో దొరికినవి కనుక వానిని యధాస్థానంలో చేర్చినాను. ఈ ప్రతులలో నాకు వీని అవతారికలో చెప్పబడని మరికొన్ని క్రొత్తభేదాలు గూడ లభించినవి. అవి ఇతర భేదాలపేర చివరన యిచ్చినాను.

నేను మద్రాసునుండి తెప్పించుకొన్న ప్రతి దేనికి సంబంధించినదో దానిలో చెప్పబడలేదు గాని అది వరాహ పురాణాంతర్గతమని శ్రీ దేవళ్ల చిన్న కృష్ణయ్య గారి వరాహపురాణ పీఠిక వల్ల తెలుస్తుంది. దానిలో అన్నీ వైష్ణవమూర్తి భేదాలే గాని శైవసంబంధమైనవిలేవు. అవి మేరు తంత్రంలో ఉన్నవి. వానిని జిజ్ఞాసువుల అందుబాటుకై దీని అనుబంధంలో వాచస్పత్యం నుండి చేర్చినాను.

అంతేగాక వాచస్పత్యంనుండి ఇంకా ఇతరమైన ఆధారాల నుండి నాకు లభించిన వివిధ పురాణాలు చెప్పిన సాలగ్రామ భేదాలను, మద్రాసు నుండి నేను తెప్పించుకొన్న ప్రతిలోగల భేదాలను, నేను సవరించి ప్రకటించుచున్న దీనిలోని భేదాలను పట్టికలుగా యిచ్చినాను.

సాలగ్రామాల పుట్టుకకు తులసీదేవి కారణం. ఆమె చరిత్ర వేరు వేరు పురాణాలలో ఉన్నా దేవీ భాగవతంలోనిది చక్కగా ఉన్నట్లు తోచింది. అందుచేత అవసరమైనంత భాగం అనుబంధంలో ఇచ్చినాను.

తులసి హింధూ గృహస్థులందరికి పవిత్రమైన ఆరాధ్యమూర్తి. తులసి కోట లేనియిల్లు. సారణంగా అరుదు గాబట్టి తులసీదేవి చరిత్రపిమ్మట ఆమె స్తుతి కూడా చేర్చినాను. సాలగ్రామ పూజనుకూడ ఒకటి చేర్చినాను. నాయొక్క ఈ పరిష్కరణ పాఠకులైన మీకు ఏమాత్రం సంతృప్తిని కలిగించినా నా పరిశ్రమ సార్థకమైనట్లు లెక్క.

విద్యానగర్ కాలనీ
వాణీ సదనం - 15-34
నాగర్ కర్నూలు

ఇట్లు
మీ-
కపిలవాయి లింగమూర్తి

## -: వివిధ పురాణములు జూపిన సాలగ్రామ భేదములు :-

| 44 అగ్ని పురాణము | | 19 బ్రహ్మవైవర్త | 23 గరుడపురా | 19 దేవీభాగవత | 19 మేరుతంత్రము |
|---|---|---|---|---|---|
| లక్ష్మీహరి | వైకుంఠ | లక్ష్మీనారాయణ | వాసుదేవ | లక్ష్మీనారాయణ | శివనాభ |
| వాసుదేవ | శ్రీధర | లక్ష్మీజనార్దన | గదాధర | లక్ష్మీజనార్దన | స్వయంభూ |
| సంకర్షణ | వామన | రఘునాథ | సంకర్షణ | రఘునాథ | త్ర్యంబక |
| ప్రద్యుమ్న | దధివామన | దధివామన | ప్రద్యుమ్న | వామన | ధూర్జటి |
| అనిరుద్ధ | సుదర్శన | శ్రీధర | అనిరుద్ధ | శ్రీధర | శంభు |
| కేశవ | సహస్రార్జున | దామోదర | నారాయణ | దామోదర | ఈశ్వర |
| నారాయణ | స్థూల దామోదర | బలరామ | నృసింహ | రణరామ | మృత్యుంజయ |
| హరి | రాధా దామోదర | అనంత | కపిల | రాజరాజేశ్వర | చంద్రశేఖర |
| పరమేష్ఠి | దామోదర | రాజరాజేశ్వర | వరాహ | అనంత | రుద్ర |
| విష్ణు | అనంత | మధుసూదన | కూర్మ | మధుసూదన | త్రివిద్యా |
| నారసింహ | పురుషోత్తమ | సుదర్శన | కృష్ణ | సుదర్శన | మహాకాళీ |
| కపిల నృసింహ | యోగీశ్వర | గదాధర | శ్రీధర | గదాధర | సౌరి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహానృసింహ | పద్మనాభ | హయగ్రీవ | వామన | హయగ్రీవ | గణేశ |
| లక్ష్మీనృసింహ | రశ్మిమాలి | నృసింహ | అనంత | నారసింహ | చంద్ర |
| వరాహ | గరుడ | లక్ష్మీనృసింహ | దామోదర | లక్ష్మీనృసింహ | బుధ |
| పృథ్వీవరాహ | జనార్దన | వాసుదేవ | బ్రహ్మ | వాసుదేవ | గురు |
| మత్స్య | లక్ష్మీనారాయణ | ప్రద్యుమ్న | విష్ణు | ప్రద్యుమ్న | శుక్ర |
| కూర్మ | హృషీకేశ | సంకర్షణ | హయగ్రీవ | సంకర్షణ | రాహు |
| శిలాకూర్మ | లక్ష్మీ నరహరి | అనిరుద్ధ | వైకుంఠ | అనిరుద్ధ | కేతువు |
| హయగ్రీవ | త్రివిక్రమ | | మత్స్య | | |
| సౌమ్యహయగ్రీవ | కృష్ణ | | త్రివిక్రమ | | |
| హయశీర్ష | చతుర్ముఖ | | సుదర్శన | | |
| | | | లక్ష్మీనారాయణ | | |

(ఇవి సా. వి. అనే పుస్తకం నుండి
గ్రహించబడినవి)

## —: మద్రాసు ప్రతిలో గల భేదములు :— 112

| | | | | | |
|---|---|---|---|---|---|
| మత్స్యమూర్తి | పరశురామ | మదనగోపాల | మాధవ | యజ్ఞమూర్తి | పరమేష్ఠి |
| కూర్మమూర్తి | రామమూర్తి | సంతానగోపాల | మధుసూదన | దత్తాత్రేయ | చతుర్ముఖ |
| మహాకూర్మ | వీరరామ | బాలగోపాల | గోవింద | శింశుమార | పితామహ |
| కూర్మవరాహ | సీతారామ | గోవర్ధనగోపాల | విష్ణు | ముకుంద | హిరణ్యగర్భ |
| వరాహ | విజయరామ | కాలీయమర్ధన | త్రివిక్రమ | హంస | ఈశాన |
| లక్ష్మీవరాహ | హృష్టరామ | ధనంజయ | శ్రీధర | పరమహంస | తత్పురుష |
| భూవరాహ | బాలరామ | శమంతకహరి | హృషీకేశ | వైకుంఠ | శంకర |
| ఘోణవరాహ | కోదండరామ | గోపీ వస్త్రాపహారి | పద్మనాభ | పుండరీక | |
| నరసింహ | దాశరథీరామ | చాణూరమర్ధన | దామోదర | లక్ష్మీపతి | |
| లక్ష్మీనృసింహ | రామలక్ష్మణ | కంసమర్ధన | స్థూలదామోదర | దేవదేవ | |
| కపిలనృసింహ | జానకీవల్లభరామ | లక్ష్మీగోపాల | వాసుదేవ | విశ్వరూప | |
| పాతాలనృసింహ | కేవల సీతారామ | కృష్ణరామ | ప్రద్యుమ్న | గరుడధ్వజ | |
| రాక్షసనృసింహ | పట్టాభిరామ | శ్రీగోపాల | అనిరుద్ధ | పీతాంబర | |
| విద్యుజ్జిహ్వనృసింహ | రామపంజరం | కల్కి | పురుషోత్తమ | సత్యవీరశ్రవ | |

| | | | | |
|---|---|---|---|---|
| మహాజ్వాలానృసింహ | రామబాణం | కేశవ | అనంతపురుషోత్తమ | అమృతాపహరణ |
| బాలనృసింహ | రామతూణీరం | నారాయణ | అధోక్షజ | చక్రపాణి |
| విభీషణనృసింహ | సంకర్షణ | లక్ష్మీనారాయణ | అచ్యుత | అనంత |
| యోగానందనృసింహ | బలభద్ర | ద్విచక్రలక్ష్మీనారాయణ | జనార్ధన | అవ్యయ |
| వామన | బలరామ | మాయానారాయణ | ఉపేంద్ర | త్రిమూర్తి |
| దధివామన | కృష్ణమూర్తి | శ్రీమన్నారాయణ | హరి | హరిహర |
| మహావామన | గోపాలకృష్ణ | వీరనారాయణ | హయగ్రీవ | స్వయంభూ |

## 166 -: సంపాదించి సవరించిన భేదములు :-

| | | | | | |
|---|---|---|---|---|---|
| మత్స్యమూర్తి | వామన | బలరామ | మాయానారాయణ | హంస | హిరణ్యగర్భ |
| కూర్మమూర్తి | బాలవామన | సీరపాణి | మాధవ | పరమహంస | గరుడ |
| ఆదికూర్మ | అభీష్టవామన | ప్రలంబఘ్న | గోవింద | వైకుంఠ | నర |
| మహాకూర్మ | బృహత్కుక్షివామన | కృష్ణమూర్తి | విష్ణు | పుండరీకాక్ష | శివనాథ |
| వరాహకూర్మ | దధివామన | బాలకృష్ణ | మధుసూదన | లక్ష్మీపతి | సద్యోజాత |
| వరాహమూర్తి | మహావామన | కృష్ణరాయ | త్రివిక్రమ | దేవదేవ | వామదేవ |
| కూర్మవరాహ | పరశురామ | శ్రీగోపాల | శ్రీధర | వటపత్రశాయి | అఘోర |
| ఘోణవరాహ | జామదగ్న్య | గోపాలకృష్ణ | హృషీకేశ | విశ్వంభర | తత్పురుష |
| భూవరాహ | శాంతజామదగ్న్య | గోపాలమూర్తి | పద్మనాభ | విశ్వరూప | ఈశాన |
| పృథ్వీవరాహ | రామమూర్తి | కాళీయమర్దన | దామోదర | గరుడధ్వజ | సూర్య |
| లక్ష్మీవరాహ | రఘునాథ | గోపీవస్త్రాపహరణ | స్థూలదామోదర | పీతాంబర | హైహయ |
| నృసింహ | దాశరథి | మదనగోపాల | రాధాదామోదర | సత్యవీరశ్రవ | దత్తాత్రేయ |
| రాక్షసనృసింహ | బాలరామ | గోవర్ధనగోపాల | వాసుదేవ | బహురూపి | శంకర |
| విభీషణనృసింహ | రామలక్ష్మణ | చాణూరమర్దన | శాంతావాసుదేవ | పుండరీక | హరి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాజ్వాలానృసింహ | కోదండరామ | కంసమర్ధన | ప్రద్యుమ్న | పారిజాతహర | సౌమ్యహయగ్రీవ |
| సర్వతోముఖనృసింహ | సీతారామ | లక్ష్మీగోపాల | అనిరుద్ధ | సుదర్శన | హయశీర్ష |
| అష్టభుజనృసింహ | వీరరామ | శమంతకహరి | పురుషోత్తమ | అమృతాహరణ | సహస్రార్జున |
| భీతినృసింహ | హృష్టరామ | సంతానగోపాల | అధోక్షజ | చక్రపాణి | యోగీశ్వర |
| విద్యుజ్జిహ్వానృసింహ | రణరామ | యదువీరకృష్ణ | అచ్యుత | జగద్యోని | రశ్మిమాలి |
| పక్షినారసింహ | దశకంఠకులాంతక | బుద్ధ | జనార్ధన | అనంత | రాజరాజేశ్వర |
| విదారణనారసింహ | విజయరామ | కల్కి | లక్ష్మీజనార్ధన | శేష | శంకర |
| జ్వాలావిదారణనారసింహ | జానకీరామ | మ్లేచ్ఛనాశనకల్కి | ఉపేంద్ర | అవ్యయ | |
| బాలనారసింహ | పట్టాభిరామ | కేశవ | హరి | త్రిమూర్తి | |
| లక్ష్మీనృసింహ | కేవలసీతారామ | నారాయణ | లక్ష్మీహరి | హరిహర | |
| పాతాలనృసింహ | రామపంజర | లక్ష్మీనారాయణ | హయగ్రీవ | శంకరనారాయణ | |
| అధోముఖినృసింహ | రామబాణ | ద్విచక్రలక్ష్మీనారాయణ | కపిల | స్వయంభూ | |
| కపిలనారసింహ | రామతూణీర | శ్రీమన్నారాయణ | యజ్ఞమూర్తి | పరమేష్ఠి | |
| సుదర్శన | సంకర్షణ | వీరనారాయణ | శింశుమార | చతుర్ముఖి | |
| యోగానందనృసింహ | బలభద్ర | రూపనారాయణ | ముకుంద | పితామహ | |

ఓం

శ్రీ విఖనస గురవే నమః

# సాలగ్రామ శాస్త్రమ్

*కరుణా లహరీపూర్ణ కర్ణాంతాయత లోచనమ్*
*రామ మిందీవర శ్యామం ధ్యాయే దిష్టార్థ సిద్ధయే.*
*శ్రీకృష్ణం గోపికా నాథం ప్రణమ్య జగతాం ప్రభుమ్.*

దయా తరంగములతో నిండి చెవులవరకు సాగిన కన్నులు గలవాడు. నల్లకలువవంటి వన్నెగలవాడైన శ్రీరాముని కోరికలు దీరుటకై తలచెదను.

గోపికలకు వల్లభుడు మరియు జగమునకు ప్రభువైన శ్రీకృష్ణునకు నమస్కరించి—

-: కృతియత్నమ్ :-

*గ్రంథాన్ బహూన్ సమాలోక్య సారసంగృహ్య యత్నతః*
*భేద ప్రభేద జ్ఞానార్థం కల్పితస్యాత్ క్వచిత్ క్వచిత్*
*గరుత్మతే విష్ణునోక్తం బ్రహ్మణే గరుడబోధితమ్*
*బ్రహ్మణా నారదా యోక్తం ఋషిభ్యో నారదేనవై*
*సాలగ్రామ శిలానాంతు గ్రాహేఽ గ్రాహ్య ఫలం తథా*
*ద్వార చక్రం తథా క్షేత్రం మూర్తినాం లక్షణంతథా*
*భేదంచ సమమేవాత్ర వక్ష్యేఽహం సాధుసమ్మతమ్.*

పెక్కు గ్రంథములు పరిశీలించి వాని సారమునంతను గ్రహించి ముఖ్య భేదములు మరియు అవాంతర భేదము లెరుగుటకు కొంత కొంత క్రొత్తగా కల్పించి —

విష్ణువు గరుత్మంతునకు, అతడు బ్రహ్మకు, బ్రహ్మ నారదునకు, నారదు డితర ఋషులకు జెప్పిన యీ శాస్త్రమున—

సాలగ్రామ శిలలందు పూజకు స్వీకరించదగిన మరియు స్వీకరించ దగనివాని ఫలములు, వానియొక్క ద్వారములు, చక్రములు, క్షేత్రములు మరియు మూర్తులయొక్క భేదములు నేను సాధుసమ్మతముగా జెప్పుచున్నాను.

శ్రీ భగవానువాచ :- -: క్షేత్రమాహాత్మ్యం :-

*గండక్యా శ్చోత్తరే తీరే గిరిరాజో సనాతనః*
*తత్ క్షేత్రం బ్రహ్మసాన్నిధ్యాత్ క్షేత్రాణా ముత్తమోత్తమమ్*
*యోజన ద్వాదశాయామం బహుతీర్థ సమాకులమ్*
*తత్ర చక్రనదీ నామ తీర్థం బ్రహ్మ వినిర్మితమ్*
*తస్యోత్తరే గిరేఃపాదే మమప్రీతి కరాఃశిలాః*
*తస్మిన్ శైలే స్థితాస్సర్వే పాషాణశ్చ ఖగేశ్వర!*
*చక్రాంకితాః సమభవన్ నిర్మితా వజ్రకీటకైః*
*మచ్చక్ర చిహ్నితా స్తత్ర తరవో విహగేశ్వర*
*తస్య క్షేత్రస్య మాహాత్మ్యం మయావక్తుం నశక్యతే*
*నరాణామపి పక్షీంద్ర కించిత్కాలం నివాసినామ్*
*సర్వాస్థిషు భవేచ్చక్రం మస్తకే పృష్ఠ కేవిచ*
*చక్ర నద్యుత్తరా మర్త్యా లభంతే పుణ్యముత్తమమ్*
*జంతవోపిచ తత్రస్థా మత్పరం సంప్రయాతి హి*
*ఏవం క్షేత్రస్య మాహాత్మ్యం సాలగ్రామ శిలోద్భవం.*

గండకీ నదియొక్క ఉత్తర తీరమున సనాతనమైన పర్వతరాజమున్నది. ఆప్రదేశము బ్రహ్మయొక్క సమీపమున నుండుటవలన క్షేత్రములలో మిక్కిలి ఉత్తమమైనది. అది పన్నెండు యోజనముల పొడవై అనేకమైన పుణ్యనదులతో గూడియున్నది. అచట బ్రహ్మచేత "చక్రతీర్థము" అనునది సృజించ బడినది. దాని కుత్తరమునగల కొండసానువులందు నాకిష్టమైన రాళ్ళున్నవి.

ఓ ఖగేశ్వరా! ఆ కొండపైగల శిలలన్ని వజ్రకీటకములచే చక్రపు గుర్తులు గలవిగా జేయబడినవి. అచటి చెట్లుగూడ చక్రపుగుర్తులతోనే యుండును గనుక ఆ క్షేత్రమహిమను జెప్పుటకు నావలన గాదు.

ఓ పక్షిరాజా ! నరులుగూడ అచట కొంతకాలము నివసించినంత మాత్రమున తమయొక్క సమస్తమైన యెముకలందు, తల మరియు వెన్ను నందు చక్రములు గలవారగుదురు.

చక్రనదియొక్క ఉత్తరతీరమున నివసించిన జనులకు ఉత్తమమైన పుణ్యము గలుగును. అచట నివసించు జంతువులుగూడ నాయొక్క పదమును బొందును. ఇది ఆ సాల్గ్రామ క్షేత్రముయొక్క మహిమము.

-: శిలోత్పత్తి లక్షణమ్ :-

*చక్రనద్యా గిరివరా దానీతాశ్చ శిలాస్సదా*
*గండక్యా ముపనద్యంతే సాలగ్రామ శిలాఃసదా*
*తాఃశిలా పూజనీయాశ్చ చాతుర్వర్గ ఫలప్రదాః*
*సాలగ్రామ శిలాస్తత్ర నానామూర్తి సమన్వితాః*
*మూర్తయో ద్వివిధాః ప్రోక్తాః జలజా స్థలజా స్తథా*
*జలజాః కోమలాః స్నిగ్ధా స్థలజాః పరుషా స్మృతాః*
*గారివాస్త్వఖిల రూపత్వాత్ తథా ప్రభృతి తన్నగః*
*సాలగ్రామాభి ధస్తత్ర ప్రథితో భువనత్రయే.*

పైనిజెప్పిన పర్వతమునుండి చక్రనదిచే యెల్లప్పుడు శిలలు తేబడుచు గండకీనదియందు వేయబడి సాల్గ్రామ శిలలగుచుండును. ఇటులైనవి నాలుగు పురుషార్థము లిచ్చునవై పూజింప దగిన వగుచున్నవి.

అచట పెక్కువిధములైన సాల్గ్రామ మూర్తులుండును. అవి నీట బుట్టి నవి, మెట్టన బుట్టినవి అని రెండు విధములుగా జెప్పబడును. నీటివి కోమలముగా నున్నగా, మెట్టవి బరుసుగా నుండునని యెరుగవలెను. సమస్త దేవతా రూపము లైన శిలలా కొండపై సిద్ధమగుచుండుటచే నాటినుండి యది ముల్లోకములలో సాల్గ్రామ గిరి యని ప్రసిద్ధిజెందినది.

తార్క్ష్య ఉవాచః :- -: చక్రకారణమ్ :-

*యేశిలాశ్చ రమానాథ రథచక్రేణ లాంఛితాః*
*తత్కారణం మమ విభో! కథయస్వ దయానిధే!*

ఓ రమానాథా! అచటి శిలలు చక్రలాంఛితము లగుటకు కారణమేమో నాకు దయతో జెప్పుమని గరుత్మంతు డడిగెను.

భగవానుచ:-

*శృణుతార్క్ష్య మహాభాగః వక్ష్యేతత్ సాధుపృచ్ఛతే*
*గండూష రూపాత్ పాతాల గంగాయా ముత్థితాసమమ్*
*తస్మాద్గండూష[1] సలిలే సేచనా త్త జలోద్భవాః*
*తత్ర నద్యాంభసా సిక్తాః పాషాణాశ్చక్రలాంఛితాః*
*మత్స్యాయాపాః కేచి త్తు కేచిదన్యా స్వారూపగాః*
*గండూషాంత ర్గతా స్తత్ర బిందవః కీటతాం యయుః*
*తేకీటా వజ్రకీటాఖ్యా దీర్ఘాః సూక్ష్మాశ్చ పేశలాః*
*తన్నదీ జాతపాషాణాన్ బాహ్యాజాన్ గర్భజాన్ స్తథా*
*షష్టిర్వ్రై శ్చక్రరూపం కుర్వ న్త్యంత స్తతోశ్మనామ్.*

ఓ మహాభాగా! అది జెప్పెదను వినుము. మంచి విషయ మడిగితివి. జలజములు పాతాళగంగలో దాని పుడిసిలింతలతోబాటు పుట్టుచు దానిలోనే నానుచు చక్రపుగుర్తులు గలవగుచున్నవి. అందులో కొన్ని నా స్వరూపములు, మరికొన్ని యితరములు.

పాతాల గంగయొక్క పుడిసిలింతలలోని నీటిబిందువులలో కీటకములు పుట్టుచుండును. అవి వజ్రకీటకములని పిలువబడును. పొడవుగా సన్నముగా మరియు నేర్పుగలవిగా నుండి ఆ నదిలో పుట్టి వెలుపలబడిన రాళ్లను మరియు నదిలోగల రాళ్లను అరువదేండ్లు తొలిచి చక్రము లేర్పరచుచుండును.

-: చక్రసంఖ్యాః :-

*ఏకకీటా ద్విచక్రస్యాత్ ద్వికీటాచ్చ చతుష్టయమ్*
*త్రికీటా యత్ర షట్చక్రం చతుష్కీటాష్ట చక్రకమ్*
*బాహ్యేవా భ్యంతరేవాపి చక్రాణాం స్థితిరీదృశీ*

---

1. గండూషము = వేగపు ప్రవాహమున నడుమ నడుమ అడుగునుండి లేచు బుగ్గలు.

సాలగ్రామము ఒక కీటకము గలదైన రెండు చక్రములు, రెండు గలదైన నాలుగు చక్రములు, మూడుగలదైన ఆరుచక్రములు, నాలుగుగలదైన ఎనిమిది చక్రములు గలదగును. ఈ చక్రములు లోపలగాని వెలుపలగాని యుండును. ఇది చక్రములయొక్క ఉనికి.

-:చక్రఫలమ్:-

*బాలచక్రం మహాపుణ్యం యౌవనంతు శుభావహమ్*
*వృద్ధచక్రం చాతిపుణ్యం చక్రహీనంతు నిష్ఫలమ్*
*హిరణ్యాగర్భకీటేన నిర్మితం చక్రముత్తమమ్*
*తదన్యా రూపజాతేన వినిర్మిత మనుత్తమమ్*
*పీఠ పద్మాది భేదేన చక్రం బహువిధం భవేత్.*

సాలగ్రామము పిన్నచక్రము గలదైన యెడల మహాపుణ్యము, నడిపి చక్రముగలది శుభమిచ్చును. పెద్దచక్రము గలది మిక్కిలి పుణ్యమైనది. చక్రములు లేనిది ఏ ఫలము నీయదు.

సాలగ్రామమునకు హిరణ్యగర్భ కీటకముతో జేయబడిన చక్రములు త్తమమైనవి. తక్కినవానితో జేయబడినది మంచివిగావు.

పీఠము పద్మము మున్నగు భేదములతో చక్రములు పెక్కు విధములుగా నుండును.

నారదోవాచ :- -: వర్ణభేదాః :-

*సాలగ్రామ శిలాభేదాః లక్షణం మూర్తినిర్ణయమ్*
*కథ్యతాం భగవన్ బ్రహ్మ క్షేత్రవర్ణం శుభాశుభమ్.*

ఓ బ్రహ్మదేవా ! సాలగ్రామ శిలలయొక్క భేదములను, మూర్తినిర్ణయమును, క్షేత్రముల యొక్క వన్నెలను మరియు వాని మంచి చెడ్డలను తెలుపుము.

బ్రహ్మోవాచ:-

*శృణునారదః వక్ష్యామి యన్మాత్రం పరిపృచ్ఛతి*
*సాలగ్రామ శిలాగ్రాహ్యం మంగళం దేశకాలతః*

జగతీ దేశమధ్యాస్యా నానావర్ణ విధాశిలాః
శ్వేతం శ్యామం తథాకృష్ణం నీలం వావ్యతసీ నిభమ్
హేమం పీతం హరిద్రాభం గౌరభం కాంస్యా పాండురమ్
రక్తాతి రక్తా కపిలాః లోహితా మధు పింగలాః
కర్బురా బహువర్ణాచ కలంకా ధూమ్రవర్ణకాః
అతివర్ణా వివర్ణాచ తథా సుస్నిగ్ధ వర్ణకాః
ఇత్యేవం వర్ణభేదేన జ్ఞేయాః చక్రాంకితాః శిలాః.

ఓ నారదా ! వినుము. నీవడిగినంత మట్టుకు దేశకాలముల ననుసరించి సాల[గ్రామ శిలల యొక్క గ్రహించదగిన లక్షణములను మరియు వానియొక్క శుభములను వినుము. ప్రపంచ మందలి దేశములలో పలురంగులు గల శిల లున్నాయి.

తెలుపు, చామన, నలుపు, నీలము, అగిసెపూవన్నె (ముదురు నీలము), బంగారు వన్నె, ఇత్తడిరంగు, పసుపురంగు, గోరవన్నె (గోరోచన వర్ణము), కంచురంగు, తెలుపు మించిన పచ్చన, ఎఱుపు, ముదురు ఎఱుపు, కుంకుమ పూవన్నె, కెంపువన్నె, తేనెరంగు, ముదురు తేనెరంగు, కర్బూజా రంగు, పలు వన్నెలు, చిట్టెపురంగు, పొగరంగు, ముదురు రంగు, పేలిన రంగు, చిక్కని రంగు- అని ఈ భేదములు చక్రములు గల శిలలందు గుర్తించవలెను.

-: క్షేత్రవర్ణాః :-

క్షేత్రంతు త్రివిధంజ్ఞేయం మూర్తితో వర్ణత స్తథా
మిశ్రలక్షణ తశ్చేతి, విజ్ఞాతవ్యం విచక్షణైః
వామనానా మచ్యుతంస్యాత్ శ్రీధరంచ త్రివిక్రమమ్
క్షేత్రం వారాహమూర్తైస్తు శ్రీధరంత్వా ఖిలప్రదమ్
హయగ్రీవస్యా వారాహం లక్ష్మీక్షేత్ర మథావివా
క్షేత్రం నారాయణం జ్ఞేయం అన్యేషాం క్రమశస్మృతమ్.

క్షేత్రములు మూడు విధములని యెరుగవలెను. రంగును, మూర్తిని మరియు మిశ్ర లక్షణములను బట్టి విజ్ఞులు వానిని తెలిసికొందురు.

అచ్యుతము వామన క్షేత్రమునకు, శ్రీధర, త్రివిక్రమములు వరాహ క్షేత్రమునకు జెందినవి. వీనిలో శ్రీధర మన్ని కోరిక లిచ్చును. హయగ్రీవమును వరాహము, లక్ష్మి లేదా నారాయణ క్షేత్రమునకు జెందినదిగా యెఱుగవలెను. తక్కినవి ఈ క్రింది విధముగా నుండును:

క్షేత్రంతు వాసుదేవస్య శ్వేతవర్ణం ప్రచక్షతే
శ్రీమన్నారాయణక్షేత్రం హరిద్రాభంచ గౌరవమ్
హైమం హిరణ్యగర్భంస్యాత్ శ్రీధరం వీతముచ్యతే
శ్యామం నారాయణం జ్ఞేయం విష్ణుం కృష్ణం తథైవచ
దామోదరంతు నీలాభం అనిరుద్ధం తథైవచ
మధ్వాభం మాధవంజ్ఞేయం రక్తం సంకర్షణం తథా
వర్ణతః కపిలంసర్వం నారసింహం ప్రచక్షతే
బహువర్ణ మనంతంస్యాత్ వామనం రుక్మసంప్రభమ్
క్షేత్రం కథితమిత్యేవం వర్ణతో మునిసంయమీ
లక్షణాంతర యోగేన తత్తక్షేత్ర ముదాహృతమ్.

వాసుదేవము తెలుపు, శ్రీమన్నారాయణము పసుపు లేక గోరవన్నె, హిరణ్యగర్భము బంగారు రంగు, శ్రీధరము ఇత్తడి పచ్చన, నారాయణము చామన, విష్ణువు కృష్ణము గూడ నటులే యుండును. దామోదరము నీలము, అనిరుద్ధమట్టిదే. మాధవము తేనెరంగు, సంకర్షణము నెత్తురు రంగు, నారసింహము పూర్తిగా ఎఱ్ఱచందనపు వన్నె - అనంతము పెక్కు రంగులు, వామనము బంగారు చాయ, అని యిటుల ఓ దేవమునీ! వన్నెలనుబట్టి క్షేత్రములు చెప్పబడుచుండును. ప్రత్యేక లక్షణమున్నచోట వాని వాని క్షేత్ర ముదాహరింతును.

## -: వర్ణఫలమ్ :-

శ్వేతం మోక్షప్రదం చైవ, నీలం లక్ష్మీప్రదాయకమ్
పుష్టిదం వృద్ధిదం శ్యామం కృష్ణం కీర్తిప్రదం సదా
గౌరవర్ణం ధనకరం హేమవర్ణం తథైవచ
పాండురం కీర్తిదం విద్యాత్ రక్తం రాజ్యప్రదాయకమ్

పీతా పుత్రఫలం దద్యాత్ సుఖదం బహువర్ణకమ్
క్షేత్రాణాం ఫలితం వక్ష్యే వర్ణభేదేన నారద !

తెలుపు మోక్షమునిచ్చును. నీలము లక్ష్మీప్రదము. చామన పుష్టిని వృద్ధిని గలిగించును. నలుపు ఎల్లపుడు కీర్తిప్రదము. గోరవన్నె ధనమిచ్చును. బంగరు రంగుగూడ అట్టిదే. తెలుపుమించిన పసుపు కీర్తినిచ్చునని తెలియవలెను. ఎఱుపు రాజ్యమును, పసుపు పుత్రులను యిచ్చును. పలువన్నెలుగలది సుఖము గలుగ జేయును.

నారదా ! వర్ణభేదమునుబట్టి ఈ క్షేత్రఫలములు జెప్పబడినవి.

-: గ్రాహ్యశిలా నిర్ణయమ్ :-

స్నిగ్ధం సూక్ష్మం శీతలాంగం వృత్త మున్నత మస్తకమ్
శ్యామం కృష్ణం తథాపీతం బహుచక్రంచ లోహితమ్
వామచక్రం మధ్యచక్రం ద్వారచక్రంచ దక్షిణమ్
వనమాలా దామవృత్తం వదనంచాతిగహ్వరమ్
ఏతే గ్రాహ్యావిశేషేణ సాధకస్య శుభప్రదాః.

నునుపైనది, చిన్నది, చల్లనిది, గుండ్రనిది, ఎత్తయిన తలగలది, చామనది, నల్లనిది, అటులే పచ్చనిది కుంకుమపూవు రంగుగలది;

అనేక చక్రములుగలది, ద్వారమునగాని లేదా దానికి కుడినగాని ఎడమన గాని చక్రముగలది, తోమాలెతో చుట్టబడినది, గుహవంటి పెద్ద నోరుగలది - ఇవి పూజింపదగినవి. సాధకునకు శుభములిచ్చును.

-: ఆకారఫలమ్ :-

స్నిగ్ధం సిద్ధిప్రదం నిత్యం సూక్ష్మం ద్రవ్యఫలప్రదమ్
సంతోషజం శీతలాంగం వృత్తం సిద్ధిప్రదాయకమ్
వృత్తాననం భుక్తికరం వాది కౌశలదాయకమ్
నస్థూలం నకృశం భిన్నం నాతికష్టం నకర్కశమ్

స్థిరాసనా యుతంచాపి రాజ్య భోగాపవర్గదమ్
బింబ్వామలక తుల్యాయ సూక్ష్మచక్ర ద్వయాన్వితా
తస్యామేవ సదాకాలం హరిరాస్తే శ్రియానహ
యథాయథా శిలాసూక్ష్మం, ఫలాధిక్యం తథాతథా.

నునుపైనది యెల్లపుడు కార్యసిద్ధిని, చిన్నది ద్రవ్యమును యిచ్చును. చల్లదనముగలది సంతోషమును, గుండ్రనిది సిద్ధిని గలిగించును. గుండ్రని నోరు గలది అన్నమును మరియు పావనమైన పుణ్యమును, మిక్కిలి లావుగాని సన్నముగాని గాక, పగులక బిరుసులేక పొందికగల గద్దెగలది రాజ్యభోగమును మరియు మోక్షమును గలుగజేయును. ఉసిరికపండు వలెనుండి రెండు సన్నని చక్రములతో గూడినదాని యందెపుడు శ్రీహరి లక్ష్మీదేవితో నివసించును.

శిల యెంతెంత చిన్నదైన యెడల ఫలమంతంత యధికము.

-: చక్రఫలమ్ :-

వామచక్రం మధ్యచక్రం పుత్రపౌత్రాభి వర్ధనమ్
కీర్తిప్రదం ద్వారచక్రం మోక్షదంస్యాత్ సగహ్వరమ్
వనమాలా యుతంచాపి దార సౌభాగ్య దాయకమ్
పద్మాది యుక్తం సౌభాగ్యం ధేనుధాన్య ధనప్రదమ్
చక్రైః నకేసరైర్యుక్తం పార్శ్వాభిః నమలంకృతమ్
వనమాలా లాంఛితంచ యత్రాస్తే శ్రీసహాయవాన్
తస్మిన్ గృహే నదారిద్ర్యం నచోరాది భయం తథా
అగ్నిపీడా దుర్గ్రహాది పీడాచ నభవిష్యతి.

ద్వారమునకు ఎడమవైపునగాని నడుమగాని చక్రముగలది పుత్రపౌత్రాభివృద్ధిని, ద్వారమున చక్రముగలది కీర్తిని గలిగించును. గుహవంటి పెద్దనోరు గలది మోక్షము నిచ్చును. తోమాలెతో గూడినది భార్యా సౌభాగ్యమును, పద్మము మున్నగువానితో గూడినది సౌభాగ్యమును మరియు గోవులను ధనధాన్యమును గలిగించును.

రెండువైపులలో కేసరములతో గూడిన చక్రములు గలిగి తోమాలె గుర్తులు దేనికి నుండునో అది శ్రీసహాయముగల సాలగ్రామము. అది గల యింటిలో దారిద్ర్యము, దొంగల భయము, అగ్నిపీడ, మరియు దుర్గ్రహ బాధ యుండవు.

-: అగ్రాహ్య శిలాలక్షణమ్ :-

*కరాలం వికరాలంచ తిర్యాగ్వక్త్రం విదిఙ్ముఖిమ్*
*కోణచక్రం బద్ధచక్రం అచక్రం వక్రచక్రకమ్*
*భిన్నచక్రం భగ్నచక్రం అధో విషమ చక్రకమ్*
*అనుక్తం బహుచక్రంచ, పంక్తిచక్రం వివర్ణకమ్*
*ధూమ్రం తథాతిరక్తంచ కలంక మధుపింగలమ్*
*అంతస్ఫుటిత భగ్నేచ దుర్దురం నిమ్నమస్తకమ్*
*అతిస్థూల మతిహ్రస్వం అంతస్సలిల ధారణమ్*
*త్రికోణం బహుచక్రాఢ్యం చిహ్నహీనం చలాననమ్*
*అర్ధ మున్నత ముష్ణంచ సందిగ్ధో స్పష్ట రూక్షణమ్*
*ఛిద్రాననం బహుచ్ఛిద్రం స్ఫోటంచైహిక వాంఛిభిః*
*పూజాయాం వర్జనీయస్యాత్ నిష్కామస్య నదూష్యతి.*

వంకరది, ఎగుడు దిగుడుగలది, ప్రక్కమూతి, పెదమొగము గలవి, మూలచక్రము, కట్టుబడిన చక్రము, చక్రములేని చక్రము, వంకర చక్రము, పగిలిన చక్రము, విరిగిన చక్రము, తలక్రింది చక్రము, సమముగాలేని చక్రము గలవి, శాస్త్రమున చెప్పబడనివి, మిక్కిలి చక్రములు, చక్రముల వరుసలుగలవి, రంగుపేలినది, పొగవన్నె, ముదురెరుపు, మసకవన్నె, తేనెరంగు, ముదురు తేనెరంగు గలవి, లోపల పగులుగలది, పగిలినది, శరీరముపై దుద్దుర్లుగలది, గుంత తల గలది, మిక్కిలి లావైనది, మిక్కిలి సన్ననిది, లోపల నీరు నిలుచునది, ముక్కోణము గలది, మిక్కిలి గీతలుగలది, ఏ గుర్తులు లేనిది, గద్దె పొందనిది, సగము యెత్తు సగము పల్లము గలది, వేడిగుణము గలది, సందేహ లక్షణము గలది, అస్పష్టమైనది, గరుకుగలది, మొగమున చిల్లులు గలది, మిక్కిలి చిల్లులుగలది, పగులుగలది ఐహికఫలములు గోరువారు పూజించరాదు. నిష్కాములకివి దోషముగాదు.

-: మూర్తి భేదాః :-

అనేక మూర్తయస్సంతి తత్తల్లక్షణ లక్షితాః
వైలక్షణ్యం విశేషేణ జ్ఞాతుం శక్యం నవైకలౌ
వర్ణరూపా ద్యవయవైః ప్రమాణ బలలాంఛనైః
ద్వారదేశ విభాగైశ్చ భేదం తేషాంచి దుచ్యతే.

సాలగ్రామ మూర్తులలో అనేక భేదములున్నవి. వాని వాని లక్షణములు విలక్షణములు. ఆ విశేషములు కలియుగమున దెలియ శక్యముగాదు కనుక రంగులు, రూపములు, అంగముల యొక్క కొలతలు మరియు ద్వారదేశ విభాగ ములను బట్టి కొన్ని భేదములిచట జెప్పబడును.

-: మూర్తినామాని :-

మత్స్యాద్యా కేశవాద్యాశ్చ హయాస్యాః కపిల స్తథా
యజ్ఞభో క్తః శింశుమారో ముకుందో హంసఏవచ
పరమహంసాచ వైకుంఠో పుండరీకాక్ష ఏవచ
లక్ష్మీపతి ర్దేవదేవో వటపత్ర శయ స్తథా
విశ్వాభరో విశ్వరూపో గరుడధ్వజ ఏవచ
పీతాంబర ధరశ్చైవ సత్యావీర శ్రవ స్తథా
బహురూపీ పుండరీకః పారిజాత స్సుదర్శనః
అమృతావహో చక్రపాణిః మాయా నారాయణ స్తథా
జగద్యోనిః తథానంతః అవ్యయో హరిమూర్తయః
త్రిమూర్తి హరిపూర్వాశ్చ హరశంకర పూర్వకాః
నారాయణః స్వయంభూశ్చ పరమేష్టీ చతుర్ముఖః
పితామహ స్వర్ణగర్భః గరుడ శ్శేష ఏవచ
బలరామ స్సీరపాణిః ప్రలంబఘ్నో నర స్తథా
శివనాభి రఘోరశ్చ సద్యోజాత స్తథైవచ
వాసుదేవ స్త థేశాన స్తత్పురుష స్సూర్యా ఏవచ
హైహయశ్చ తథా దత్తా త్రేయశ్చ శ్వారఏవచ
క్షీరాబ్ధిశాయి శ్చేతిభేదాః ఏకాశీతి విధాస్మృతాః.

i. మత్స్యాది అవతారమూర్తి భేదములు 10
ii. కేశవనామాది భేదములు 21
iii. హయగ్రీవాది అన్య భేదములు 50
వెరసి మొత్తము 81

-: అన్యమూర్తులు :-

| | | | |
|---|---|---|---|
| హయగ్రీవ | కపిల | యజ్ఞభోక్త | శింశుమార |
| ముకుంద | హంస | పరమహంస | వైకుంఠ |
| పుండరీకాక్ష | లక్ష్మీపతి | దేవదేవ | వటపత్రశాయి |
| విశ్వంభర | విశ్వరూప | గరుడధ్వజ | పీతాంబరధర |
| సత్యవీరశ్రవ | బహురూపి | పుండరీక | పారిజాత |
| సుదర్శన | చక్రపాణి | మాయానారాయణ | జగద్యోని |
| అవ్యయ | హరి | (క్షీరాబ్ధిశాయి) | 1. ఇవి హరిమూర్తులు |
| త్రిమూర్తి | సూర్య | — | — |
| అమృతాపహరణ | గరుడ | నర | 2. ఇవి ఏకైకమూర్తులు |
| హరిహర | శంకరనారాయణ | — | 3. ఇవి హరిహరమూర్తులు |
| స్వయంభూ | పరమేష్టి | చతుర్ముఖ | పితామహ |
| స్వర్ణగర్భ | — | — | 4. ఇవి బ్రహ్మమూర్తులు |
| అనంత | శేష | — | 5. ఇవి శేషమూర్తులు |
| బలరామ | సీరపాణి | ప్రలంబఘ్న | 6. సంకర్షణమూర్తులు |
| శివనాభ | అఘోర | సద్యోజాత | వామదేవ |
| ఈశాన | తత్పురుష | ఈశ్వర | 7. ఇవి శివమూర్తులు |
| హైహయ | దత్తాత్రేయ | — | 8. ఇవి యోగమూర్తులు |

అని యిటుల శాస్త్రములందు ఎనుబదియొక్క మూర్తులు చెప్పబడినవి.

మూర్తీనాం లక్షణం తాసాం దర్శయిష్యే పృథక్ పృథక్
చక్రవక్త్ర శిలాశుద్ధి సంయుక్తా హ్యుక్త లక్షణైః
కైశ్చిన్న్యూనాపి సామూర్తిరుత్తమా సిద్ధిదాయినీ
మత్స్యకూర్మాది మూర్తీనాం లక్షణం ప్రాయశో మయా
గ్రంథస్థం లిఖ్యతే దస్మాచ్ఛుద్ధదోషో నవిద్యతే.

పై వానిలో మూర్తుల లక్షణమును ఇక వేరు వేరుగా జూపగలను. ముఖము, చక్రములు, శిలాశుద్ధి అను వానిలో ఒకవేళ ఏదేని ఒక లక్షణము తక్కువైనను అది ఉత్తమమైనది మరియు సిద్ధిప్రదమైనదిగనే తలచవలెను.

మత్స్య కూర్మాది మూర్తుల లక్షణము పూర్వగ్రంథము లందున్నటులే నాచే చెప్పబడును. అందలి శబ్దదోషములు మాత్రము నేనెరుగను.

* * * *

## అవతార భేదాః

నారదోవాచ:-

*దశావతార భేదాంశ్చ లక్షణం వివృణోమితి*
*శృణుధ్వం ఋషయస్సర్వే సావధానా భవంతు వః.*

ఓ మహర్షులారా! దశావతార భేదములను వివరింతును. మీరందరు సావధానులరై వినుడు.

### 1. అథ మత్స్యమూర్తి లక్షణమ్

*దృశ్యతే మత్స్యమూర్తిస్స్యాత్ త్రివిధా భిన్నచిహ్నితః*
*దీర్ఘాకార యుతాస్నిగ్ధా ద్వారమధ్యే ద్విచక్రయుక్*
*చక్రమేకం తథాపుచ్ఛే దక్షిణే శఫరాకృతిః*
*వామే ప్రదృశ్యతేవాపి మత్స్యమూర్తి రుదాహృతా*
*మత్స్యాకృతి ముఖంయత్ర ముఖసంధిషు చక్రికా*
*శ్రీవత్స బిందుమాలాఢ్యా మత్స్యమూర్తి శుభప్రదా*
*అస్యమధ్యే ద్విచక్రం చప్పష్ఠేవా సుషిరం భవేత్*
*పృష్ఠభాగే చైకచక్రం మత్స్యమూర్తిః శుభప్రదా*
*పీతశ్వేత నిభోదేవః రేఖాపంచక సంయుతః*
*వీక్షితః శఫరాయశ్చ చక్రంచైవతు దక్షిణే*
*మత్స్యమూర్తి రితిఖ్యాతో భోగమోక్ష ప్రదాయకః.*

మత్స్యమూర్తి వేరువేరు గుర్తులతో మూడు విధములుగా గనిపించును.

పొడవై సనుపై ద్వారము నడుమ రెండు, తోకవైపు ఒకటి చక్రము లుండి, రెండువైపులలో చేపలవంటి రేఖలుగల శిల మత్స్యమూర్తి యని చెప్ప బడును.

ఏ శిల మొగము చేపవలెనుండి ఆ ముఖసంధిలో ఒక చక్రము గలిగి శ్రీవత్సమను మచ్చతో గూడియుండునో ఆ మూర్తి శుభప్రదమైనది.

మొగము నడుమ రెండు చక్రములు లేక వెన్నున ఒక రంధ్రము ఒక చక్రము గల మత్స్యమూర్తి శుభమైనది.

పసుపు తెలుపు రంగులతో గూడి చేపవలెనుండి శరీరముపై అయిదు రేఖలు మరియు ఎడమవైపు ఒక చక్రముగల శిల మత్స్యమూర్తి యనబడును. అది భోగమోక్షము లిచ్చును.

-:2. అథ కూర్మమూర్తి లక్షణమ్:-

*చతుర్థా కూర్మమూర్తిశ్చ తస్యాలక్షణ ముచ్యతే*
*కూర్మం స్యాదున్నతం పృష్ఠే శ్వేతాభం గోఖురాన్వితమ్*
*ఆస్యే ద్విచక్ర సంయుక్తం దుర్లభోఽతి శుభప్రదః.*

కూర్మమూర్తి నాలుగు విధములుగా నుండును. వానిలక్షణము జెప్పెదను.

తెల్లని కాంతిగలిగి వీపు ఎత్తుగానుండి ఆవుగిట్టలవంటి రేఖలు మరియు మొగమున రెండు చక్రములుగల కూర్మమూర్తి దొరుకుట కష్టము. అదిమిక్కిలి శుభమైనది.

*బిందుత్రయ యుతాపృష్ఠే శంఖచక్ర యుతాపివా*
*దీర్ఘదక్షిణ వామాస్యా తత్ర చక్ర ద్వయాన్వితా*
*కుసూలత్రయ యుక్తాచ దుర్లభా సర్వకామదా.*

వెన్నున మూడుచుక్కలు లేదా శంఖచక్రములు, కుడిఎడమలందు పొడ వైన మొగములు, వానిలో రెండేసి చక్రములు, మూడు గుమ్మిరేకలుగల కూర్మమూర్తి మిక్కిలి దుర్లభము. అది అన్ని కోరికలిచ్చును.

వృత్తాయుతా కూర్మమూర్తిః కనకచ్ఛవి సంయుతా
ఆస్యే చక్రద్వయోపేతా చక్రస్యోభయ పార్శ్వతః
పృష్ఠే శంఖాకృతి ర్వాపి మునీశాః శుభప్రదా.

ఓ మునులారా! బంగారురంగు, వెడల్పైన వృత్తము మొగమున, కిరు వైపుల రెండుచక్రములు వానికిరువైపుల రెండుశంఖములు గలిగిన కూర్మమూర్తి మిక్కిలి శుభమైనది.

వర్తులా కమలాకారా దీర్ఘద్వార ద్విచక్రయుక్
నాభీ చక్రయుతావాపి కూర్మాకారాతు పార్శ్వతః
స్థిరాసనోన్నతాపృష్ఠే నీలలోహిత వర్ణకా
కూర్మమూర్తి రితిఖ్యాతా పుత్రపౌత్రాభివృద్ధిదా.

కమలమువలె గుండ్రనై పొడవగు రెండు ద్వారములు, వానిలోగాని లేదా నాభిలోగాని చక్రములు, ప్రక్కలందు కూర్మరేఖలు, ఎత్తగు వీపు మరియు పొందికగల గద్దెగలిగి నలుపు ఎఱుపు రంగులతో గూడినది కూర్మమూర్తియని ప్రసిద్ధి; అది పుత్రపౌత్రాభి వృద్ధిని గలిగించును.

కూర్మస్తు లోన్నతః పృష్ఠే వర్తులశ్చ కృశోదరః
హరితా వర్ణమాధత్తే దద్యాత్ ఫలమనుత్తమమ్
స్థూలంతు నిబిడాకారం శ్యామవర్ణం సచక్రకమ్
కర్బురం వాపికపిలం శ్యామంవా కూర్మముచ్యతే.

ఆకుపచ్చని రంగుతో గుండ్రనై ఎత్తగువీపు మరియు పలుచని కడుపు గల కూర్మమూర్తి అల్ప ఫలమిచ్చును. కర్బురము, కపిలము లేదా శ్యామలమై లావుగానుండి మరియు దృఢమైనది కూర్మమూర్తి యనబడును.

చక్రనాభౌతు సంలగ్నం నీలలోహిత వర్ణకమ్
స్థిరాసనం నమత్ పృష్ఠం కూర్మం పుత్రాభి వృద్ధిదమ్.

నలుపు ఎఱుపు రంగులుకలిసి వంగినవీపు పొందుబాటగుగద్దె మరియు నాభిలో చక్రముగల కూర్మమూర్తి పుత్రపౌత్రాభి వృద్ధిని గలిగించును.

*సువృత్తం సూక్ష్మవదనం ద్వారేచక్రద్వయాన్వితమ్*
*నీలోత్పల దళశ్యామం పృష్ఠం మధ్యే సమున్నతమ్*
*స్వర్ణరేఖా యుతం వాపి కూర్మం భువి సుదుర్లభమ్.*

చక్కని చిట్టివదనము సన్ననినోరు, ద్వారమున రెండుచక్రములు, వెన్ను నడిమిభాగమున యెత్తుగలిగి నల్లకలువవంటి రంగుతో, బంగారు గీతలతో నున్న కూర్మమూర్తి దొరుకుట కష్టము.

### -: మహాకూర్మమ్ :-

*తురంగమ ముఖాకారం చక్రాబ్జ వనమాలికా*
*శ్యామలో హేమబిందు శ్రీర్మహాకూర్మ స్సుదుర్లభః.*

నల్లనై అశ్వముఖాకారము గలిగి బంగారుచుక్కలు, చక్రము, కమలము మరియు వనమాలగల మూర్తి మహాకూర్మ మనబడును. అది మిక్కిలి దుర్లభము.

### -: ఆదికూర్మమ్ :-

*వృత్తాయుతా కూర్మమూర్తిః కనకచ్ఛవి సంయుతః*
*స్నుహి పుష్పాకృతిర్వాపి చక్రస్యోభయ పార్శ్వాతః*
*ఆదికూర్మ ఇతిఖ్యాత స్సర్వకామ ఫలప్రదః*

గుండ్రనై విశాలమై బంగారు రంగుతోగూడి చక్రమునకు రెండువైపులలో జెముడుపూవు ఆకారరేఖలుగలది ఆదికూర్మ మనబడును. అది అన్నికోరెక లిచ్చును.

### -: మందరధర కూర్మమ్ :-

*బిందుద్వయాన్వితో చక్ర శంఖద్వయ యుతోపివా.*
*దీర్ఘ దక్షిణ వామాస్యః భాగే వలయ పంచకః*
*సా మందరధరః కూర్మమూర్తిస్స్యాత్సర్వ కామదః*

రెండుచుక్కలు లేదా శంఖచక్రములతోగూడి కుడిఎడమలందు పొడవైన నోరు, దానిదగ్గర అయిదేసివలయములు గలది మందరధర కూర్మమూర్తి యన బడును. అది అన్ని కోరికలిచ్చును.

-: వరాహ కూర్మమ్ :-

*వర్తులం మకరాకారం దీర్ఘద్వారంతు పార్శ్వకే*
*అండద్వయ సమాయుక్తం రేఖా శంఖాది సంయుతమ్*
*దీర్ఘదక్షిణ వామాస్యాం శంఖచక్ర సమీపతః*
*కూర్మమూర్తౌ వరాహంస్యాత్ దుర్లభం సర్వకామదమ్.*

గుండ్రనై మకరాకారముగలిగి ప్రక్కలందు పొడవైన ద్వారములు వానిలో చక్రములు ద్వారముల ప్రక్కన రెండేసి యండములు మరియు శంఖ రేఖలుగలది వరాహకూర్మ మనబడును. అది దుర్లభము కోరికలన్ని దీర్చును.

3: -అథ వరాహ లక్షణమ్:-

*అతసీ కుసుమప్రఖ్యం నీలోత్పల నిభంతువా*
*దీర్ఘాకారం సజలకం దీర్ఘద్వార యుతంతు వా*
*స్వర్ణరేఖా సమాయుక్తం వరాహాకృతిరేవచ*
*వరాహమూర్తి స్త్రివిధా భిన్నలక్షణ యోగతః.*

అగిసెపూవు వన్నె లేదా నల్లకలువవంటి రంగు గలిగి, లేక పొడవై నీటి చుక్కలు మరియు పొడవైన నోరుగలిగి లేక పందిముట్టి ఆకారముగలిగి బంగారురేకలతో గూడి యిటుల భిన్నభిన్న లక్షణములతో వరాహమూర్తి మూడు విధములుగా నుండును.

*పృష్ఠోన్నతంచ దీర్ఘాస్యం వామతః చక్రమున్నతమ్*
*వరాహమూర్తి రిత్యుక్తం రాజ్యలక్ష్మీ ప్రదం నృణామ్*
*పుత్రపౌత్ర ప్రదా నిత్యం భూధనః జ్ఞానవర్ధనః.*

ఎత్తగువీపు పొడవైననోరు మరియు ఎడమవైపున ఉన్నతమగు చక్రము గలది వరాహమూర్తి యనబడును. అది నరులకు రాజ్యలక్ష్మిని, పుత్రులను, పౌత్రులను గలిగించును. భూమిని, ధనమును, జ్ఞానమును వృద్ధిబొందించును.

*ఇంద్రనీల నిభాజ్ఞేయా స్థూలరేఖా త్రయాన్వితా*
*వరాహమూర్తి ర్విజ్ఞేయా దుర్లభా సర్వకామదా.*

2)

ఇంద్రనీలపు వన్నెగలిగి లావై మూడు రేఖలున్న వరాహము మిక్కిలి యరుదు. అది అన్నికోరికలు దీర్చును.

*సుముఖం సూక్ష్మవక్త్రంచ ఉన్నతం మస్తకోపరి*
*త్రిబిందునా సమాయుక్తం వరాహంతు ధనప్రదమ్.*

అందమైన మొగము సన్నని నోరు, ఎత్తగు తల మరియు తలపై మూడు చుక్కలు గల వరాహమూర్తి ధనమిచ్చుకు.

## -: కూర్మ వరాహమ్ :-

*దీర్ఘదక్షిణ వామాస్యాం చక్రం ద్వార సమీపగమ్*
*బిందుద్వయ సమాయుక్తం శంఖరేఖాది లాంఛితమ్*
*శ్యామవర్ణ సమాయుక్తం భాగే వలయ పంచకమ్*
*కూర్మపూర్వా వరాహస్యా సర్వాభాగ్యా ప్రదోనృణామ్.*

కుడి యెడమలందు మోములు ద్వారసమీపమున చక్రము మరియు రెండు బిందువులు, శంఖరేఖలు, మరియు ప్రక్కలలో అయిదు వలయములు గలిగి నల్లనైన వరాహమూర్తి కూర్మవరాహ మనబడును. అది మానవులకు సర్వ సౌభాగ్యము లిచ్చును.

## -: ఘోణ వరాహమ్ :-

*ఘోణరూప వరాహాఖ్యా చతుర్లాంఛన సంయుతా*
*దద్యాత్ మోక్షసంసిద్ధిం బ్రహ్మచర్యేణ పూజితా*
*దీర్ఘఘోణ సమాయుక్త మేకదంష్ట్రం సుచక్రకమ్*
*వనమాలా యుతం రమ్యం వరాహం బహుభాగ్యదమ్.*

నాలుగు లాంఛనములతో (శంఖ-చక్ర-గదా-శార్ఙ్గపద్మ)గూడిన వరాహము ఘోణ వరాహ మనబడును. అది బ్రహ్మచారులు పూజింపవలెను. మోక్షము నిచ్చును.

పొడవైనముట్టె, ఒక కోర, అందమైన చక్రము మరియు వనమాల అను నాలుగు లక్షణములతో గూడినది గూడ ఘోణవరాహమే. అది పూజించువారికి మిక్కిలి భాగ్యము నిచ్చును.

### -: భూవరాహమ్ :-

*అధశ్చక్రాంకిత లసదేకదంష్ట్ర సముచ్ఛ్రితమ్*
*అంకుశా కారవదనో భూవరాహ శ్శుభప్రదః*
*దీర్ఘాస్యం శ్యామలాకారం పృథ్వీ వలయవేష్టితమ్*
*ద్వారదేశే లసచ్చక్రం వరాహం పుష్టిదం నృణామ్*
*అధోవక్త్ర మతిస్నిగ్ధం పృష్ఠోన్నత మపీతకమ్*
*దీర్ఘచక్రం బిందుయుక్తం ఉర్వీవలయ సంయుతమ్*
*వరాహం ధాన్యఫలదం సర్వై రారాధనీయకమ్.*

అడుగు భాగమున చక్రము, అంకుశమువంటి నోరు, దానిలో ఒక కోర గలది భూవరాహ మనబడును. అది శుభమిచ్చును.

పొడవైన ముట్టెయుండి నల్లనై, భూవలయముచే చుట్టబడి ద్వారదేశమున చక్రముగల వరాహము నరులకు పుష్టిని గలిగించును.

మిక్కిలి నునుపై అడుగునకు వంచినతల,ఎత్తగు వీపు,పొడవగు చక్రము, మరియు బిందువులతో భూవలయముతో గూడినది, మిక్కిలి పచ్చనగానిదగు వరాహము ధాన్యమును గలుగజేయును. ఇది అందరు పూజింపదగినది.

### -: పృథ్వీ వరాహమ్ :-

*వరాహోసౌ శక్తిలింగో చక్రేచ విషమేతథా*
*ఇంద్రనీల నిభస్థూలః త్రిరేఖా లాంఛితోభవేత్*
*పృథ్వీవరాహ నామ్నీసా యా వరాహాకృతిశ్శిలా*
*అభుగ్నా చైవరేఖైకా గతరాజ్య ప్రదాయికా*
*సుఖాసనం సుభూతాభం సూక్ష్మరంధ్రం సుచక్రకమ్*
*సుదంష్ట్రాభ్యాం సమేతంచ వరాహం ధరణీప్రదమ్.*

శక్తిగురుతు బేసిచక్రములు గలిగి ఇంద్రనీలమువంటిదై లావుగానుండి మూడురేఖలతో గూడినది పృథ్వీవరాహ మనబడును. దానిరేఖ లొక్కటిగూడ చెరగకున్న యెడల అది పూజించువారికి పోయిన రాజ్యమును మరల గలిగించును.

మంచిగద్దె, చక్కనికాంతి, సన్ననిరంధ్రము, పొంకమైన చక్రము మరియు కోరలతోగూడిన వరాహము భూమిని కలుగజేయును.

- లక్ష్మీవరాహమ్ :-

*దీర్ఘ ద్వార యుతోస్నిగ్ధో ద్వారమధ్యే ద్విచక్రయుక్*
*వనమాలా యుతో లక్ష్మీ వరాహః సంప్రకీర్తితః*
*లక్ష్మీవరాహో విజ్ఞేయో రక్తబిందు సమన్వితః*
*ఖురదంష్ట్ర సమాయుక్తః సర్వాకామ ఫలప్రదః.*

నునుపై, పొడవగు ద్వారములు, వానినడుమ చక్రములుగలిగి వనమాలతో గూడినది లక్ష్మీవరాహ మనబడును.

ఎఱ్ఱని చుక్కలు గిట్టలు మరియు కోరలతో గూడినది లక్ష్మీవరాహ మని తెలియవలెను. అది అన్నికోరికలు దీర్చును.

మానవులలో శ్రీరామునివలె మత్స్యాది మూర్తులలో వరాహము శ్రేష్ఠమని చెప్పబడును. అది నరులకు అన్నికోరికలు దీర్చును.

4. -: అథ నృసింహమూర్తి లక్షణమ్ :-

*త్రయోదశ ప్రకారాస్స్యాత్ నారసింహస్య మూర్తయః*
*తత్రాద్యా ద్వివిధా లక్ష్మీ నృసింహాఖ్యా విదారణౌ*
*నారసింహో మహాదేవః పృథుచక్రశ్చ దంష్ట్రికః*
*పూజయే ద్బ్రహ్మచర్యేణ నాన్యథా పూజనం భవేత్*
*బ్రహ్మచర్య విహీనేన నారసింహోఽర్చ్యతే యది*
*వ్యాధిపీడా భవేత్తస్య వహ్నినా దహ్యతేగృహమ్.*

నారసింహము పదమూడు విధములుగా నుండును. వానిలో మొదటిది లక్ష్మీ నృసింహము విదారణనృసింహమని రెండు విధములు.

పెద్దచక్రములు మరియు కోరలుగల లక్ష్మీనృసింహమును బ్రహ్మచర్యము చేతనేగాని వేరుగా పూజింపరాదు. బ్రహ్మచర్య విహీనులై ఒకవేళ నారసింహ మును పూజించినయెడల వారు వ్యాధిపీడితు లగుదురు. వారి యిల్లు కాలిపోవును.

-: రాక్షస నారసింహమ్ :-

*బహుఛిద్రం భిన్నచక్రం వదనే కనకాంచితమ్*
*సచ్ఛిద్రం రాక్షసంజ్ఞేయం నృసింహం గ్రహనాయకమ్.*

అనేకరంధ్రములు మరియు భిన్నచక్రములుండి మొగమున బంగారు రంగు గలది రాక్షస నృసింహమని తెలియవలెను. అది గ్రహనాయకము.

-: విభీషణ నృసింహమ్ :-

*దీర్ఘాకారం దీర్ఘచక్రం ఝుషకాస్యం బృహత్తనుమ్*
*విభీషణ మితిఖ్యాతం మహాదుఃఖ ఫలప్రదమ్.*

పొడవై, పొడవగు చక్రము మరియు మొసలిమోర గలది విభీషణ నృసింహ మనబడును. అది మిక్కిలి దుఃఖమును గలిగించును.

-: మహాజ్వాలా నృసింహమ్ :-

*స్థూలంచ వివృతాస్యంచ నీలపాదోలకం పృథు*
*మహాజ్వాలా నృసింహంతు యతిభిః పూజనీయకమ్.*

లావుగానుండి నోరుదెఱచుకొని, నల్లని పాదములు మరియు దొడ్డ ముంగురులు గలది మహాజ్వాలా నృసింహమగును. అది యతులు పూజింపదగినది.

-: సర్వతోముఖ నృసింహమ్ :-

*సప్తచక్రం బహుముఖం సమంతాత్ స్వర్ణభూషితమ్*
*సర్వతోముఖ మాఖ్యాతం బభ్రువర్ణంతు మోక్షదమ్.*

ఏడు చక్రములు పెక్కు ముఖములు గలిగి వెంట్రువరంగుననుండి బంగారముతో అలంకరింపబడినది సర్వతోముఖ మనబడును. అది మోక్షము నిచ్చును.

-: అష్టభుజ నృసింహమ్ :-

*చతుర్ద్వారోష్ట చక్రశ్చ దీర్ఘాస్యో చోన్నతాకృతిః*
*సోష్టబాహు నృసింహస్స్యా ర్యతిభిః పూజనీయకః.*

నాలుగు ద్వారములు, ఎనిమిది చక్రములు, పొడవైన నోరు, ఉన్నతమైన ఆకారము గలది అష్టభుజ నృసింహమగును. అది యతులు పూజించ దగినది.

### -: భీతి నారసింహమ్ :-

*వివృతాస్యం మధ్యచక్రం వర్తులం కనకప్రభమ్*
*నారసింహం గృహస్థానాం భీతిదం యతిపూజితమ్.*

గుండ్రనై బంగారురంగులో నుండి నోరు తెఱచుకొని దానిలో ఒక చక్రముగలది భీతినారసింహము. అది గృహస్థులు పూజించినచో భయము గలిగించును. సన్యాసులు పూజింపవచ్చును.

### -: విద్యుజ్జిహ్వ నృసింహమ్ :-

*ద్విచక్రం ద్విముఖం స్థూలం దూర్వాభో న్నతశిరః*
*దారిద్ర్య ఫలదం పుంసాం విద్యుజ్జిహ్వో నృసింహకమ్.*

లావుగానుండి, రెండు ముఖములు, రెండు చక్రములు గలిగి, గరికవన్నెలో నొప్పుచు ఎత్తగు తలగిలది విద్యుజ్జిహ్వ నృసింహ మనబడును. అది పురుషులకు దారిద్ర్యమును గలిగించును.

### -: కుక్షి నారసింహమ్ :-

*అస్పష్టచక్ర మల్పాస్య మభార స్తు మహోదరః*
*తత్కుక్షి నారసింహాఖ్యో వనవాసిభి రర్చితః.*

అస్పష్టమైన చక్రములు, చిన్న నోరు మరియు పెద్ద బొజ్జ గలిగి బరువు లేక తేలికగా నుండునది కుక్షినారసింహ మందురు. అది వనవాసులు పూజింప వలెను.

### -: విదారణ నృసింహమ్ :-

*కపిలో గ్రంథిమాలాఖ్యః రక్తబిందుభి రావృతః*
*విదారణా భిధానస్య నృసింహో దీర్ఘకేసరః.*

నల్లగానుండి, బుడిపెల వరుస, ఎఱ్ఱని చుక్కలు మరియు పొడుగువాటి జూలుగలది విదారణ నృసింహమని పిలుతురు.

:- జ్వాలా విదారణ నృసింహమ్ :-

అంతశ్చక్రో బృహద్ద్వారో దక్షిణోన్నత మస్తకః
జ్వాలా విదారణఖ్యాతో దంష్ట్రాభ్యా మభిశోభితః.

కుడివైపున ఎత్తగు తల, పెద్ద ద్వారములు వానిలో చక్రములు మరియు కోరలతో ప్రకాశించునది జ్వాలావిదారణ నృసింహమని పిలువబడును.

:- బాలనారసింహమ్ :-

సూక్ష్మరంధ్రం ద్విచక్రాఢ్యం వనమాలా విభూషితమ్
తద్బాల నారసింహాఖ్యం నృణాం సంసార నాశకృత్.

సన్నని రంధ్రములు గలిగి రెండు చక్రములతో మరియు వనమాలతో అలంకరింపబడినది బాలనారసింహ మనబడును. అది నరులకు సంసారబంధములు వదిలించును.

-: లక్ష్మీ నృసింహమ్ :-

వామపార్శ్వే స్థితేచక్రే కృష్ణవర్ణ స్సబిందుకః
లక్ష్మీ నృసింహో విఖ్యాతః సర్వాభాగ్య ప్రదోనృణామ్.

ఎడమవైపు చక్రము గలిగి నల్లని చుక్కలతో గూడినది లక్ష్మీనృసింహమని చెప్పబడును. అది నరులకు సమస్తమైన భాగ్యము లిచ్చును.

:- వీరలక్ష్మీ నృసింహమ్ :-

ద్విచక్ర స్తు బృహద్వక్త్రః కపిలః కనక ప్రభః
వీరలక్ష్మీ నృసింహాఖ్యో బ్రహ్మచారిభి రర్చితః.

నల్లనై బంగారు కాంతులు గలిగి పెద్ద నోరు మరియు రెండు చక్రములుండునది వీర లక్ష్మీనృసింహ మనబడును. అది బ్రహ్మచారులచేత పూజింపదగినది.

:- పాతాల నృసింహమ్ :-

అంతశ్చక్రం బహిర్ద్వారం బహువర్ణం బహూదరమ్
పాతాల నారసింహాఖ్యం వనవాసిభి రర్చితమ్.

అనేకమైన రంగులు మరియు ఉదరములు గలిగి వెలుపల ఒక ద్వారము, దానిలో చక్రమున్నది పాతాల నారసింహ మందురు. అది వనవాసులచే పూజింప దగినది.

-: అధోముఖ నృసింహమ్ :-

*పురః పార్శ్వేచ పృష్ఠేచ చక్రైరప్యేవ శోభితమ్*
*అధోముఖ మితిఖ్యాతం యతీనాం మోక్షదాయకమ్.*

ముందు వెనుక మరియు ప్రక్కలందు చక్రములతో నలంకరింపబడినది అధోముఖ నృసింహ మనబడును. అది యతులకు మోక్షము నిచ్చును.

-: కాపిల నారసింహమ్ :-

*స్థూలచక్ర ద్వయంమధ్యే గుంజా లాక్షాసవర్ణకమ్*
*స్ఫుటితం విషమం చక్రం నారసింహంతు కాపిలమ్*
*సంపూజ్య సిద్ధిమాప్నోతి సభాయాం విజయభవేత్.*

శిల నడిమి భాగమున రెండు పెద్ద చక్రములు గలిగి గురువెంద లేక లక్కవంటి రంగుతో గూడి స్పష్టమైన బేసి చక్రములున్నది కాపిల నారసింహ మనబడును. దానిని పూజించువారు సిద్ధిని, సభలో విజయమును పొందుదురు.

-: సుదర్శన నారసింహమ్ :-

*అష్టవక్త్రోన్నత వపుః వివృతాస్యో భయప్రదః*
*షోడశైశ్చక్రరాజాభి స్సంయుతో శత్రుమారకః*
*సుదర్శననృసింహోయం గృహేర్చాయాం వివర్జయేత్.*

ఎనిమిది ముఖములు, ఉన్నతమైన శరీరము, భయంకరమగు తెరిచిన నోరు మరియు పదునారు చక్రములతో గూడినది సుదర్శన నృసింహ మగును. అది శత్రుమారకము గాని దానిని యింటిలో పూజించుట విడువవలెను.

-: యోగానంద నృసింహమ్ :-

*నారసింహం త్రిబిందుస్యాత్ కపిలం పంచబిందుకమ్*
*యోగానంద నృసింహంతు బహుబిందు సమన్వితమ్*
*బహువర్ణ యుతశ్చాతి భోగమోక్షప్రదో నృణామ్.*

సామాన్య నారసింహము మూడు చక్కలతో, కపిల నారసింహము అయిదు చక్కలతో నుండును. ఇక యోగానంద నృసింహమైన అనేకమైన చక్కలతో మరియు రంగులతో గూడియుండి నరులకు భోగమోక్షము లిచ్చును.

## 5. -: అథ వామనమూర్తి లక్షణమ్ :-

*అతిహ్రస్వో వర్తులశ్చ వామనః పరికీర్తితః*
*తస్యప్రోక్తా స్త్రయోభేదాః వక్ష్యే మూలానుసారతః*
*ఛత్రకుండల సంయుక్తో వక్త్రే సద్బిందు పూరితః*
*హ్రస్వశ్చ వర్తులశ్చైవ, వామనః పరికీర్తితః*
*అతసీ పుష్పసంకాశో బిందునా పరిశోభితః*
*ఆస్యే చక్రద్వయోపేతః సర్వభాగ్య ప్రదోనృణామ్.*
*కృష్ణవర్ణ మతిస్నిగ్ధం స్పష్టచక్ర సమన్వితమ్*
*బిందుద్వయ యుతావాపి వనమాలా యుతంతు వా*
*హ్రస్వంచ వర్తులాకారం వామనం భువి దుర్లభమ్.*

మిక్కిలిపొట్టిదై గుండ్రముగానుండుదానిని వామనమని యందురు. దాని యందు మూడు భేదములు చెప్పబడినవి. అవి మూలానుసారముగా జెప్పెదను.

పొట్టిగా గుండ్రముగానుండి ఛత్రము మరియు కుండలములతో గూడి మొగమున చుక్కలతోనిండినది వామనమని చెప్పబడును.

అగిసెపూవన్నెతో మెరయుచు, చుక్కలతో అలంకరింపబడి, మొగమున రెండు చక్రములు గలది నరులకు సమస్త భాగ్యము లిచ్చును.

నల్లనై మిక్కిలి నునుపై స్పష్టమైన చక్రములతోగూడి, రెండు చుక్కలు గాని వనమాలగాని యుండి పొట్టిగా గుండ్రముగానున్న వామనము దొరకుట కష్టము.

*మధ్యేచక్ర మతిహ్రస్వ మతిస్నిగ్ధంచ కార్ణికమ్*
*స్పష్టాస్యం వామనంతత్స్యాత్ అర్చతా మిష్టసిద్ధిదమ్.*
*అతసీ పుష్పసంకాశం బిందునా పరిశోభితమ్*
*కుండలద్వయ సంయుక్తం వక్త్రవాన్ బిందుసంయుతమ్*

*హరిస్వంచ వర్తులంచైవ వామనంచార్థసిద్ధిదమ్.*
*ఇంద్రనీల నిభాకారం వనమాలాంబుజోజ్జ్వలమ్*
*స్పష్టచక్ర ద్వయోపేతం వామనం త్విష్టదాయకమ్.*
*చక్రస్యోభయ పార్శ్వేతు స్నుహిపుష్పా కృతిర్భవేత్*
*వామనం గృహిణాం శ్రేష్ఠో సుఖసౌభాగ్య దాయకః.*

మిక్కిలి పొట్టిదై నునుపై నల్లనై నడిపిచక్రము మరియు స్పష్టమైన మొగముగల వామనము పూజించువారికి కోరికలిచ్చును.

అగిసెపూవు రంగుగలిగి పొట్టిగా గుండ్రముగా నుండి చుక్కలతో మరియు కుండలద్వయముతో గూడిన మొగముగలది అర్థసిద్ధిని గలిగించును.

ఇంద్రనీల కాంతితో తేజోవంతమై వనమాల పద్మము మరియు స్పష్టమైన రెండు చక్రములు గల వామనము నరుల కభీష్టము లిచ్చును.

చక్రమునకు రెండువైపులలో జెముడుపూవువంటి రేఖలుగల వామనము సంసారులకు సుఖసౌభాగ్యము లిచ్చును.

**:- బాల వామనమ్ :-**

*అతసీ కుసుమప్రఖ్యం కించిదున్నత మస్తకమ్*
*కించిదస్పష్ట చక్రంచ కామదం బాలవామనమ్.*

అగిసెపూవు రంగుగలిగి కొంచెము ఎత్తగు తల మరియు కొంచెము అస్పష్ట చక్రము గలది బాలవామన మగును. అది కోరికలిచ్చును.

**:- బృహత్కుక్షి వామనమ్ :-**

*వర్తులం నీలమేఘాభం వనమాలా సమన్వితమ్*
*సూక్ష్మరంధ్రం బృహత్కుక్షిం వామనం భువి దుర్లభమ్.*

గుండ్రనై నల్లని మేఘమువంటి వన్నెతోగూడి, వనమాల, సన్నని రంధ్రము మరియు పెద్దబొజ్జ గలది బృహత్కుక్షి వామనమగును. అది భూమి యందు దొరుకుటకష్టము.

:- అభీష్ట వామనమ్ :-

వర్తులం స్నిగ్ధమత్యంతం స్పష్టచక్ర సమన్వితమ్
హ్రస్వామున్నత మశ్చైవ దీర్ఘాస్య మతిగహ్వారే
స్ఫురద్రేఖా వలయితం నాభి స్తన్యోన్యతా భవేత్
కేసరాభంతు వైతార్క్ష్యో దృశ్యతే వక్రపార్శ్వతః
అభీష్ట వామనం జ్ఞేయం సుఖసౌభాగ్య దాయకమ్.

గుండ్రనై మిక్కిలినునుపై పొట్టిగానుండి, స్పష్టమైన చక్రములతో, గుహ వంటి పొడవైననోటితో నాభిచుట్టు ప్రకాశమైన రేఖావలయములతో, చక్రముల ప్రక్కన కేసరములవంటి గరుడరేఖతో గూడినది అభీష్టవామన మనబడును. అది సుఖమును సౌభాగ్యమును యిచ్చును.

:- దధి వామనమ్ :-

హ్రస్వశ్చ వర్తులశ్చైవ బిందునా పరిశోభితః
శ్యామలం కృష్ణవర్ణశ్చ అన్యచక్ర సమావృతః
దధివామన మూర్తిస్యా ద్దుర్లభా సర్వకామదా
కృష్ణవర్ణ సమస్నిగ్ధో బిందునా పరిశోభితః
ధనుర్బాణ ధరోదేవో దధివామన సంజ్ఞికః
నిత్యం తస్మాత్ పూజితశ్చేత్ భుక్తి ముక్తి ఫలప్రదః
యో వామనాభిదో మూర్తిః శ్వేతబిందు యుతో ముఖే
దధివామన సంజ్ఞాస్యాత్ గోభూధాన్య ధనప్రదః.

పొట్టిగా గుండ్రముగా నుండి బిందువులతోగూడి చామన లేక నల్లనై మొగమున చక్రములుగలది దధివామన మనబడును. అది దుర్లభమైనది. అన్ని కోరికలిచ్చును.

నల్లనై నునుపై చుట్టుబిందువులతోగూడి ధనుర్బాణ రేఖలు గలది గూడ దధివామన మనబడును. అది నిత్యము పూజించువారికి భుక్తిముక్తు లిచ్చును.

ఏ వామనముయొక్క మొగమున తెల్లని బిందువులుండునో అదిగూడ దధివామన మనబడును. గో భూ ధన ధాన్యము లిచ్చును.

-: మహా వామనమ్ :-

శ్యామం వా కృష్ణవర్ణం వా చక్రమాస్య సమీపగమ్
మహావామన మిత్యుక్తం దుర్లభం సర్వకామదమ్.

వామనగాని నలుపుగాని కలిగి ముఖసమీపమున చక్రమున్నది మహా వామన మనబడును. అది దుర్లభమైనది. అన్ని కోరికలిచ్చును.

6. :- అథ పరశురామమూర్తి లక్షణమ్ :-

జామదగ్న్యస్తు భగవాన్ ద్వివిధః పరికీర్తితః
సిత కృష్ణారుణోపేతః దీర్ఘాకారో బృహద్బిలః
భిత్తిభాగే గతేచక్రే వామేవా దక్షిణేపి వా
చక్రభాగే భవేద్బిందుః పరశ్వాకృతిరేవ చ
పృష్ఠేవా పార్శ్వతోవాపి రేఖా దంష్ట్రాకృతిర్భవేత్
స రామో జామదగ్న్యః స్యాదర్చనీయో మహాత్మభిః.

భగవంతమైన పరశురామము రెండు విధములుగా జెప్పబడినది.

తెలుపు నలుపు ఎఱుపు రంగులతోగూడి పొడవై పెద్ద రంధ్రముండి, కుడినగాని ఎడమనగాని చక్రములు, వానిప్రక్కన చుక్కలుగాని పరశువుయొక్క ఆకారముగాని కలిగి వెన్నున లేదా ప్రక్కలకు కోరలవంటి రేఖలుగల మూర్తి జామదగ్న్యమని పిలువబడును. అది మహాత్ములకు పూజింపదగినది.

-: శాంత జామదగ్న్యము :-

కేవలం లాంఛితంపృష్ఠే పరశ్వాకృతి రేఖయా
స జామదగ్న్యో భగవాన్ శాంతాఖ్యో శాంతిదోర్చితః
భిత్తిచక్ర ద్వయోపేతః పూజనీయః ప్రయత్నతః

వెన్నున పరశులాంఛనము మరియు ప్రక్కలందు రెండు చక్రములు గల మూర్తి శాంతజామదగ్న్యమని చెప్పబడును. ఈ మూర్తి ప్రయత్నించి పూజింపదగినది.

7. :- అథ రామమూర్తి లక్షణమ్ :-

*భగవాన్ రామమూర్తిస్తు ప్రాయశో షోడశ స్తథా*

భగవంతమైన శ్రీరామమూర్తి సామాన్యముగా పదునారు విధములు.

-: రఘునాథమ్ :-

*ద్వారద్వయే శ్చతుశ్చక్రం గోష్పదేన విరాజితమ్*
*రఘునాథాభిదం జ్ఞేయం వేష్టితం వనమాలయా.*

రెండు ద్వారములు, నాలుగు చక్రములు కలిగి గోష్పాదము మరియు వనమాలతో గూడినమూర్తి రఘునాథమని చెప్పబడును.

-: దాశరథి :-

*కోదండీ కుక్కుటాండాభః శ్యామలం పృష్ఠతోన్నతః*
*సచాప సర్వతూణీరౌ పృష్ఠోనాభ్యాం విరాజితౌ*
*కల్పద్రుమ సమాయుక్తః పృష్ఠే హేమసమన్వితః*
*రామో దాశరథిజ్ఞేయో దుర్లభో భువనత్రయే.*

చామవన్నె కోడిగుడ్డువంటి ఆకారము, ఎత్తయి బంగారురంగు గలిగిన వీపు, దానిపై ధనుర్బాణరేఖలు మరియు కల్పవృక్షముగల మూర్తి దాశరథియని తెలియవలెను. అది మూడులోకములందును దుర్లభము.

-: బాలరామమ్ :-

*పృష్ఠభాగే పంచరేఖా చాపబాణౌచ పార్శ్వయోః*
*బాలరామ స్సవిజ్ఞేయః పుత్రదాయీ ధనప్రదః*

వెన్నున అయిదు రేఖలు మరియు పార్శ్వములందు చాప బాణములు గలది బాలరామమని యెరుగవలెను. అది పుత్రులను ధనమును ప్రసాదించును.

-: రామలక్ష్మణమ్ :-

*కోదండీ కుక్కుటాండాభః శ్యామలం పృష్ఠతోన్నతః*
*రేఖాద్వయ సమాయుక్తో ద్వారదేశే మునీశ్వరాః*

*ధనురాకృతికా రేఖా దృశ్యతే పార్శ్వతోథవా*
*లలాటే హేమరేఖాచ బిందునా ధనుషాయుతమ్*
*గోపాల క్షేత్రముత్పత్యా తద్వోద్యా ద్రామలక్ష్మణమ్.*
*అపుత్రో లభతేపుత్రం ధనకామో లభేద్ధనమ్.*

ఓ మునులారా ! గోపాలక్షేత్రమునబుట్టి నల్లనై కోడిగ్రుడ్డువలెనుండి ఎత్తగు వీపు, ద్వారదేశమున రెండు రేఖలు లేదా ఒకవైపున చాపరేఖ, నుదుట బంగారురేఖలు, చుక్కలు మరియు ధనువుతో గూడినది రామలక్ష్మణమని యెరుగవలెను. అది సంతానము లేనివారికి సంతానమును, ధనమును గోరువారికి ధనమును కలిగించును.

## :- కోదండ రామమ్ :-

*ధనుషాతు సుసంయుక్తో ద్విచక్రః కించిదాయతః*
*కోదండరామో విజ్ఞేయః శుద్ధ నీలాంబుదప్రదః*
*ధనుషైకేన సంయుక్తో వర్తులో కించిదాయతః*
*కోదండరామ మూర్తిస్స్యా జ్జయమోక్ష ఫలప్రదః.*

కొంచెము వెడల్పై అచ్చమైన మేఘపురంగుకలిగి ఒక ధనువు మరియు రెండు చక్రములతో గూడినది కోదండ రామమనబడును.

గుండ్రనై కొంచెము వెడల్పై ఒక ధనువుతో గూడినది కోదండరామమనబడును. అది జయమును మోక్షమును ఇచ్చును.

## :- సీతారామమ్ :-

*అదౌతు సీతారామస్తు ద్వివిధః పరికీర్తితః*
*దీర్ఘాకారః శ్యామవర్ణః శ్చక్రద్వయ సమన్వితః*
*వామభాగే త్వేకచక్రః సీతారామ స్త్రిచక్రకః*
*దీర్ఘాకారః కృష్ణవర్ణః అస్యాద్వయ సమన్వితః*
*చతుశ్చక్రై రుపేతోయం సీతారామో ధనప్రదః*
*అస్యాత్రయ సమాయుక్తః షట్చక్రై పంచభిస్తువా*
*బాణరేఖా సమాయుక్తః సీతారామ శ్శుచిప్రదః*
*ద్వారద్వయే చతుశ్చక్రో వామత శ్చైకచక్రవాన్*

*బాణతూణీర చాపాఢ్యో సీతారామ స్స్రిగన్వితః*
*సర్వసౌభాగ్య దస్సోపి సర్వత్ర విజయప్రదః.*

సీతారామము మొదట రెండు విధములుగా జెప్పబడినది. చామనచాయ గలిగి పొడవై కుడినగాని వెన్నునగాని రెండు, ఎడమవైపున ఒకటి. ఇటుల మూడు చక్రములుగలది సీతారామ మనబడును.

నల్లనై పొడవై రెండు మొగములు నాలుగు చక్రములు గల సీతారామము ధనమును గలిగించును.

మూడు మొగములు ఆరు లేక అయిదు చక్రములు మరియు బాణరేఖలతో గూడిన సీతారామము శుచిని గలిగించును.

రెండు ద్వారములు నాలుగు చక్రములు, ఎడమన మరియొక చక్రము, విల్లు, బాణములు, పొది మరియు వనమాలతో గూడిన సీతారామము అన్ని చోటులలో విజయమును గలిగించును.

## -: హృష్టరామమ్ :-

*మూర్ధ్ని మాలా ధనుర్బాణః పార్శ్వే ద్వారయుగ స్తథా*
*హృష్టరామ ఇతిఖ్యాతో భుక్తిముక్తి ఫలప్రదః.*

తలపై పూదండ, విల్లు, బాణములు మరియు ప్రక్కన రెండు ద్వారములు గలది హృష్టరామ మనబడును. అది భుక్తిని ముక్తిని యిచ్చును.

## -: వీరరామమ్ :-

*బాణతూణీర చాపాఢ్యః కుండలః స్రక్స్రమాహితః*
*సూక్ష్మకేసర చక్రాఢ్యః వీరరామ శ్రియాసహ.*

చాపము, బాణములు, తూణీరము, కుండలములు, వనమాల మరియు సన్నని కేసరములతో గూడిన చక్రమును ధరించినది వీరరామమగును. అది లక్ష్మీదేవితో గూడియుండును.

## :- రణరామమ్ :-

*మధ్యమం సప్తచక్రంచ ఛత్రభూషణ భూషితమ్*
*రణరామాభిధంజ్ఞేయం శరతూణ సమన్వితమ్.*

ఏడు నడిపి చక్రములు, గొడుగు, భూషణములు, బాణములు మరియు అమ్ములపొదితో అలంకరింపబడినది రణరామమని తెలియపలెను.

:- దశకంఠ కులాంతకమ్ :-

*సచక్రః కుక్కుటాకార శ్యామలః పృష్ఠమున్నతః*
*రేఖాద్వయ సమాయుక్తో ద్వారపార్శ్వేతు పద్మజ*
*ధనురాకృతి రేఖాచ దృశ్యతే పార్శ్వతోధవా*
*పృష్ఠతోవా భవేద్రామో దశకంఠాంతక శ్శుభః.*

నల్లనై ఎత్తగు వీపుగలిగి కుక్కుటాకారమై చక్రము గలిగి రెండు రేఖలలో గూడి ద్వారము ప్రక్కన పద్మము లేదా ప్రక్కనగాని వెన్నునగాని ధనురాకార రేఖ గల రామము దశకంఠాంతక రామమగును అది శుభమైనది.

:- విజయరామమ్ :-

*దివ్యబాణాస్త్ర సంయుక్త శ్చాపతూణీర సంయుతః*
*కరాలవదనో రక్తో బిందుశ్చక్ర సుశోభితం*
*సఃస్యా ద్విజయరామాఖ్యో కేసరోపేత చక్రకః.*

మిట్టనోరు, ఎఱ్ఱని చుక్కలు, దివ్యమైన బాణములు, అస్త్రములు, ధనువు, తూణీరములు, సామాన్య చక్రము మరియు కేసరములతో గూడిన చక్రము గల మూర్తి విజయరామ మనబడును.

-: జానకీ వల్లభమ్ :-

*కృష్ణవర్ణో ధనుఃపార్శ్వే వనమాలోపశోభితమ్*
*భానుత్రయ సమాయుక్తః స్వర్ణబిందుశ్చ మస్తకే*
*జానకీవల్లభో రామః సర్వసిద్ధి ప్రదోర్చితామ్.*

నల్లనై ఒకవైపున ధనువు, వనమాల, మూడు సూర్యరేఖలు మరియు తలపై బంగరుచుక్కలు గలది జానకీవల్లభ మనబడును. అది పూజించువారికి అన్ని సిద్ధుల నిచ్చును.

-: పట్టాభిరామమ్ :-

*రేఖాకార ధనుర్బాణః శిరశ్చక్ర సమున్నతః*
*కల్పద్రుమ సమాయుక్తో ద్వేద్వే చక్రేతు పార్శ్వయోః*
*పట్టాభిరామ ఇత్యుక్తం దుర్లభం భువనత్రయే.*
*పూర్వభాగే త్రివదనం పార్శ్వే చక్రసమన్వితమ్.*
*చాపతూణీర బాణాఢ్యం కల్పవృక్షేణ చిహ్నితమ్.*
*పట్టాభిరామ ఇత్యుక్తః రాజ్యలక్ష్మీప్రదం నృణామ్.*
*మధ్యాస్తే రామచక్రంస్యాత్ సీతాచక్రంతు వామగమ్*
*భాగే లక్ష్మణ చక్రంతు దక్షిణే పార్శ్వచక్రయోః*
*శత్రుఘ్న భరతోపేత ఆసనోపరి చాగ్రతః*
*జంబూఫల సమాకారం తూణీరద్వయ సంయుతమ్*
*ధ్వజచామర సంయుక్తం బాణబాణాసనోజ్వలమ్*
*సువర్ణ బిందుఖచితం కృష్ణ మున్నత మస్తకమ్*
*పట్టాభిషిక్తం శ్రీరామం పరివార సమన్వితమ్*
*ఆయురారోగ్య ఫలదం పుత్రపౌత్రాభివృద్ధిదమ్*
*సర్వభాగ్యప్రదం తస్మాత్ రామమూర్తిం సమర్చయేత్.*

రేఖాకారమైన ధనుర్బాణములు, తలపై ఒక చక్రము, కల్పవృక్షము, మరియు ప్రక్కలందు రెండేసి చక్రములతో గూడినది పట్టాభిరామ మనబడును. అది మూడు లోకములందును దుర్లభము.

ముందుభాగమున మూడు మొగములు, ప్రక్కలలో చక్రము, చాపము, తూణీరము, బాణములు మరియు కల్పవృక్షపు గుర్తులు గలది గూడ పట్టాభిరామ మనబడును. అది రాజ్యలక్ష్మిని కలుగజేయును.

నల్లనై నేరేడుపండువలె నుండి ఎత్తగు తల, బంగారుచుక్కలు గలిగి, నడుమ రామచక్రము, ఎడమవైపు సీతాచక్రము, కుడివైపు లక్ష్మణచక్రము, రెండువైపులలో భరతశత్రుఘ్న చక్రములు, ఆసనముపై మరియు ముందు భాగమున తూణీరద్వయము, ధ్వజము, చామరములు, ధనువు, బాణములు గలిగి—ఇటుల పరివారముతో గూడిన మూర్తి పట్టాభిరామ మనబడును. అది ఆయురారోగ్యమును, పుత్రపౌత్రాభివృద్ధిని గలిగించును గాన, సర్వసౌభాగ్య ప్రదమైన రామమూర్తి నర్చింపవలెను.

3)

-: కేవల సీతారామమ్ :-

చాప బాణాంకుశ ఛత్ర ధ్వజచామర సంయుతః
వనమాలా యుతోవాపి సీతారామ ప్రకీర్తితః
దీర్ఘాకార సమాయుక్తో హ్యాధోవక్త్రః సకుండలః
ద్వారదేశే చక్రయుక్తః కల్పవృక్షాది సంయుతః
సీతారామస్స విజ్ఞేయో భుక్తిముక్తి ఫలప్రదః
వదనే త్వేకవదన చతుశ్చక్ర సమన్వితః
చాప బాణాంకుశ చ్ఛత్ర ధ్వజచామర సంయుతః
వనమాలా సమాయుక్తః సీతారామ ఇతిస్మృతః.

చాపము, బాణము, అంకుశము, ఛత్రము, ధ్వజము, చామరము మరియు తులసీమాలతో గూడిన మూర్తి సీతారామ మనబడును.

పొడవై క్రిందికి వంగిన తల, కుండలములు, ద్వారదేశమున చక్రములు మరియు కల్పవృక్షముతో గూడినది సీతారామమని తెలియవలెను. అది భుక్తిని ముక్తిని యిచ్చును.

ఒక ముఖము, నాలుగు చక్రములు, విల్లు, బాణము, అంకుశము, గొడుగు, జెండా,చామరము మరియు తులసీమాల గల మూర్తి సీతారామమని చెప్పబడును.

:- షట్చక్ర సీతారామమ్ :-

అస్త్రశస్త్రైన ధనుషా నూపురేణచ లాంఛితః
బిలత్రయ సమాయుక్తా షట్సుదర్శన సంయుతః
శ్యామలోన్నత పృష్ఠంచ స్థూలజంబూ ఫలం యథా
సీతాబిల సమాయుక్తో దీర్ఘ జంబూ ఫలోపమః
సీతారామస్స విజ్ఞేయ స్తారకబ్రహ్మ సంజ్ఞికః
నఏవ మష్టచక్రస్తు త్రిలోకేషు చ దుర్లభః.

నల్లనై ఎత్తగు వీపుగలిగి పొడవై నేరెడుపండు వలెనుండి, మూడు బిలములు, ఆరు చక్రములు, అస్త్రములు, శస్త్రములు మరియు ధనువుగలిగి, నూపురములలో అలంకరింపబడి, సీతాబిలముతో గూడినది షట్చక్ర సీతారామమని తెలియవలెను.

అదియే ఎనిమిది చక్రములలో గూడియున్న యెడల తారకబ్రహ్మ మన బడును. అది మూడులోకములందు దుర్లభము.

## -: కవిత్వ రామమ్ :-

*ఏకచక్రంతు వదనే శ్యామవర్ణ స్సుశోభనః*
*సా రామమూర్తి ర్విజ్ఞేయః పూజకస్య కవిత్వదా.*

నల్లనై అందముగానుండి మొగమున ఒక చక్రముగలది రామమూర్తి యనబడును. అది పూజించువారికి కవిత్వము నిచ్చును.

## -: శ్రీరామపంజరమ్ :-

*తూణీరాకృతి ముత్యాభం చాపద్వయ శరాన్వితమ్.*
*నానాయుధ ధ్వజోపేతం, రేఖాచాప సమన్వితమ్.*
*శ్రీరామ పంజరంజ్ఞేయం సర్వత్ర విజయప్రదమ్.*

అమ్ముల పొదివలెనుండి ముత్తెపుకాంతిగలిగి, రెండు విల్లులు, బాణములు, వివిధమైన ఆయుధములు, జెండా మరియు చాపరేఖతో గూడినది శ్రీరామ పంజరమని తెలియవలెను. అది అంతట విజయము నిచ్చును.

## -: రామబాణమ్ :-

*కృష్ణవర్ణం సువర్ణంచ బహిర్వ్యక్తం సరంధ్రకమ్*
*చక్రహీన మపూజార్హం రామబాణం పృథక్ నృభిః.*

వెలుపల నలుపు మరియు బంగరువన్నెతోగూడి, రంధ్రముగలిగి చక్రము లేని శిల రామబాణ మనబడును. అది నరులకు పూజింపదగినదికాదు.

## -: రామతూణీరమ్ :-

*వర్తులం కృష్ణవర్ణంచ ఈషదాస్య మచక్రకమ్*
*రామతూణీర మిత్యుక్తం పూజనార్హం పృథక్ నృభిః.*

గుండ్రనై నల్లనై చక్రహీనమైన కొద్దిపాటిమోముగలది రామతూణీర మనబడును. అది మానవులకు ప్రత్యేకముగా పూజింపదగినది.

### 8. -: అథ సంకర్షణమూర్తి లక్షణమ్ :-

సంకర్షణోపి భగవాన్ త్రివిధః పరికీర్తితః
హలరేఖా ముసలవాన్ శుద్ధస్ఫటిక వర్ణవాన్
మధుబిందు ధర్మ శ్రీమాన్ నామ్నా సంకర్షణ స్మృతః
అగ్రభాగే ద్విచక్రంస్యాత్ పూర్వాభాగేతు పుష్కరమ్.
సంకర్షణస్స విజ్ఞేయో రక్తాభః సర్వసిద్ధిదంః
ద్విచక్ర మంకసంయుక్తం ఏకసంలగ్న భాసికమ్
సంకర్షణ స్సవిజ్ఞేయో రత్నాభశ్చాతిశోభనః.

భగవంతమైన సంకర్షణము మూడు విధములని యందురు. శుద్ధ స్ఫటిక వర్ణమై తేనెరంగు చుక్కలతో హలరేఖ మరియు ముసలరేఖతో గూడినది సంకర్షణమని చెప్పబడినది.

ఎఱ్ఱని కాంతిగలిగి పైభాగమున రెండు చక్రములు ముందు భాగమున పద్మరేఖలుగల మూర్తి సంకర్షణమని తెలియవలెను. అది అన్ని సిద్ధుల నిచ్చును.

రత్నకాంతిగలిగి అంకభాగమున రెండు, నుదుట ఒక చక్రము గలది సంకర్షణ మూర్తియని తెలియవలెను.

### -: బలభద్రమ్ :-

స్థూలచక్రో భవేద్యత్ర హరిలోహిత వర్ణభాక్
బలభద్రో భవేద్దేవః పుత్రపౌత్రాభివర్ధనః
ధనధాన్య ప్రదశ్చైవ గోత్రకీర్తి వివర్ధనః.

ఏది ఆకుపచ్చ మరియు ఎఱుపు రంగులతోగూడి లావైన చక్రములు గలిగి యుండునో అది బలభద్ర మూర్తియగును. అది పుత్రపౌత్ర వృద్ధిని జేయును. ధనమును, ధాన్యమును ఇచ్చును. వంశమును, కీర్తిని పెంపొందించును.

### -: బలరామమ్ :-

దీర్ఘాకారం బృహద్ద్వారం పృధువక్త్రినిం చ యద్భవేత్
శ్వేతాభం హల చిహ్నంతు ముసలాకృతి రేవవా
నీలోత్పల ప్రసూనాభం పృష్ఠేవా వదనేవివా
బలశాలీ భవేద్రామో వంశకోశ వివర్ధనంః

ద్వితీయో వామతశ్చక్రం రేఖాచైవతు దక్షిణే
బలశాలీ భవేద్రామ స్స హలాంకిత శోభనః.

ఏ శిల నల్లకలువవంటి కాంతిగలిగి పొడవై, విస్తారమైన మొగము,వీపున గాని మొగమునగాని తెల్లనిహలము లేదా ముసల చిహ్నముండునో అది బలరామ మూర్తి యనబడును. వంశకోశాభివృద్ధిని గలిగించును.

ఎడమవైపున చక్రము కుడివైపున హలరేఖలుగల మూర్తి రెండవ బలరామమగును.

-: శీరపాణి :-

సర్వతో రక్తవర్ణస్యాత్ పీత నీలాభ వర్జితః
సుచక్రోవా ఉగ్రచక్రోవా శీరపాణి శుభప్రదః.

నలుపు పసుపులయొక్క అంటులేక మొత్తము ఎఱుపై ముందుభాగమున గాని మరెచటనుగాని చక్రములు గల మూర్తి శీరపాణి యనబడును. అది మంగళకరమైనది.

-: ప్రలంబఘ్నమ్ :-

ఏకచక్ర స్తు వదనే రక్తవర్ణ స్సమన్వితః
ప్రలంబఘ్న ఇతిఖ్యాతః పూజితో మృత్యుదాయకః.

నెత్తురు రంగులోనుండి మొగమున ఒక చక్రము గలది ప్రలంబఘ్న మనబడును. అది పూజించు వారికి మృత్యువును గలిగించును.

9. -: అథ కృష్ణమూర్తి లక్షణమ్ :-

కృష్ణమూర్తి ప్రభేధాశ్చ త్రయోదశ సమీరితాః
కృష్ణ వృత్తాకృతి స్తాక్ష్యో సర్వేషాం పాపనాశనః
కృష్ణోతి కష్ణన స్థూలో నకృశో నాతిశోభనః
వనమాలా పరివృతః పృష్ఠే శ్రీవత్సలాంఛనః
స కృష్ణమూర్తి ర్విజ్ఞేయః పూజకస్యా శుభప్రదః
సమచక్రా ద్వారదేశే కృష్ణవర్ణా సుశోభనా

సా కృష్ణమూర్తిర్విజ్ఞేయా పూజితా సౌఖ్యదాయినీ
రేఖా పంచాయుధధరం వనమాలా విభూషితమ్
సూక్ష్మచక్రస్త్వ బ్జచిహ్నాం కృష్ణమేనం ప్రచక్షతే.

కృష్ణమూర్తి భేదములు పదమూడని చెప్పబడినది. నల్లనై గుండ్రమై గరుడరేఖగల కృష్ణమూర్తి ఎల్లరకు పాపనాశనమైనది. మిగుల నల్లనై, లావు గాని సన్నముగాని గాక, ప్రకాశవంతముగాక, వెన్నుపై శ్రీవత్సముగలిగి వన మాలతో గూడినది కృష్ణమూర్తి యనబడును. పూజించు వారికి శుభములిచ్చును.

నల్లనై ద్వార ప్రదేశమున సమచక్రములు గల శిల కృష్ణమూర్తి యని తెలియవలెను. పూజించువారికి సకల సౌఖ్యము లిచ్చును.

పంచాయుధరేఖలు సూక్ష్మచక్రము, కమల చిహ్నము గలిగి, వనమాలతో చుట్టబడినది గూడ కృష్ణమూర్తి యని చెప్పబడును.

-: బాలకృష్ణమ్ :-

ఉన్నతోమూర్ధ్ని కృష్ణాభో నిమ్నోధస్తాత్ త్రిబిందుయుల్
సబాలకృష్ణో విజ్ఞేయో దీర్ఘాస్యః పుత్రభాగ్యదః.

ఎత్తయిన తల, నల్లని కాంతి, పొడవైన మొగముతో నుండి అడుగు భాగమున మూడు చుక్కలు గలది బాలకృష్ణమూర్తి యనబడును. అది పుత్ర భాగ్యమును గలిగించును.

-: కృష్ణరామమ్ :-

మూర్ధ్నిమాలాధనుర్బాణం, పార్శ్వే వేత్రయుతస్తథా
కృష్ణరామ ఇతిప్రోక్తో భుక్తిముక్తి ఫలప్రదః.

తలపై వనమాల, ధనువు, బాణము, ప్రక్కన ఒక బెత్తము గల మూర్తి కృష్ణరామమని చెప్పబడును. అది భుక్తి ముక్తులిచ్చును.

-: శ్రీగోపాలమ్ :-

ఏతల్లక్షణ సంయుక్తో దీర్ఘాకారం బహూదరమ్
శ్రీ గోపాల మితిప్రాహుః సరేఖా వంశనాళకమ్.

పై లక్షణములతోగూడి పొడవై అనేకమైన ఉదరములు మరియు వంశ నాళరేఖ గలది శ్రీగోపాల మనబడును.

-: గోపాలకృష్ణమ్ :-

కృష్ణః పీతః కృశఃసూక్ష్మః ఛిత్తిపార్శ్వేతు చక్రయుక్
ద్వారతుల్యాం భవేన్నాభి ర్గదాకారంతు పృష్ఠతః
దండశృంగ యుగే పార్శ్వే వేణునా శోభితేముఖే
గోపాలకృష్ణ ఇత్యుక్తో గో భూ ధాన్య ధనప్రదః.

నలుపు పసుపు వన్నెలు గలిగి సన్నమై, ద్వారములో సమానమగు నాభి యుండి, వెన్నున ఒక గద ఒకవైపు, రెండు చక్రములు మరియొక వైపున, దండము శృంగము మరియు ముఖమున వేణువుగలది గోపాలకృష్ణ యనబడును. ఇది గో భూ ధాన్యముల గలిగించును.

-: గోపాలమూర్తి :-

శ్యామవర్ణం మహాస్నిగ్ధం చక్రాకారం తథైవచ
సూక్ష్మద్వారం బిందుమచ్చ రక్తరేఖా సమన్వితమ్
గోపాలమూర్తి ర్విజ్ఞేయః సర్వభాగ్య ప్రదోనృణామ్.

నల్లనై మిక్కిలి నునుపై చక్రాకారము మరియు సూక్ష్మద్వారము గలిగి చుక్కలు మరియు ఎఱ్ఱని చారలు గలది గోపాలమూర్తి యని తెలియవలెను. అది నరులకు భాగ్యములిచ్చును.

:- కాళీయమర్దనమ్ :-

వర్తులః కృష్ణవర్ణశ్చ మధ్యాస్యేచ ద్విచక్రయుక్
దక్షిణా ద్వామపర్యంతం రేఖాయత్ర ప్రదృశ్యతే
ఊర్ధ్వాధస్తాతు రేఖాయా బిందుద్వయ సమన్వితః
కాళీయ మర్ధనం సాక్షాత్ సర్వదారిద్ర్య నాశనః

గుండ్రనై నల్లనై, మొగము నడుమ రెండు చక్రములు, కుడి నుండి ఎడమ వరకు ఒక రేఖ, దానిపైన మరియు క్రింద రెండు చుక్కలు గల మూర్తి కాళీయమర్ధన మని చెప్పబడును. అది సమస్త దరిద్రములను పోగొట్టును.

-: గోపీవస్త్రాపహారి :-

*పృష్ఠాది మూర్ధపర్యంతం మాలా కంబునిభస్ఫుభః*
*అధస్తాచ్చ మహాన్ వృత్తః పార్శ్వే వస్త్రేణ చిహ్నితః*
*ప్రచ్ఛన్న సూక్ష్మవక్త్రస్తు వామేవా దక్షిణేపి వా*
*గోపీ వస్త్రాపహారీస్యాత్ కృష్ణః సర్వార్థ సిద్ధిదః.*

వీపు మొదలు తలవరకు మాలారేఖలుగలిగి శంఖ కాంతిలో నుండి, అడుగున పెద్ద వలయము, కుడిన గాని ఎడమన గాని రహస్యమైన సూక్ష్మ వదనము, మరియు పార్శ్వము అందు వస్త్రపు గుర్తులు గలది గోపీవస్త్రాప హారియను మూర్తియగును. అది అన్నికోరికలు సిద్ధింపజేయును.

:- మదనగోపాలమ్ :-

*యో గోపాలః పార్శ్వభాగే రేఖాయుక్తశ్చ కార్ష్ణ్యభాక్*
*సస్యాన్మదన గోపాలో మాలాకుండల శోభితః*
*పుత్రపౌత్ర ధనైశ్వర్యా ణ్యతులం సంప్రయచ్ఛతి.*

ప్రక్కలందు రేఖలు గలిగి నల్లనై మాలాకుండలములతో అలంకరింప బడినది మదన గోపాల మూర్తి యనబడును. అది పుత్ర పౌత్రులను, సాటిలేని ధనమును మరియు ఐశ్వర్యమును గలిగించును.

:- అనంత మదనగోపాలమ్ :-

*అనంతః శ్యామరక్తశ్చ శంఖచక్ర గదాధరః*
*దీర్ఘాకారః సుషిరవాన్ గోపాలో మదనాహ్వయః.*

చామన మరియు ఎఱుపు రంగులతోగూడి పొడవై రంధ్రము గలిగి, శంఖ చక్ర గదాయుతమైనమూర్తి అనంతమదనగోపాల మనబడును.

-: గోవర్ధనమూర్తి :-

*గోపాలో మస్తకేనిమ్నే రాజతే బిందు వర్ణ్యయుక్*
*గోవర్ధనాఖ్యో గోపాలో దీర్ఘరేఖాస్తు దక్షిణే*
*సర్వావర్ధన మూర్తిస్స్యాత్ గోధాన్య ధనవర్ధనః.*

గోపాలమూర్తికి తలపై మరియు అడుగున చుక్కలుండినయెడల గోవర్ధన గోపాల మనబడును. దానికే కుడివైపున పొడవైన రేఖలు గలిగినయెడల సర్వవర్ధన మూర్తి యగును. ఇవి గోవులను ధనధాన్యములను పెంపొందించును.

-: చాణూరమర్దనమూర్తి :-

*కుక్కుటాండ సమాకారః శ్రీకరో వనమాలయా*
*లాంగలే వేణుచిహ్నంచ కుండలాఖ్యాంచ వేష్టితః*
*రక్తబిందు యుతోజ్ఞేయం శ్యామో దంతిభుజోపమః*
*రేఖాస్యా ద్దక్షిణేవామే ముఖేపి దృథబిందుయుక్*
*చాణూరమర్దనాఖ్యస్స్యాత్ సర్వశత్రువినాశనః.*

కోడిగ్రుడ్డంత యుండి ఏనుగుమూపు వంటిదై నల్లనై తులసీమాల, నాగలి, వేణువు, మరియు కుండలములలో గూడి, కుడి యెడమలందు రేఖలు మరియు మొగమున చుక్కలు గలది చాణూరమర్దనమూర్తియని చెప్పనగును. అది సర్వశత్రు నాశకరమైనది.

-: కంసమర్దనమూర్తి :-

*పూర్వభాగే సువదన శ్చక్రద్వయ యుత స్తదా*
*పార్శ్వేచ సూక్ష్మవదనో వర్తులః సూక్ష్మచక్రవాన్*
*కంసమర్దీ భవేత్ కృష్ణో నీలాంబుద నిభచ్ఛవిః.*

నీలమేఘపు వన్నె గలిగి ముందువైపు చక్కని మొగము రెండు చక్రములు, ప్రక్కలకు సన్ననిమూతి మరియు గుండ్రని సన్నని చక్రములుండునది కంసమర్దన మూర్తియగును. అది శుభమైనది.

-: లక్ష్మీగోపాలమ్ :-

*సువృత్తం కృష్ణవర్ణంచ, స్వర్ణపద్మం సచక్రకమ్*
*జ్ఞేయస్స్యాత్ లక్ష్మీగోపాలో దుర్లభో భువనత్రయే*
*పుత్రలాభం తథామోక్షం గోధాన్య ధనదో నృణామ్.*

చక్కని వర్తులపదనము గలిగి నల్లనై బంగారు తామర మరియు చక్రముతోగూడినది లక్ష్మీగోపాలమని ఎరుగవలెను. ఇది ముల్లోకములలో దుర్లభము.

పూజించువారికి పుత్ర లాభము, గో ధన ధాన్యములు మరియు మోక్షమును గలిగించును.

-: శమంతక హరిమూర్తి :-

అతసీవర్ణవాన్ స్థూల శ్చక్రభాగేతి శోభనః
వనమాలా పరివృతః పృష్ఠే శ్రీవత్సలాంఛనః
శమంత హరివిజ్ఞేయః పుష్టిః శ్రీ కీర్తిదోన్నృణామ్.

అగిసెపూవు వన్నెగలిగి లావుగానుండి, చక్రభాగము ప్రకాశమానమై వనమాలతో చుట్టబడి వెన్నున శ్రీవత్సము గలది శమంతకహరి యని తెలియవలెను. అది పుష్టిని, సంపదను, కీర్తిని యిచ్చును.

-: సంతానగోపాలమ్ :-

దీర్ఘాకారః కృష్ణవర్ణ శ్చార్ధచంద్ర నిభాననః
సస్యాత్ సంతాన గోపాలః పుత్రపౌత్రాభివృద్ధిదః.

పొడవై, నల్లనై, అర్ధచంద్రుని వంటి మొగము గలిగిన మూర్తి సంతాన గోపాలమగును. అది పుత్రపౌత్రాభివృద్ధిని గలిగించును.

-: అథ బుద్ధమూర్తి లక్షణమ్ :-

అంతర్గహ్వార సంయుక్త శ్చక్రహీనో యథాభవేత్
నిర్వాణ బుద్ధసంజ్ఞస్యాత్ దదాతి పరమంపదమ్.

లోపల పెద్ద గుహతోగూడి చక్రహీనమై యున్నయెడల అది నిర్వాణ బుద్ధమూర్తి యనబడును. అర్చించువారికి పరమపద మిచ్చును.

-: అథ కల్కిమూర్తి లక్షణమ్ :-

ద్వివిధా కల్కిమూర్తిస్యాత్ కలిదోష నివారకః
ఇంద్రనీల నిభోదీర్ఘో వనమాలా విభూషితః
అంకుశాకారవదనోఽభీష్టదః కలివిగ్రహః
అతిరిక్తం సూక్ష్మబిలం స్పష్టచక్ర స్థిరాసనమ్
కృపాణాకృతి రేఖాస్యాత్ ద్వారస్యో పరిపృష్ఠకే
మ్లేచ్ఛనాశో భవేత్ కల్కిః కలికల్మష నాశకః.

కలిదోషములను బోగొట్టు కల్కి రెండు విధములుగా నున్నది. ఇంద్ర నీల సమమై పొడవై అంకుశము వంటి మొగము మరియు వనమాలతో గూడినది కలివిగ్రహ మనబడును. అది కోరిక లిచ్చును.

మిక్కిలి ఎఱుపై, సన్నని రంధ్రము, స్పష్టమైన చక్రము, స్థిరమైన ఆసనము గలిగి ద్వారముపై మరియు వెన్నున కత్తివంటి రేఖ యుండినయెడల అది మ్లేచ్ఛనాశన కల్కి యనబడును. కలి దోషములను నివారించును.

-: అథ కేశవాదిభేదాః :-

మూర్తయః కేశవాద్యాః కథయస్వ మహామునే
ప్రవక్ష్యామిచ తన్మూర్తీః శ్రూయతాంచ మహర్షయః.
ఓ మహామునీ! కేశవాది మూర్తులను గుఱించి చెప్పుడు.
ఓ మహర్షులారా ! ఆ మూర్తులను గుఱించి చెప్పెదను వినుడు.

1. -: కేశవమూర్తి లక్షణమ్ :-

రాజతే బిందుభిర్హేమై రన్వితం సూక్ష్మ చక్రకమ్
వనమాలాన్వితం శ్యామం కేశవాఖ్యం ద్విచక్రకమ్
సౌభాగ్యం కేశవోదద్యాత్ చతుష్కోణః సదాభవేత్
ద్వారదేశే ద్విచక్రంచ కృష్ణవర్ణో ఫలప్రదః.

చామనగానుండి బంగారుచుక్కలు, సన్నని చక్రము, వనమాల మరియు రెండు పెద్దచక్రములలో గూడినది కేశవ మనబడును.

నల్లనై నాలుగు మూలలుండి ద్వారమున రెండు చక్రములున్నదిగూడ కేశవ మనబడును. అది యెల్లపుడు సంపద లిచ్చును.

2. -: నారాయణమూర్తి లక్షణమ్ :-

నారాయణోపి భగవాన్ లక్ష్యతేత్ర చతుర్విధః
శ్యామో నారాయణోదేవో నాభిచక్ర యుత స్తథా
దీర్ఘరేఖా త్రయోపేతో దక్షిణే సుషిరంపృథు
ఉన్నత శ్శంఖకోపేతో ఏకచక్ర స్సవర్తులః
సర్వాభీష్ట ప్రదోన్నృణాం విశేషాత్పతి భాగ్యతః.

భగవంతమైన నారాయణమూర్తి యిచట నాలుగు విధములుగా గనిపించును.

చామనయై ఉన్నతమై నాభిచక్రము, మూడు రేఖలు, రక్షిణమున పెద్ద రంధ్రము అంకుశము మరియు గుండ్రని ఒక చక్రముతో గూడిన నారాయణము నరులకు సర్వాభీష్టములను మరియు విశేష సంపదను యిచ్చును.

## -: లక్ష్మీనారాయణమ్ :-

*లక్ష్మీనారాయణః సాక్షాత్ చతుశ్చక్రయుతోపరః*
*త్రిచక్రశ్చ ద్విచక్రశ్చ ఏకచక్రశ్చ శోభనః*
*యత్రశంఖ గదాపద్మ రేఖాకృతి విరాజతే*
*చతుశ్చక్ర యుతోవాపి త్రిచక్రశ్చైక చక్రవాన్*
*లక్ష్మీనారాయణో నృణాం సర్వాభీష్ట ఫలప్రదః.*
*ఏకవక్త్రో ద్వివక్త్రోవా వర్తులః శ్యామవర్ణకః*
*నాతిస్థూలో నాతిహ్రస్వో లక్ష్మీనారాయణస్మృతః*
*తస్యదర్శన మాత్రేణ చింతితం లభతేధృవమ్.*

ఏ శిల నాలుగు, మూడు, రెండు లేదా ఒక చక్రము గలిగి, శంఖ గదా పద్మ రేఖలతో ప్రకాశించునో అది లక్ష్మీనారాయణ మనబడును.

నాలుగు మూడు లేదా ఒక చక్రము గల లక్ష్మీనారాయణము నరులకు సర్వాభీష్టము లిచ్చును.

ఒకటి లేదా రెండు మోములు గలిగి గుండ్రనై, చామనచాయ గలది అంతగా లావుగాని సన్నముగాని కానిది లక్ష్మీనారాయణ మనబడును. అది దర్శించిన మాత్రముననే మనసునగల కోరికలు దీరును.

*జంబూఫల సమాకారం చిత్రం కనకబిందుభిః*
*చతుశ్చక్ర యుతందేవం లక్ష్మీనారాయణం విదుః*
*అర్చితాం సర్వదాపుంసాం సర్వకామ ఫలప్రదమ్*
*రేఖాత్రయ యుతం పార్శ్వే పృష్ఠే పద్మేన లాంఛితమ్*
*ధ్వజవజ్ర గదోపేతం చతుశ్చక్ర సమన్వితమ్*

లక్ష్మీనారాయణం ప్రాహుః సర్వాభీష్ట ఫలప్రదమ్
అధశ్చోర్ధ్వం పార్శ్వయోశ్చ చక్రైశ్చతుర్భి రన్వితః
చతుర్భి మధ్యే సుషిరో లక్ష్మీనారాయణ స్మృతః
సర్వ సంపత్ప్రదశ్చైవ పూజకస్య సుసిద్ధిదః
ద్వారద్వయోశ్చ తు శ్చక్రం పార్శ్వే చందన పుష్పవత్
లక్ష్మీనారాయణం ప్రాహుః భుక్తిముక్తి ఫలప్రదమ్.

నేరెడుపండువలె నుండి చిత్రవర్ణమై బంగారు చుక్కలు మరియు నాలుగు చక్రములు గలది లక్ష్మీనారాయణ మనబడును. పూజించు పురుషులకది అన్ని కోరిక లిచ్చును.

ప్రక్కన మూడు రేఖలు, వీపున పద్మము ధ్వజము వజ్రము మరియు గదయొక్క గుర్తులు గలిగి నాలుగు చక్రములతో గూడినది లక్ష్మీనారాయణ మనబడును. ఇదిగూడ అన్ని కోరిక లిచ్చును.

క్రింద మీద మరియు రెండుప్రక్కలతో నాలుగు చక్రములతో గూడి నడిమిభాగమున రంధ్రము గల మూర్తి లక్ష్మీనారాయణమని తలతురు. అది సర్వ సంపద లిచ్చును.

రెండు ద్వారములు నాలుగు చక్రములు గలిగి, ఇరువైపులలో మల్లెపూవు గుర్తులుండునది లక్ష్మీనారాయణ మనబడును. అది భుక్తిముక్తి నిచ్చును.

### -: ద్విచక్ర లక్ష్మీనారాయణమ్ :-

వర్తులం దక్షిణేపార్శ్వే చక్రద్వయ యుతం బృహత్
ధ్వజరేఖా సమాయుక్త నీలగోఖుర సంయుతమ్
ద్విచక్ర లక్ష్మీసంయుక్తో నారాయణ ఇతీరితః
తత్పూజా భక్తియుక్తానాం సర్వాభీష్టం ప్రజాయతే
చతుశ్చక్రోతి గంభీరం దక్షిణే సుషిరంపృథు
వనమాలా దరోపేతం గోఖురేణచ చిహ్నితమ్
లక్ష్మీనారాయణం ఖ్యాత ద్విచక్రం వితతాననమ్
నవదూర్వా దళశ్యామం వనమాలా విభూషితమ్
శ్రీవత్స శంఖచక్రాది పంచాయుధ లసత్తనుమ్

తథా చక్రద్వయోపేతం పంకజద్వయ శోభితమ్
లక్ష్మీనారాయణం ప్రాహుః దుర్లభం శ్రీప్రసిద్ధిదమ్
ఏతల్లక్షణ సంయుక్తో నాగభోగేన వేష్టితః
పృష్ఠే రేఖాద్వయోపేతః పద్మరేఖా సమన్వితః
ద్విచక్రాంకిత వక్త్రస్తు చతుశ్చక్రాంకితోపి వా
లక్ష్మీనారాయణో దేవః సర్వాభీష్ట ఫలప్రదః.

గుండ్రనై నలుపై దక్షిణ భాగమున రెండు పెద్ద చక్రములు ధ్వజరేఖ మరియు గోఖురముతో గూడినది ద్విచక్ర లక్ష్మీనారాయణ మనబడును. భక్తితో పూజించు వారికది సకలాభీష్టము లిచ్చును.

నాలుగు చక్రములు, కుడివైపున గంభీరమైన పెద్ద రంధ్రము, తులసీ మాల, శంఖము, గోష్పాదముతోగూడి విశాలమైన ముఖము మరియు రెండు చక్రములు గలది లక్ష్మీనారాయణ మనబడును.

క్రొత్త గరికవన్నెగలిగి తులసీమాల, శ్రీవత్సము, మరియు పంచాయుధ ములచే నలంకరింపబడి శరీరముపై రెండు చక్రములు రెండు పద్మములు గలది గూడ లక్ష్మీనారాయణమని చెప్పుదురు. ఇది లక్ష్మీప్రదము కాని లభించుట దుర్లభము.

ఇదే లక్షణములతో గూడి నాగేంద్రునిచే చుట్టబడి వీపున రెండు రేఖలు, మరియు పద్మము, మోమున రెండు లేదా నాలుగు చక్రములు గలది లక్ష్మీ నారాయణ మగును. అది సర్వాభీష్ట ప్రదము.

శృంగాకృతి స్తథారేఖా దృశ్యతే మధ్యదేశతః
ద్వే చక్రే పార్శ్వయుగలే వామేచక్రే చతుష్టయమ్
లక్ష్మీనారాయణం దేవం ప్రాహురిష్టప్రదం నృణామ్
అథశ్చోర్ధ్వం పార్శ్వయోశ్చ ద్వేద్వేచక్రే భవేద్యది
లక్ష్మీనారాయణో దేవః సర్వాభీష్ట ఫలప్రదః
మునలాని ధనుర్మాలా శంఖచక్ర సమన్వితమ్
ముఖేవా నాభిదేశేవా చక్రద్వయ సమన్వితమ్
లక్ష్మీనారాయణం దేవ మభీష్ట ఫలదం విదుః

*లక్ష్మీనారాయణోదేవ శ్చతుర్భి ర్వాదనైర్యుతః*
*యత్ర తిష్ఠతి తత్ క్షేత్రం సర్వాభాగ్యా యుతంభవేత్.*

సాలగ్రామము నడుమ శృంగమువంటి రేఖ గలిగి దానికి రెండు పార్శ్వము లందు రెండు (పెద్ద) చక్రములు ఎడమ వైపున మరల నాలుగు చక్రములున్న యెడల అది లక్ష్మీనారాయణ మనబడును. నరులకు కోరిక లిచ్చును.

క్రింది వైపున, మీద వైపున మరియు రెండు ప్రక్కలందు రెండేసి చక్రములున్న యెడల దానిని లక్ష్మీనారాయణ మందురు. అది పూజించువారికి సర్వాభీష్టము లిచ్చును.

శరీరముపై ముసల, ఖడ్గ, ధను, వనమాల, శంఖ, చక్రముల గుర్తులు గలిగి ముఖమున గాని నాభియందు గాని రెండు చక్రము లుండునది లక్ష్మీ నారాయణ మనబడును. అది సర్వకామము లిచ్చును.

నాలుగు మొగములు గల లక్ష్మీనారాయణ మెచట నుండునో ఆ క్షేత్రము సర్వ సౌభాగ్యములతో గూడినదగును.

## -: శ్రీమన్నారాయణమ్ :-

*ద్వేచక్రే వ్యాధశోర్ధ్వా లక్ష్మీనారాయణో భవేత్*
*ద్వేచక్రే పార్శ్వయోశ్చ శ్రీమన్నారాయణో భవేత్.*

క్రింద మీద రెండు చక్రము లున్నశిల లక్ష్మీనారాయణము, ప్రక్కలకు రెండేసి చక్రములున్న శిల శ్రీమన్నారాయణ మగును.

## -: వీర నారాయణమ్ :-

*తమాల దళసంకాశ స్వర్ణ పంక విలేపవాన్*
*వీర నారాయణోదేవ శ్చైకవక్త్ర సమన్వితః.*

చీకటి చెట్టు (కానుగ) ఆకు వన్నెలో నుండి బంగారు పూత పూయబడి ఒకే ముఖము గలది వీర నారాయణ మనబడును.

## -: రూప నారాయణమ్ :-

*ముసలాయుధ మాలాసి శంఖచక్ర గదాన్వితః*
*రూప నారాయణో దేవో ముఖేనాభి ముఖం ధనః*
*సర్వసిద్ధి కరోదేవ స్సర్వకామ ఫలప్రదః.*

ముసలము, వనమాల, ఖడ్గము, శంఖ చక్రములు, మరియు మొగమున కభిముఖముగా ధనువు గుర్తులు గల మూర్తి రూపనారాయణ మనబడును. అది సమస్తమైన కోరిక లిచ్చును.

-: మాయా నారాయణమ్ :-

మూర్ధ్ని మధ్యా స్తనముఖో ద్వారదేశే ద్విచక్రవాన్
తాటంక నాసాభరణో రేఖాకేయూర లాంఛితః
మాయా నారాయణోదేవ స్సర్వాసిద్ధి ప్రదాయకః.

తలనడుమ స్తనాకార ముఖము, ద్వారమునడుమ రెండు చక్రములు, తాటంకములు, నాసాభరణము మరియు కేయూరములతో గూడినది మాయా నారాయణ యనబడును. అది సర్వసిద్ధి ప్రదాయకము.

3. -: మాధవమూర్తి లక్షణమ్ :-

మధువర్ణో మధ్యచక్రో స్నిగ్ధః సూక్ష్మముఖ స్తు వా
మాధవశ్చేతి విజ్ఞేయో యతీనాం మోక్షదాయకః.

తేనెరంగు గలిగి నడిపి చక్రము మరియు సన్ననైన మొగముగల మూర్తి మాధవ మనబడును. ఇది యతులకు మోక్షమిచ్చును.

4. :- గోవిందమూర్తి లక్షణమ్ :-

నాతిస్థూలః కృష్ణవర్ణో గోవిందః పంచవక్త్రకః
ద్విచక్రయుక్చ సర్వత్ర సర్వాభీష్ట ప్రదోచ్యతః.

నల్లనై మిక్కిలి లావుగాక అయిదు మోములు, రెండు చక్రములు గల మూర్తి గోవింద మనబడును. అది సర్వాభీష్టము లిచ్చును.

5. -: విష్ణుమూర్తి లక్షణమ్ :-

వామచక్రో బృహద్ద్వారో ఉన్నతో నిమ్నమస్తకః
నకావిల స్నిగ్ధవర్ణో విష్ణుర్విషయ భోగకృత్
విష్ణుక్రాంత నిభాకారో వనమాలా సులాంఛితః
పంచాయుధ సమాయుక్తో విష్ణురిత్యుచ్యతే బుధైః
విష్ణుస్తథా కృష్ణవర్ణః స్థూలచక్రశ్చ వర్తులః

*గదాకారాతు రేఖాచ లక్ష్యతే మధ్యదేశతః*
*చక్రద్వయ యుతానృణాం బహుభాగ్య ప్రదోర్చితామ్.*

ఎడమవైపొక చక్రము మరియు పెద్ద ద్వారము గలిగి చిక్కని కపిల వర్ణములో నుండి ఎగుడు దిగుడు తలగలది విష్ణుమూర్తి యనబడును. అది విజయమును సంపదను యిచ్చును.

విష్ణుకాంతి పూవన్నెగలిగి వనమాల మరియు పంచాయుధములతో గూడిన శిలను పండితులు విష్ణుమూర్తి యందురు.

నల్లనై గుండ్రనై పెద్ద చక్రము మరియు శిలనడుమ గదాకార రేఖయు రెండు చక్రములును గలదానిని విష్ణుమూర్తియని చెప్పుదురు. అది అర్చకులకు బహుభాగ్యము గలిగించును.

### 6. -: మధుసూదన మూర్తి లక్షణమ్ :-

*మధుసూదన స్తదాదేవః ఏకచక్రో మహాద్యుతిః*
*సర్వవర్ణ సమాయుక్తో మహాభాగ్య ప్రదోనృణామ్.*

అన్నిరంగులు కలిసి మిక్కిలి కాంతిగా నుండి ఒక చక్రము గల మూర్తి మధుసూదన మనబడును. అది మానవులకు మహాభాగ్యమును గలిగించును.

### 7. -: త్రివిక్రమ మూర్తి లక్షణమ్ :-

*త్రివిక్రమ త్రికోణస్యా చ్చక్రద్వయ విభూషితః*
*శిష్టై ర్ద్విజైశ్చ సంపూజ్యో శ్చేతర స్తు నపూజ్యతే*
*త్రివిక్రమ స్తదాదేవః శ్యామవర్ణః ప్రకీర్తితః*
*వామభాగే గతేచకేని రేఖాచక్రేతు దక్షిణే*
*త్రికోణాఢ్య స్త్రిచక్రశ్చ ధనం పూర్ణం ప్రయచ్ఛతి*
*కుక్కుటాండ నిభాకార మూర్ధ్వంచక్రం సుదర్శనమ్*
*ద్వేచక్రే త్వేకభాగేతు పుష్కరంతు త్రివిక్రమః*
*భక్త్యా పూజయితాం పుంసాం ధనధాన్య వివర్ధనమ్.*

త్రివిక్రమము మూడు పలకలై రెండు చక్రములచే ప్రకాశించుచుండును. అది శిష్టులైన బ్రాహ్మణులే గాని యితరులు పూజించరాదు.

నల్లనై ముక్కోణమై ఎడమవైపున ఒక చక్రము, కుడివైపున ఒక రేఖ గలిగి మూడు చక్రము లున్నమూర్తి పరిపూర్ణ ధనము నిచ్చును.

కోడిగ్రుడ్డువలె నుండి పైభాగమ్మున ఒక సుదర్శనము ఒకవైపున, రెండు చక్రములు మరియు పద్మము గల మూర్తి త్రివిక్రమ మనబడును. అది భక్తితో పూజించువారికి ధనధాన్యాభివృద్ధిని కలిగించును.

### 8. -: వామనాదయః :-

వామనో నరసింహశ్చ కృష్ణశ్చేతి త్రయఃపురా
ఉక్తద్వారాఽత్ర నోచ్యంతే ప్రభేధైశ్చ నలక్షణైః.

వామన నృసింహ కృష్ణమూర్తి యను మూడు. భేదము లింతవరకే (అవతారములలో) అవాంతర భేదములతోగూడ జెప్పబడినవి కనుక అవి యిపుడిచట జెప్పను.

### 9. -: శ్రీధరమూర్తి లక్షణమ్ :-

శ్రీధరః పంచధో జ్ఞేయః పూజకస్య శుభప్రదః
శ్రీధరస్తు తదాదేవ శ్చిహ్నితో వనమాలయా
కదంబ కుసుమాకారో రేఖా పంచాయుధాన్వితః
ముఖేవా మధ్యదేశేవా పంకజేన సమన్వితః
సూక్ష్మాననః శ్యామలశ్చ సతువై శ్రీధరఃస్మృతః
నవశాద్వల సంకాశో వనమాలా విభూషితః
ఆస్యద్వయే ద్విచక్రాఢ్యః శ్రీధరః పరికీర్తితః
పురః చక్రద్వయం యస్య పార్శ్వే చక్రద్వయం తథా
ముఖే చక్రద్వయం చైవ శ్రీధరః పరికీర్తితః
శ్రీధరో వర్తులశ్చైవ అస్యత్రయ సమన్వితః
చక్రద్వయ సమాయుక్తః సర్వభాగ్య ప్రదోర్చితామ్
నిమ్నోదరః శిరః పార్శ్వే నిమ్నవృత్తం సువర్తులమ్
నిమ్నచక్ర మతిహ్రస్వం శ్రీధరః సర్వసిద్ధిదః

బిందుద్వాయశ్చ హ్రస్వాశ్చ శ్రీధరో వనమాలయా
సూక్ష్మం ద్విచక్ర సంయుక్తం శ్రీప్రదం గృహిణాం సదా.

శ్రీధరము అయిదు విధములని తెలియవలెను అది అర్చకులకు శుభమైనది.

కడిమి పూవువలెనుండి వనమాల మరియు పంచాయుధములతో గూడిన మూర్తి శ్రీధర మనబడును.

చామనయై సన్నని మొగము గలిగి ఆ మొగమునగాని లేక శిలనడుమ గాని పద్మరేఖగలది శ్రీధరమని చెప్పబడును.

క్రొత్త గరిక వన్నెగలిగి, వనమాల మరియు రెండు ముఖములు వానిలో చక్రములు గలది శ్రీధర మనబడును.

ముందు భాగమున, మొగమున మరియు ప్రక్కలందు రెండేసి చక్రములు గల మూర్తి శ్రీధరమని చెప్పబడును.

గుండ్రనై మూడు మొగములు మరియు రెండు చక్రములు గల మూర్తి గూడ శ్రీధర మనబడును. అది అర్చించువారికి సకల సంపద లిచ్చును.

గుంత కడుపు, తల ప్రక్కన గుంతయై గుండ్రనైన సుదె, గుంతయందు చిన్న చక్రముగల మూర్తి శ్రీధర మగును. అది అన్ని సిద్ధులిచ్చును.

రెండు సన్నని చుక్కలు, వనమాల మరియు రెండు చిన్న చక్రములతో గూడిన శ్రీధరము గృహస్థుల కెల్లప్పుడు శ్రీప్రదమైనది.

## 10. :- హృషీకేశ మూర్తి లక్షణమ్ :-

కదంబ కుసుమాకారో రేఖాపంచక సంయుతః
అర్ధచంద్రా కృతిర్దేవః పంచచక్ర సమన్వితః
త్రిచక్రం చైకచక్రోవా హృషీకేశ ఉదీరితః
క్రమం విషయచక్రాఢ్యా మింద్రనీల సమప్రభమ్
హృషీకేశ మిమంప్రాహుః శుద్ధజ్ఞాన ప్రదాయకమ్
పంచవక్త్రి సమాయుక్తం దశచక్ర సమన్వితమ్
శ్యామలం కోమలాకారం హృషీకేశం ప్రచక్షతే.

కడిమి పూవెన్నెగలిగి అర్ధచంద్రాకారమై అయిదు రేఖలు, అయిదు చక్రములతో గూడిగాని లేక ఒకటిగాని, మూడుగాని చక్రములుగలది హృషీకేశ మనబడును.

ఇంద్రనీలపు కాంతి గలిగి క్రమముగా బేసి చక్రములు గల మూర్తి హృషీకేశమని చెప్పబడును. ఇది శుద్ధ జ్ఞానప్రదాయకమైనది.

చామనయై కోమలమై అయిదు మొగములు, పది చక్రములుగలది హృషీకేశమని చెప్పబడును.

## 11. :- పద్మనాభ మూర్తి లక్షణమ్ :-

*నిష్కేసరోర్ధ్వే చక్రశ్చ అధశ్చక్రస్య కేసరః*
*పద్మనాభ ఇతిఖ్యాలో విపరీతో హలాయుధః.*

కేసరరహితమైన ఊర్ధ్వ చక్రము, కేసరసహితమైన అధోచక్రము గలిగి హలమును విపరీతముగా (తిరుగల లేక తలక్రిందుగా) ధరించిన మూర్తి పద్మనాభ మనబడును.

## 12. -: దామోదరమూర్తి లక్షణమ్ :-

*దామోదరస్తు విజ్ఞేయో త్రివిధా భిన్నలక్షణః*
*నాభిచక్ర లసన్మూర్తి జంబూఫల సమప్రభః*
*దామోదర ఇతిఖ్యాతో భుక్తిముక్తి ఫలప్రదః*
*దూర్వాభో ద్వారసంకీర్ణో దీర్ఘరేఖా యుతశ్శుభః*
*వనమాలా లసత్కంఠో దామోదర ఇతిస్మృతః*
*దామోదరస్య విజ్ఞేయో యచ్చక్ర ద్వయలాంఛితః*
*సూక్ష్మం భవేచ్చావయవం పూజితః సుఖదస్సదా*
*న కాపిలంవా కార్ ష్ణ్యంవా నృణాం శుభఫలప్రదమ్*
*చక్రద్వయ సమాయుక్తో మధ్యే దామ శుభ ప్రదః.*

దామోదరము మూడు విధములని వేరు వేరు లక్షణములనుబట్టి తెలియవలెను.

నేరెడు పండు వంటి ఆకారము మరియు నాభి యందు చక్రము గల మూర్తి దామోదర మనబడును. అది భుక్తిని ముక్తిని యిచ్చును.

గరికవన్నె గలిగి ద్వారము సంకీర్ణమై దీర్ఘమైన రేఖ మరియు వనమాలతో అలంకరింపబడిన కంఠముగల మూర్తి దామోదరమని చెప్పబడును.

రెండు చక్రములతో గూడి సన్నమైన శరీరముగలది మరియొక దామోదరమని యెరుగవలెను. అది పూజించువారికి సుఖమిచ్చును.

రెండు చక్రములు గలిగి శిల నడిమి భాగమున వనమాలయుండి కపిల వన్నెగాని లేక నలుపుగాని యున్న మూర్తి నరులకు శుభఫల మిచ్చును.

## :- స్థూల దామోదరమ్ :-

దామోదర స్తథాస్థూలో మధ్యేచక్రం ప్రతిష్ఠితమ్
స్థూలం దామోదరంజ్ఞేయం సూక్ష్మరంధ్రం సచక్రకమ్.

లావుగా నుండి శిల నడుమ ఒక చక్రము మరియు చక్రముతో గూడిన ఒక సూక్ష్మరంధ్రము గలది స్థూలదామోదరమని తెలియవలెను.

## -: రాధా దామోదరమ్ :-

రాధా దామోదరోజ్ఞేయా ఊర్ధ్వాధశ్చక్ర వద్బిలమ్
నాతిదీర్ఘ ముఖం మధ్యే లంబరేఖా సభోగదః.

పైన మరియు క్రింద చక్రము వంటి బిలములు, మొగము నడుమ చిన్న లంబరేఖ గలది రాధా దామోదర మనబడును. అది భోగము లిచ్చును.

## 13. -: వాసుదేవమూర్తి లక్షణమ్ :-

జంబూఫల సమాకారం హ్రస్వాంచ పరివర్తులమ్
ద్వారదేశే సమేచక్రే దృశ్యేతే నాంతరీయతే
లలాటే శ్వేతరేఖాచ వాసుదేవస్య లక్షణమ్
ద్వారదేశే సమేచక్రే దృశ్యేతే నాంతరీయతే
వాసుదేవస్స విజ్ఞేయః సుక్లాభ శ్శాతిశోభనః.

నేరెడు పండువలె నుండి గుండ్రమై కురుచయై ద్వారము నడుమ యెడము లేని రెండు చక్రములు మరియు నుదుట రెండు తెల్లని రేఖలు గలిగియుండుట వాసుదేవ మూర్తియొక్క లక్షణము.

తెల్లనై ద్వార దేశమున ఎడములేని రెండు సమచక్రములు గలది వాసుదేవమని తెలియవలెను. ఇది మిక్కిలి సుందరమైనది.

### :- శాంత వాసుదేవమ్ :-

*రేఖా పంచాయుధ ధరో హిమాంశు సదృశ ప్రభః*
*నాభిచక్ర ధరశ్శాంతో వాసుదేవ ఇతీరితః.*

చంద్రునివంటి వన్నెగలిగి పంచాయుధ రేఖలు మరియు నాభియందు చక్రముగల మూర్తి శాంత వాసుదేవమని చెప్పబడును.

## 14. -: ప్రద్యుమ్నమూర్తి లక్షణమ్ :-

*ప్రద్యుమ్నః సూక్ష్మచక్రస్తు పీతవర్ణ స్తథైవచ*
*మకరాభం భవేద్రేఖా పార్శ్వతో పృష్ఠతోపివా*
*సూక్ష్మ ద్వారేణ సంయుక్తః పూజితా మిష్టసిద్ధిదః*
*ప్రద్యుమ్నః సూక్ష్మచక్రస్తు శ్వేతవర్ణ స్తథైవచ*
*సుషిరం బహులంచైవ దీర్ఘాకారంతు తద్భవేత్*
*ప్రద్యుమ్న ఇతివిఖ్యాతః సర్వకామ ఫలప్రదః,*

పచ్చనై, సన్నని చక్రము గలిగి వీపునగాని ప్రక్కనగాని మొసలివంటి రేఖతో గూడిన మూర్తి ప్రద్యుమ్న మనబడును.

తెల్లని సూక్ష్మద్వారము మరియు సూక్ష్మచక్రము గల ప్రద్యుమ్నమూర్తి పూజించువారికి యిష్టసిద్ధులిచ్చును.

పొడవై పెక్కు రంధ్రములు గల ప్రద్యుమ్నమూర్తి సర్వకామ ఫలప్రదమని చెప్పుదురు.

## 15. -: అనిరుద్ధమూర్తి లక్షణమ్ :-

*అనిరుద్ధో త్రిధాజ్ఞేయః తత్తల్లక్షణ భేదతః*
*తచ్ఛిలా స్వచ్ఛనీలాభో వర్తులశ్చాతి శోభనః*

రేఖాద్వయ మపిద్వారే కృష్ణపద్మేన లాంఛితః
కృష్ణవర్ణం సమద్వారం, చక్రభిత్తి సమీపగమ్
అనిరుద్ధ ఇతిఖ్యాతం సర్వాభీష్ట ఫలప్రదమ్
సూక్ష్మచక్రం భవేదూర్ధ్వం పార్శ్వే చణకపుష్పవత్
అనిరుద్ధ ఇతిప్రోక్తః సర్వలోకైక కారణః.

ఆయా లక్షణ భేదములను బట్టి అనిరుద్ధము మూడు విధములని చెప్పబడినది.

ఆ రాయి అచ్చమైన నీలమువలె నుండి గుండ్రనై మిక్కిలి ప్రకాశముతో నుండి ద్వారదేశమున రెండు రేఖలు మరియు నల్లని పద్మముతో గూడియుండును.

నల్లనిరంగు, సమానమైన ద్వారము, దాని నానుకొని చక్రముగల మూర్తి అనిరుద్ధమని చెప్పబడును. అది సర్వాభీష్టప్రదమైనది.

పైన సూక్ష్మచక్రము ప్రక్కన సెనగపూవు వంటి రేఖలుగల మూర్తి అనిరుద్ధమని చెప్పబడును. అవి సర్వలోకైక కారణమగును.

## 16. -: పురుషోత్తమమూర్తి లక్షణమ్ :-

యస్యామూర్తే రుత్తమాంగం చారచక్రం ప్రదృశ్యతే
తత్తన్మూర్తిః మునిశ్రేష్ఠాః విజ్ఞేయః పురుషోత్తమః
మధ్యేచక్రః సువర్ణస్తు మస్తకే పృథుచక్రవాన్
పురుషోత్తమస్సు విజ్ఞేయః సర్వభాగ్య ప్రదోఽర్చతామ్
కృష్ణవర్ణం సూక్ష్మరంధ్రం ద్వారే చక్రద్వయాన్వితమ్
శిరస్యేకం బ్రహ్మచక్రం జ్ఞేయం తత్పురుషోత్తమమ్
అస్యాంతరాలే ద్వేచక్రే శిరశ్చక్రం బృహచ్ఛవేత్
లలాటే దండరేఖాచ ద్వారచక్రేతు కల్పకమ్
సకుండలంచ విజ్ఞేయ మిష్టదం పురుషోత్తమమ్.

ఓ మునిశ్రేష్ఠులారా! దేని తలపై కదలిన చక్రము గనిపించునో అది పురుషోత్తమమని యెరుగవలెను.

మంచి వన్నెగలిగి మధ్య చక్రము మరియు తలపై పెద్ద చక్రము గల మూర్తి పురుషోత్తమమని తెలియవలెను. అది పూజించువారికి సర్వభాగ్యము లిచ్చును.

నల్లనై సన్నని రంధ్రము, రెండు చక్రములు మరియు తలపై నొక బ్రహ్మచక్రముగల మూర్తి పురుషోత్తమమని చెప్పబడును.

మొగములోపల రెండు చక్రములు తలపై యొక పెద్ద చక్రము, నొసట దండాకారము గల రేఖ, ద్వారచక్రమున కల్పవృక్షము మరియు కుండలములు గల మూర్తి పురుషోత్తమ మనబడును. అది యిష్టార్థము లిచ్చును.

:- అనంత పురుషోత్తమమ్ :-

మూర్తి స్త్వనంత చక్రాస్స్యా హ్యానంత పురుషోత్తమః
మొగమున అనంతచక్రములు గలది అనంత పురుషోత్తమ మనబడును.

17. :- అధోక్షజమూర్తి లక్షణమ్ :-

అతికృష్ణో రక్తరేఖా వృత్తదేహః సుచక్రవాన్
కించిత్కాపిల సంయుక్తః స్థూలోవా సూక్ష్మ ఏవవా
అధోక్షజ ఇతిఖ్యాతః పూజకస్య శుభప్రదః.

మిక్కిలి నలుపై రక్తరేఖ గలిగి గుండ్రమై ఒక చక్రము గలిగి గాని, కొంచెము కపిలమై, లంతలావుగాని సన్నముగాని, గాని మూర్తి అధోక్షజ మన బడును. అది పూజకు శుభమిచ్చును.

18. -: అచ్యుతమూర్తి లక్షణమ్ :-

చతుర్భిః పృష్ఠ చక్రైశ్చ వామదక్షిణ పార్శ్వగైః
అధిష్ఠితో ముఖేప్యేకం కుండలద్వయ శోభితమ్
శంఖచక్ర గదాశార్ఙ్గ యుతం కపిల మేవవా
తదచ్యుత మితిజ్ఞేయం దుర్లభం భాగ్యదం నృణామ్
శంఖచక్ర గదాశార్ఙ్గీ బాణ కౌమోదకీ ధరః
ముసలధ్వజ దృక్ శ్వేత ఛత్రవబ్రాంశుశై ర్యుతః
సోమ్యుతః కథితోనామ్నా దుర్లభ స్తపసా వినా.

కపిలమైన వీపు ముఖమున ప్రక్కలందు మొత్తము నాలుగు చక్రములు గలిగి కుండలద్వయముతో శంఖచక్రగదా శార్ఙ్గములతో గూడిన మూర్తి అచ్యుత మనబడను. అది దుర్లభమైన భాగ్యము నిచ్చును.

శంఖ చక్ర గదా శార్ఙ్గ బాణములు ముసల ధ్వజము శ్వేతఛత్రము వజ్రాంకుశము గల మూర్తి అచ్యుతమని చెప్పబడును. అది తపస్సు చేతగాని లభింపదు.

### 19. -: జనార్దనమూర్తి లక్షణమ్ :-

పూర్వాఖాగ్రైక వదనః పశ్చాదేకాస్య సంయుతః
జనార్దనః చతుశ్చక్రః శ్రీప్రదః శత్రునాశనః

ముందువైపొక మొగము, వెనుకవైపొక మొగము గలిగి నాలుగు చక్రములతో గూడిన మూర్తి జనార్దనమని చెప్పబడును అది శ్రీప్రదము మరియు శత్రువినాశకరము.

### -: కృష్ణ జనార్దనమ్ :-

అతల్లక్ష్యే చతుశ్చక్రం వర్తులంచోత్పలప్రభమ్
ద్వారషట్క సమాయుక్తం, చక్రంద్వాదశ సంయుతమ్
పూజితా మిష్టఫలదం కృష్ణమాహుర్జనార్దనమ్.

అస్పష్టమైన నాలుగుచక్రములు గలిగి గుండ్రనైన నల్లకలువ వంటి కాంతితో నుండి ఆరు ద్వారములు పన్నెండు చక్రములు గల మూర్తి కృష్ణ జనార్దనమందురు. అది యిష్టఫలము లిచ్చును.

### -: లక్ష్మీ జనార్దనమ్ :-

ఏకద్వారం చతుశ్చక్రం నవీన నీరదోపమమ్
లక్ష్మీజనార్దనం జ్ఞేయో సహితో. వనమాలయా.

ఒక ద్వారము, నాలుగు చక్రములు. వనమాల గలిగి క్రొత్త మేఘము వంటి వన్నెతో గూడినది లక్ష్మీజనార్దనమని తెలియవలెను.

### 20. -: ఉపేంద్రమూర్తి లక్షణమ్ :-

ఉపేంద్రో మణివర్ణాభో హ్రస్వో చక్రాతి శోభనః
కోమలో వృత్తకశ్చైవ, సతుపార్శ్వే ద్విచక్రయుక్.

మణివంటి వన్నెగలిగి కోమలమై గుండ్రమై చిన్నచక్రముచే ప్రకాశించుచు ప్రక్కన రెండు చక్రములు గల మూర్తి ఉపేంద్రమని చెప్పబడును.

## 21. -: హరిమూర్తి లక్షణమ్ :-

బహుద్వార సమాయుక్తం శ్యామవర్ణో ద్విచక్రవాన్
వర్తులో మృదులశ్చైవ పూజితా మిష్టసిద్ధిదః
అల్పద్వార ద్వయోపేతా హరిమూర్తి రుదాహృతా.

అనేక ద్వారములతోగూడి శ్యామలమై మృదువై గుండ్రమై రెండు చక్రములు గలది హరిమూర్తియని చెప్పబడును. అది యిష్టఫలము లిచ్చును.

అల్పమైన రెండుద్వారములు గలది గూడ హరిమూర్తియే యనబడును.

### -: లక్ష్మీహరిమూర్తి :-

లక్ష్మీహరిస్స విజ్ఞేయో యత్రపద్మం సచక్రకమ్
కేవలా వనమాలాచ గృహస్థానా మభీష్టదా.

ఏది పద్మము చక్రము మరియు కేవల వనమాలతో గూడియుండునో అది లక్ష్మీహరియని యెరుగవలెను. అది గృహస్థులకు కోరికలిచ్చును.

### -: అథ అన్యమూర్తి భేదా :-

అన్యాన్ సర్వాన్ ప్రభేదాంశ్చ శ్రూయతాం చ మహర్షయః.
ఓ మహర్షులారా! ఇక ఇతరములగు తక్కిన భేదములను వినుడు.

### 1. -:హయగ్రీవమూర్తి లక్షణమ్ :-

హయగ్రీవోపి భగవాన్ రక్తపీత ఇతి శృతః
అశ్వాకార స్వరూపస్తు చక్రద్వయ సమన్వితః
పద్మాకృతి స్తథాపార్శ్వే కుండలాకృతి రేఖవా
భాగ్యదో జ్ఞానదో నౄణాం మోక్షదో ధనధాన్యదః
పార్శ్వే చక్రో బృహద్వార శ్చోన్నతో నిమ్నమధ్యగః
సకాపిలః కృష్ణవర్ణో హయగ్రీవః సుఖప్రదః
అశ్వాకృతి ముఖేముద్రా హయగ్రీవః ప్రకీర్తితః
హయగ్రీవోం కుశాకారో ద్వారచక్ర సమన్వితః
కృష్ణవర్ణో ద్విరేఖాశ్చ మహాసారః సుఖప్రదః.

ఎఱుపు, పసుపు వన్నెలతో గూడి అశ్వాకారమున నుండి రెండు చక్రములు గల మూర్తి హయగ్రీవమని చెప్పబడును.

ఒకవైపున పద్మముగాని కుండలముగాని గల హయగ్రీవమూర్తి సంపద, ధన ధాన్యములు జ్ఞానము మరియు మోక్షము నిచ్చును

ఒకవైపున చక్రము మరియు పెద్ద ద్వారము గలిగి, నడుమ ఎగుడు దిగుడై కపిలము మరియు నలుపుతో గూడినది హయగ్రీవమగును. అది సుఖము నిచ్చును.

గుఱ్ఱపు మొగమువలె నుండి, అక్షమాల పుస్తకము మరియు పద్మ చిహ్నములు గలిగి యున్నచో నది హయగ్రీవమని చెప్పబడును.

నల్లనై అంకుశమువలె నుండి ద్వారమున రెండు చక్రములు మరియు రెండు రేఖలు గల మూర్తి హయగ్రీవ మనబడును. అది శక్తిని మరియు సుఖమును యిచ్చును.

## 2. -: కపిలమూర్తి లక్షణమ్ :-

*కపిలో వర్తులోత్యంత స్పష్టచక్ర సమన్వితః*
*పంచబిందు స్సమోపేతో వరవీర్య ప్రదోనృణామ్.*

కపిలమూర్తి గుండ్రనై స్పష్టమైన చక్రము మరియు అయిదు చుక్కలతో గూడియుండును. పూజించు వారికి శ్రేష్ఠమైన బలమును ప్రసాదించును.

## 3. -: యజ్ఞమూర్తి లక్షణమ్ :-

*యజ్ఞమూర్తిస్తు భగవాన్ రక్తపీత ఇతిశ్రుతః*
*ద్వారస్యావామే చక్రస్యా స్రుక్స్రువే దక్షిణేపిచ*
*చక్రద్వాయ సమాయుక్తా మర్చతా మిష్టసిద్ధిదమ్.*

భగవంతుడైన యజ్ఞమూర్తి ఎఱుపు పసుపువన్నె గలవాడని చెప్పబడినది. కుడి ఎడమన గల ద్వారములలో చక్రములు మరియు దక్షిణమున స్రుక్స్రువములు గలది యజ్ఞమూర్తి యనబడును. ఇది అర్చకులకు ఇష్టార్థములిచ్చును. (మూర్తి నామములలో ఇది యజ్ఞభోక్త యని చెప్పబడినది).

### 4. -: శింశుమార మూర్తి లక్షణమ్ :-

*శింశుమారో దీర్ఘకాయో బిలకాల్యాతి గహ్వరః*
*ఉన్నతః పుచ్ఛభాగేచ చక్రేణైకేన సంయుతః*
*సర్వాధారస్స విజ్ఞేయః సర్వసిద్ధి ప్రదోనృణామ్.*

పొడవుగా నుండి మిక్కిలి లోతైన బలిష్ఠమైన రంధ్రములు గలిగి తలపై మరియు తోకపై ఒక్కొక్క చక్రము గలది శింశుమార మూర్తియని తెలియవలెను. అది సర్వసిద్ధులు గలిగించును.

### 5. -: ముకుందమూర్తి లక్షణమ్ :-

*షణ్ముఖస్తు ముకుందస్యాత్ చక్రద్వాదశ సంయుతః*
*కృష్ణశ్చేత్ భాగ్యదః ప్రోక్తః శుక్లశ్చే న్మోక్షదాయకః.*

ఆరు ముఖములు మరియు పన్నెండు చక్రములు గలది ముకుందమగును. ఈ శిల నల్లనిదైన యెడల భాగ్యమును, తెల్లనిదైన మోక్షమును గలిగించును.

### 6. -: హంసమూర్తి లక్షణమ్ :-

*హంసస్తు ధనురాకారో నీలశ్వేత ప్రభస్సదా*
*చక్రపద్మ సమాయుక్తః కేవలం మోక్షదో భవేత్.*

నలుపు తెలుపు వన్నెలు గలిగి ధనురాకారమై చక్రపద్మములతో గూడిన శిల హంసమూర్తి యనబడును. అది కేవల మోక్షము నిచ్చును.

### 7. -: పరమహంసమూర్తి లక్షణమ్ :-

*పరమహంసః మునీశానా శ్శిఖండీ గళసన్నిభః*
*స్నిగ్ధ ఆయతవృత్తశ్చ వర్తులః ద్వారసంయుతః*
*బిలమధ్యే తథాచక్ర ద్వయంచాత్యంత శోభనః*
*వర్తులాకృతి వద్భాగో దృశ్యతే పద్మసన్నిభః*
*మూర్తిః పరమహంసాఖ్యా శ్చతుర్వర్గ ఫలప్రదః.*

ఓ మునీంద్రులారా! నెమిలిమెడవన్నె గలిగి నున్నగానుండి విశాలము మరియు గుండ్రమైన ద్వారము, దానినడుమ సుందరమైన రెండు చక్రములు,

పద్మసన్నిభమైన వర్తులము గనిపించిన యెడల అది పరమహంస మూర్తియని చెప్పబడును. చతుర్వర్గ ఫలము లిచ్చును.

### 8. -: వైకుంఠమూర్తి లక్షణమ్ :-

వైకుంఠో మణివర్ణాభో వామపార్శ్వేక చక్రకః
ద్వారోపరి తథారేఖా పద్మాకారాతి శోభనా
వైకుంఠ దోర్భుతాం ప్రోక్తో సర్వసౌఖ్య ఫలప్రదః.

మణివంటి వన్నెగలిగి ఎడమన ఒక చక్రము, ద్వారముపై ప్రకాశమైన పద్మరేఖలు గలది వైకుంఠ మూర్తి యగును. అది యర్చించువారికి సమస్తమైన సౌఖ్యము లిచ్చును. మరియు వైకుంఠమును గలిగించును.

### 9. -: పుండరీకాక్షమూర్తి లక్షణమ్ :-

పార్శ్వేవా మూర్ధ్ని పృష్ఠేవా నయనద్వయ సంయుతః
పుండరీకాక్ష మూర్తిస్యాత్ సర్వలోక వశీకరః.

ప్రక్కనగాని తలపైగాని, వీపునగాని రెండు కన్నులుగల మూర్తి పుండరీకాక్షమని చెప్పబడును. అది అన్ని లోకములను వశపరచును.

### 10. -: లక్ష్మీపతిమూర్తి లక్షణమ్ :-

ముఖేవా పార్శ్వతోవాపి మయూర గళసన్నిభః
కృష్ణవర్ణః సూక్ష్మచక్రః పృథులాస్య స్రగన్వితః
లక్ష్మీపతి రితిఖ్యాతో లక్ష్మీ సంపద్వి ధాయకః.

నల్లనై ప్రక్కనగాని, మొగమునగాని నెమిలి కంఠమువంటి వన్నెగలిగి, విశాలమైన ముఖము సూక్ష్మచక్రము మరియు వనమాల గుర్తులు గలది లక్ష్మీపతి మూర్తి యనబడును. అది ధనసంపత్తిని గలుగజేయును

### 11. -: దేవదేవమూర్తి లక్షణమ్ :-

దూర్వాభో సూక్ష్మచక్రస్తు పీతరేఖాశ్చ సూక్ష్మకాః
ద్వారేచ దక్షనర్వాను ప్రదృశ్యంతే నిరంతరాః
సదేవదేవో విజ్ఞేయః పూజితా మిష్టసిద్ధిదః.

గరిక పస్నెగలిగి సన్నని చక్రము, ద్వారమున నలుదిక్కులందు సన్నని పచ్చని రేఖలుగల శిల దేవదేవమని చెప్పబడును. అది పూజించువారికి యిష్టసిద్ధిని గలిగించును.

### 12. -: వటపత్రశాయిమూర్తి లక్షణమ్ :-

వటపత్రశాయీ భగవాన్ వర్తులో వ్యతిశోభనః
క్షీర బుద్బుదవత్ శ్రేష్ఠః నీలశ్వేత ప్రభ స్తథా.

గుండ్రనై మిక్కిలి శోభతో గూడి పాలనురగవలె మేలిమైన తెలుపు మరియు నలుపుగలది వటపత్రశాయిమూర్తి యగును.

### 13. -: విశ్వంభరమూర్తి లక్షణమ్ :-

వక్త్రస్య వామతశ్శంఖం దక్షిణే పద్మమేవచ
వదనైకే మధ్యదేశే చతుశ్చక్ర స్త్రిబిందవః
చక్రాణా మథవింశత్యాత్ యుక్తో విశ్వంభర ఉచ్యతే.

మొగమునకు ఎడమవైపున శంఖము, కుడిని పద్మము, మొగము నడుమ నాలుగుచక్రములు మూడుచుక్కలు గలిగి, యిరువది చక్రములతో గూడిన మూర్తి విశ్వంభరమని చెప్పబడును. అది శుభములిచ్చును.

### 14. -: విశ్వరూపమూర్తి లక్షణమ్ :-

విశ్వరూపో బృహత్ సాక్షాత్ వామేకృత విభూషణః
బహుచక్రాంకితో ఽనేక మూర్తిరూప సమన్వితః
బహువక్త్ర స్థూలధరః పురుషో బహుచక్రవాన్
అనంతో విశ్వరూపోవా పుత్రపౌత్రాభివృద్ధిదః.

లావుగానుండి ఎడమవైపు చంద్రునివంటి ఆకారముగలిగి అనేక చక్రములతో అనేకరూపములతో అనేకముఖములతో గూడినది విశ్వరూపమూర్తి యనబడును. అది పుత్రపౌత్రాభివృద్ధిని జేయును.

### 15. -: గరుడధ్వజమూర్తి లక్షణమ్ :-

స్వర్ణశృంగ యుతో వామే వర్తులః స్నిగ్ధకేసరః
చక్రమాద్యే గతేకృష్ణే స్వర్ణరేఖా విభూషితే
లక్ష్మీకరో శుభకరో గరుడధ్వజ సంజ్ఞితః.

గుండ్రమై అందమై ఎడమవైపు బంగారు రంగుగల కొమ్ము, వర్తులమై అందమైన కేసరములు, చక్రము నడిమినుండి వెళ్ళిన నల్లని మరియు బంగారు రేఖలుగల శిల గరుడధ్వజ మూర్తియందుర్రు. అది సంపదలను శుభములను ఇచ్చును.

## 16. -: పీతాంబరమూర్తి లక్షణమ్ :-

పీతాంబర స్తు భగవాన్ ద్వివిధో౽త్ర ప్రకీర్తితః
స్నిగ్ధో గోరోచనాకారో వర్తులశ్చ సుచక్రకః
రేఖా పీతాంబరధరః సామ్రాజ్య ఫలదాయకః
ద్వారదేశే లసచ్చక్రో బహువర్ణ సమన్వితః
పీతాంబర ధరశ్చైవ సౌభాగ్య ఫలదో నృణామ్.

భగవంతమైన పీతాంబరమూర్తి రెండువిధములుగా చెప్పబడినది. గోరోచనపు వన్నెతో నునుపై గుండ్రమై ఒక చక్రము మరియు ఒక రేఖ గలశిల పీతాంబరమూర్తి యనబడును. అది సామ్రాజ్య ఫలమిచ్చును.

అనేక వర్ణములుగలిగి ద్వారమున ఒక చక్రముగలది మరియొక పీతాంబరము అది సౌభాగ్యము నిచ్చును.

## 17. -: సత్యవీరశ్రవమూర్తి లక్షణమ్ :-

సువర్తులో హ్రస్వచక్రః సర్వాంగే హిమబిందుకః
సత్యావీర శ్రవః ప్రోక్తః సర్వభాగ్య వివర్ధనః.

చక్కని వర్తులవదనము, సన్నని చక్రము, మరియు సర్వాంగములందు బంగారుచుక్కలు గలది సత్యవీరశ్రవమని చెప్పబడును. అది భాగ్యములను వృద్ధిబొందించును.

## 18. -: బహురూపిమూర్తి లక్షణమ్ :-

అభ్యంతరే పృథుశ్చక్రే బహ్వానన సంయుతః
బహురూపీ సమాఖ్యాతః పూజితో మోక్షదాయకః.

అనేక ముఖములుగలిగి లోపల ఒక పెద్ద చక్రముగలది బహురూపి యనబడును. అది పూజించు వారికి మోక్షము నిచ్చును.

### 19. :- పుండరీకమూర్తి లక్షణమ్ :-

పార్శ్వేవా మూర్ధ్ని పృష్ఠేవా చక్రద్వయ సమన్వితః
పుండరీకాఖ్యమూర్తిస్స్యాత్ సర్వభాగ్య ప్రదాయకః.

ప్రక్కలందుగాని, వెన్నునగాని, తలపైగాని రెండు చక్రములు గలది **పుండరీకమూర్తి** యనబడును. అది అన్ని భాగ్యము లిచ్చును.

### 20. -: పారిజాతహరిమూర్తి లక్షణమ్ :-

అధోపరి ద్విచక్రాఢ్యో పారిజాతో హరిస్స్మృతః
బ్రహ్మచర్య వ్రతస్థేన పూజనీయః ప్రయత్నతః.

పైభాగమున రెండు చక్రములు ధరించిన శిల, పారిజాత హరిమూర్తియని చెప్పబడును. దానిని ఎంతప్రయత్నించి యైనను బ్రహ్మచర్య వ్రతము గలవారు పూజింపవలెను.

(ఇది నామావళిలో పారిజాత మూర్తియనియే చెప్పబడినది)

### 21. -: సుదర్శన మూర్తి లక్షణమ్ :-

సుదర్శనో ద్విధాజ్ఞేయో లక్షణాంతర యోగతః
బ్రహ్మచర్య వ్రతస్థేన పూజనీయః సర్వకామదా
ఏకచక్ర శ్శిరోదేశే కృష్ణవర్ణ ముఖస్తథా
సుదర్శనస్స విజ్ఞేయః సర్వపాప ప్రణాశనః
పద్మాకారం బృహచ్చక్రం నిమ్ననాభి స్సుదర్శనః.

లక్షణాంతరమునుబట్టి సుదర్శనము రెండు విధములుగ చెప్పబడును. అదిగూడ బ్రహ్మచారులు పూజింపదగినదే. అన్ని కోరిక లిచ్చును.

నల్లనిమొగము మరియు తలపై ఒక చక్రము గలది సుదర్శనమనబడును. అది సర్వపాపములను బోగొట్టును.

పద్మమువంటి ఆకారము, పెద్దచక్రము మరియు లోతగు నాభి గలది యింకొక సుదర్శనము.

## 22. -: అమృతాహరణమూర్తి లక్షణమ్ :-

*అమృతాహరణో దేవో నీలోత్పల నిభప్రభః*
*వర్తులో హ్రస్వవదనో మధ్యచక్రాతి కోమలః*
*అర్చితాంచ దదాత్యేషో పుత్రపౌత్ర ధనానిచ.*

నల్ల కలువపంటి కాంతిని జిమ్ముచు, గుండ్రనై, కోమలమై, పొట్టి మొగము మరియు నడిమి చక్రము, గలది అమృతాహరణ మూర్తి యనబడును. అది సర్వ సౌభాగ్యము లభివృద్ధి జేయును.

(ఇది కొన్నిటిలో అమృతాంశువని చెప్పబడినది)

## 23. -: చక్రపాణిమూర్తి లక్షణమ్ :-

*పూర్వభాగే త్రివదనః పశ్చాదేకేన సంయుతః*
*అష్టచక్రేణ సంయుక్తః చక్రపాణి రితీరితః*
*అభ్యంతరే పృథుశ్చక్రో బహులాస్య సమన్వితః*
*చక్రపాణి రితిఖ్యాతో హ్యర్చితాంచ శుభప్రదః*
*ఏకచక్ర యుతశ్చాన్యః శుక్లవర్ణ సమన్వితః*
*చక్రపాణి రితిఖ్యాతః పూజితాం మోక్షదో నృణామ్.*

ముందువైపు మూడు మరియు వెనుకవైపు ఒక మొగము గలిగి ఎనిమిది చక్రములతో గూడిన మూర్తి చక్రపాణి యనబడును.

లోపల పెద్ద చక్రము మరియు పెద్ద నోరుగలది చక్రపాణిమూర్తి యనబడును. అది పూజించువారికి శుభములిచ్చును.

ఒక చక్రముతో గూడి తెల్లనైనది మరియొక చక్రపాణిమూర్తి యనబడును. పూజించు నరులకు మోక్షము నిచ్చును.

(నామావళిలో దీని పిమ్మటగల మాయా నారాయణమును నారాయణ భేదముల క్రింద జేర్చితిని)

## 24. -: జగద్యోనిమూర్తి లక్షణమ్ :-

*యతిభిః సేవనీయస్స్య ఏకచక్ర స్స్వరక్తకః*
*ద్వారచక్రో రక్తవర్ణో జగద్యోని స్సుఖప్రదః.*

ఎఱుపురంగు గలిగి ఎట్టనగు చక్రము, ద్వారదేశమున మరియొక చక్రము గల మూర్తి జగద్యోనియని చెప్పబడును. ఇది యతులు పూజింప దగినది.

### 25. -: అనంతమూర్తి లక్షణమ్ :-

*పంచవక్త్రం స్థూలతరం పరుషం బహుచక్రకమ్*
*విశ్వరూప మనంతంవా పుత్రపౌత్రాభివృద్ధిదమ్*
*చతుర్దశ ప్రభృతిభిః వింశత్యా చక్రలాంఛితః*
*నానావర్ణో హ్యనంతాత్మ నాగభోగేన చిహ్నితః*
*అనేకమూర్తి సంయుక్తః సర్వకామ ఫలప్రదః.*

మిక్కిలి లావై అయిదుముఖములు మరియు అనేక చక్రములు గలది విశ్వ రూపమూర్తి లేదా అనంతమూర్తియని చెప్పబడును. అది పుత్రపౌత్రాభి వృద్ధిని గలిగించును.

నానావర్ణములు మరియు పదునాలుగు మొదలు యిరువది చక్రములు గలిగి నాగచిహ్నములతోగూడిన మూర్తి అనంతు దనబడును. అది అన్ని కోరిక లిచ్చును.

### 26. -: శేషమూర్తి లక్షణమ్ :-

*ప్రదక్షిణా వర్తయుతః వనమాలా విభూషితః*
*పృష్ఠాది మూర్ధ్ని పర్యంతం వలయాకార రేఖయా*
*సువర్ణనిభయా ద్విత్రి చతుః పంచాది సంఖ్యయా*
*సంయుక్తః శుభచక్రాఢ్యో శ్యామనీల సితోవివా*
*అథవా కుండలీభూత నాగభోగ సమప్రభః*
*శేషమూర్తిస్స భగవాన్ అశేషైశ్వర్య దాయకః.*

కుడికిదిరిగిన సుడితోగూడి వనమాల మరియు వెన్నుమొదలు తలవరకు గుండ్రని బంగారురేఖలు గలిగి, రెండు మూడు నాలుగు లేదా అయిదు చక్రము లతో గూడినమూర్తి.

లేదా చుట్టుజుట్టుకొనిన సర్పరేఖతో గూడిన శిల శేషమూర్తి యనబడును. అది యశేష సంపదనిచ్చును.

## 27. -: అవ్యయమూర్తి లక్షణమ్ :-

పూజనీయః ప్రయత్నేన సిద్ధః స్నిగ్ధః సువర్తులః
బహువర్ణో ద్వారచక్రః పూజితాం సుఖదోవ్యయః.

నునుపై గుండ్రమై అనేకవర్ణములతో గూడి ద్వారమున చక్రములు గల శిల అవ్యయమూర్తి యనబడును. అది అవ్యయ సుఖమిచ్చును.

## 28. -: త్రిమూర్తి లక్షణమ్ :-

చక్రద్వాయ సమేతోవా వదనేషు త్రిషుక్రమాత్
త్రిమూర్తి రితివిఖ్యాతః సర్వసంపత్ప్రదోర్చితామ్.

మూడు మొగములు, ఒక్కొక్క మొగమున రెండేసి చక్రములు గల శిల త్రిమూర్తి యనబడును. అది సర్వసంపద లిచ్చును.

## 29. :- హరిహరమూర్తి లక్షణమ్ :-

చతుశ్చక్రో హరిహరో ద్విముఖో వర్తులాకృతిః
అధశ్చోర్ధ్వం యదిభవేత్ ద్వేద్వేచక్రే సుశోభనే
యత్తద్ధరిహరం విద్యా న్నరాణాం దారిద్ర్యదః క్రమాత్
చతుశ్చక్రో హరిహరో ద్విముఖో వేదనావ్యథః
వినశ్యతి గృహస్థానాం ధనంక్షేత్రం కులంక్రమాత్
శివనాభి యుతోమూర్ధ్ని పృష్ఠేవాపి భవేద్యది
యత్తద్ధరి హరఃప్రోక్తః సౌభాగ్యస్సుఖదాయకః

గుండ్రనై మొగమున నాలుగు చక్రములు మరియు క్రింద మీద రెండేసి చక్రములు గల శిల హరిహరమూర్తి యనబడును. అది మానవులకు క్రమముగా లేమిని కలుగజేయును.

రెండు ముఖములు నాలుగు చక్రములుగల హరిహరము సంసారులకు క్రమముగ వేదన, వ్యథ మరియు కుల ధన క్షేత్రనాశము గలిగించును.

తలపైగాని వీపునగాని లింగాకారమైన నాభిగల హరిహరము సౌభాగ్యమును, సుఖమును గలుగజేయును.

### 30. -: శంకర నారాయణమూర్తి లక్షణమ్ :-

*శివనాభి యుతఃపార్శ్వే వామేవా దక్షిణేపివా*
*సతు శంకర పూర్వాఖ్యో నారాయణ ఇతీరితః.*

కుడినిగాని ఎడమనుగాని శివాకృతియైన నాభిగల శిల శంకరనారాయణ మని చెప్పబడును.

### 31. :- స్వయంభూమూర్తి లక్షణమ్ :-

*దీర్ఘాస్యం పృథుచక్రశ్చ మూర్తివర్తుల రేఖవాన్*
*నీలవర్ణ సమాయుక్తో స్వాయంభూః పరికీర్తితః*
*కేవలం మోక్షఫలదో హ్యార్చితాంచ ఫలప్రదః.*

నీలమై పొడవైన మొగము పెద్దచక్రము మరియు పర్తులమైన రేఖలుగల శిల స్వయంభువమని చెప్పబడును. అది కేవలము మోక్షము నిచ్చును.

### 32. :- పరమేష్ఠిమూర్తి లక్షణమ్ :-

*పరమేష్ఠీతు శుక్లాభః చక్రపద్మ సమన్వితః*
*ద్వివిధాకృతిః తథాపృష్ఠే సుషిరం చావివర్తులః*
*పీతవర్ణ యుతోవాపి భుక్తిముక్తి ఫలప్రదః.*

పరమేష్ఠిమూర్తి రెండు విధములుగా నుండును. తెల్లనై చక్ర పద్మము లతో గూడినది యొకటి, అటులే పచ్చనై వీపున రంధ్రము గలది మరియొకటి. అవి పూజించువారికి భుక్తి ముక్తు లిచ్చును.

### 33. :- చతుర్ముఖమూర్తి లక్షణమ్ :-

*చతుస్రోయత్ర దృశ్యంతే రేఖాఃపార్శ్వ సమీపగాః*
*ద్విచక్రమధ్యే దేశేతు సాశిలాస్యా చ్చతుర్ముఖః.*

నాలుగు మూలలై ప్రక్కలలో రెండు రేఖలు శిలనడుమ రెండు చక్రములు గలది చతుర్ముఖ మూర్తి యనబడును.

## 34. -: పితామహమూర్తి లక్షణమ్ :-

పితామహ చ్చతుర్వక్త్రో హ్యష్టచక్ర సమన్వితః
వర్తులః కృష్ణవర్ణశ్చ పూజితాం సర్వసిద్ధిదః.

నాలుగుమోములు ఎనిమిదిచక్రములు గలిగి నల్లనై గుండ్రనైనది పితామహ మనబడును. అది పూజించు వారికన్ని సిద్ధులిచ్చును.

## 35. -: హిరణ్యగర్భమూర్తి లక్షణమ్ :-

అముఖః స్వర్ణబిందుశ్చ స్వర్ణగర్భ ప్రకీర్తితః
హిరణ్యగర్భం పరమం పవిత్రం భువి దుర్లభం
అంతర్ధ్వని సమాయుక్తః కృష్ణవర్ణ స్సబిందుకః
వర్తులో హ్రస్వవదనో మధ్యచక్రోఽతికోమలః
శ్రీవత్స కమలాకార లాంఛనం చక్రపార్శ్వయోః
హిరణ్యగర్భో విఖ్యాతో హేమగర్భ నిధిప్రదః
హిరణ్యగర్భో భగవాన్ పృథునాభి సమన్వితః
హిరణ్యేన విమిశ్రస్తు శ్రీప్రదః కులవర్ధనః.

మొగము మొదలు అంతటను బంగారుచుక్కలు గలది హిరణ్యగర్భమూర్తియని చెప్పబడును. అది పరమపవిత్రము మరియు దుర్లభమైనది.

లోపల సన్నని ధ్వనితోగూడి గుండ్రమై నల్లనై మిక్కిలి కోమలమై చిన్ననోరు, నడిపి చక్రము, మరియు చుక్కలుగలిగి, చక్రముయొక్క ప్రక్కలందు శ్రీవత్సము, పద్మము గలది హిరణ్యగర్భమనబడును. అది బంగారుతో గూడిన నిధిని గలిగించును.

బంగారు పన్నెగలిగి పెద్దనాభియున్న మూర్తి హిరణ్యగర్భ మనబడును. అది సంపదను కులమును వృద్ధిజేయును.

## 36. -: గరుడమూర్తి లక్షణమ్ :-

ద్విపక్షాభ్యా ముపేతోయో గరుడో విషమోచనః
దుర్లభః సమచక్రస్తు కలౌ కల్మష నాశనః

రెండురెక్కలు మరియు సమచక్రములు గలది గరుడమూర్తి యనబడును. అది విషమోచనమును కలికల్మష నాశమును జేయును.

(నామావళిలో గరుడమూర్తి పిమ్మటగల శేషమూర్తిని అనంతమూర్తి చెంత, బలరామ, శీరపాణి, ప్రలంబఘ్న మూర్తులను సంకర్షణభేదములక్రింద జేర్చితిని).

### 37. -: నరమూర్తి లక్షణమ్ :-

*నరమూర్తిస్తు భగవా నతసీకుసుమ ప్రభః*
*ఏకనాభి సమోపేతో హ్యష్టసూత్రంతు పార్శ్వతః.*

అగిసెపూవు రంగులో ప్రకాశించుచు ఒక నాభి మరియు ప్రక్కలందు ఎనిమిది సూత్రములవంటి రేఖలుగలది నరమూర్తి యనబడును.

### 38. -: శివనాథమూర్తి లక్షణమ్ :-

*కూర్మాకృతి రధోభాగే లింగభాగే ఖురాన్వితః*
*శివనాథ ఇతిఖ్యాతో భుక్తిముక్తి ఫలప్రదః.*

అడుగుభాగమున తాబేలువలెనుండి లింగభాగమున గిట్టలతో గూడినది శివనాథ మనబడును. అది భుక్తిని ముక్తిని యిచ్చును.

### 39. :- సద్యోజాతమూర్తి లక్షణమ్ :-

*హేమవర్ణ జటాయుక్త హేమబిందు సమన్వితా*
*మస్తకే గోఖురాభాసా చంద్రగంగా సమన్వితా*
*సద్యోజాతాభిధా జ్ఞేయా పుత్రపౌత్ర ధనప్రదా.*

తలపై బంగారు జడలు మరియు బంగారు చుక్కలుండి ఆవుగిట్టవంటి చంద్రరేఖ మరియు గంగగలది సద్యోజాతమూర్తి యనబడును. అది శివానన ములలో మొదటిది. పూజించు వారికి పుత్రపౌత్రులను ధనమును గలిగించును.

### 40. -: వామదేవమూర్తి లక్షణమ్ :-

*లింగశక్తి రక్తవర్ణ శ్వేతచంద్ర జటాయుతా*
*వామదేవభిధా శ్రేష్ఠా గృహిభిః పూజితాసదా.*

నెత్తురురంగు గలిగి లింగశక్తితో తెల్లని చంద్రుడుగల జడలతో గూడి నది వామదేవ మనబడును. అది శివాననములలో శ్రేష్ఠమైనది. ఎల్లపుడు గృహస్థులచేత పూజింపదగినది.

## 41. :- అఘోరమూర్తి లక్షణమ్ :-

సర్వత్ర లోహితాకారా మూర్ధ్ని రక్త జటాశశీ
అఘోరస్సు పరిత్యాజ్యా గృహిభిః యతిపూజితా.

అంతట ఎఱ్ఱనై తలపైగూడ ఎఱ్ఱని జడలు మరియు చంద్రరేఖ గలది అఘోరమూర్తి యనబడును. అది సంసారులకు విడువదగినది. యతులు పూజింప వచ్చును.

## 42. :- తత్పురుషమూర్తి లక్షణమ్ :-

పూర్వభాగే తటిద్భాసా ఊర్ధ్వభాగే జటాశశీ
తత్పురుషాభి ధానస్యా ద్దుర్లభా సర్వకామదా.

ముందుభాగమున మెరుపుతీగవంటిరేఖ పైభాగమున జడలు మరియు చంద్రుడు గలది తత్పురుషమూర్తి యనబడును. అది దొరుకుట కష్టము. సమస్తమైన కోరికలు దీర్చును.

## 43. :- ఈశానమూర్తి లక్షణమ్ :-

కించిత్కపిల సంయుక్తః కృష్ణవర్ణ జటేందుకః
పార్శ్వే రేఖా సమాయుక్తా మూర్తిరీశాన సంజ్ఞితా.

కొంచెము కపిలవన్నెగలిగి నల్లనిజడలు, చంద్రరేఖ, మరియు రెండు వైపులందు గీతలుగలది ఈశానమూర్తి యనబడును.

## 44. :- సూర్యమూర్తి లక్షణమ్ :-

బాహ్యేవా భ్యంతరేవాపి వక్త్రద్వాదశ సంయుతా
సూర్యమూర్తిః పూజకస్య సర్వవ్యాధి వినాశకః.

లోపలగాని వెలుపలగాని పన్నెండుమొగములతో గూడినది సూర్యమూర్తి యనబడును. అది పూజించువారికి వ్యాధులన్నిటిని బోగొట్టును.

### 45. -: హైహయ మూర్తిలక్షణమ్ :-

*గర్భాగారే చతుశ్చక్రే పద్మంచే ద్దక్షిణే బహిః*
*పద్మపత్రాకృతిర్వాపి హేమవర్ణస్సమాకులః*
*హైహయస్తు సదాగోప్తా సర్వసిద్ధి ప్రదాయకః.*

పద్మ పత్రాకారమై బంగారు వన్నె గలిగి, గర్భమున నాలుగు చక్రములు వెలుపల దక్షిణమున పద్మములు గలది హైహయమూర్తి యనబడును. అది సర్వదా రక్షణ మరియు సకల కార్యసిద్ధిని గలిగించును.

### 46. -: దత్తాత్రేయమూర్తి లక్షణమ్ :-

*పీతః సితారుణాభశ్చ హ్రస్వపృష్ఠోన్నతా భవేత్*
*అక్షమాలాకృతిర్మధ్యే దత్తాత్రేయః ప్రకీర్తితః*
*కృష్ణవర్ణ యుతస్సోపి దత్తాత్రేయాభిధో భవేత్*
*ఏతేషా మేవ కేషాంచిద్భ్రష్టిభేదః ప్రతీయతే.*

పసుపు తెలుపు మరియు ఎఱుపు వన్నెలు గలిగి ఎగుడు దిగుడైన వీపు మరియు మధ్య భాగమున అక్షమాల గుర్తులు గలది దత్తాత్రేయ మనబడును. దీనిలో మతభేదముచే కొన్ని నల్లనివి గూడ గలవని చెప్పబడుచున్నది.

(నామావళిలో జెప్పిన ఈశ్వర మరియు క్షీరాబ్ధిశాయి భేదములు నాకు లభించిన ప్రతులలో కనబడలేదు. మరికొన్ని క్రొత్త భేదములు లభించినవి. అవి ఈ క్రింద నిచ్చుచున్నాను.)

## -: ఇతర భేదాః :-

### 1. -: హరిమూర్తి :-

*హరిరూపా శిలాసాస్యాత్ యథా ఊర్ధ్వముఖం భవేత్*
*హరివద్దృశ్యతే ద్వారం భుక్తిముక్తి ప్రదాతు సా.*

ఊర్ధ్వముఖమై సింహము నోటివలె కనిపించెడు ద్వారము గల శిల హరి మూర్తి యనబడును. అది భుక్తిముక్తుల నిచ్చును.

### 2 -: సౌమ్య హయగ్రీవమూర్తి :-

జ్ఞేయః సౌమ్యహయగ్రీవో హయగ్రీవ సమాశిలా
దీర్ఘయా రేఖయా యుక్త రేఖావా తాదృశీ భవేత్.

శిల గుబ్బపు మెడపలె నుండి దానిపై పొడవుగా ఏదో వ్రాసినటులగాని లేదా అటువంటి పొడవైన గీతలుగాని గలది సౌమ్య హయగ్రీవమని తెలియవలెను.

### 3. -: హయశీర్షమూర్తి :-

హయశీర్షస్స విజ్ఞేయో ముఖం యస్యాచ్ఛ యాఽతి
పద్మాకృతి భవేద్వాపి సాక్షనాలం శిరస్తథా

మిక్కిలి స్వచ్ఛమైన ముఖము గలిగి దానిపై పద్మాకారము గాని లేదా తలపై ఒక అక్షము మరియు నాలముగాని కలది హయశీర్షమని తెలియవలెను.

### 4. -: సహస్రార్జునమూర్తి :-

సహస్రార్జున నామాసౌ నానారేఖా మయోభవేత్
చక్రాకారా యంత్రపంక్తిః స నష్టద్రవ్యాదాయకః.

నానావిధమైన రేఖలతో మరియు చక్రముల వరుసతో గూడినది సహస్రార్జున మనబడును. అది నష్ట ద్రవ్యమును లభింపజేయును.

### 5. -: యోగేశ్వరమూర్తి :-

యోగేశ్వరస్స విజ్ఞేయో లింగయస్యా శిరోగతమ్
బ్రహ్మహత్యాది పాపానామ్ నాశకో యోగసిద్ధిదః.

తలపైన శివలింగ చిహ్నము గలది యోగేశ్వరమూర్తి యనబడును. అది బ్రహ్మహత్యాది పాపములను బోగొట్టి యోగసిద్ధిని గలిగించును.

### 6. -: రశ్మిమాలి మూర్తి :-

రస్మిమాలి హిరణ్యాక్ష చంద్రాభః స్ఫటికోపమః
అథవా జాయతేనానా స్వర్ణరేఖాభి రన్వితః.

చంద్రుని వంటి ప్రకాశము, మరియు బంగారు రంగు అక్షము గలిగి వివిధాకారములైన బంగారు గీతలు గలది రశ్మిమాలి యనబడును.

7. -: రాజరాజేశ్వరమూర్తి :-

మధ్యమం సప్తచక్రంచ ఛత్రతూణ సమన్వితమ్
రాజ రాజేశ్వరం జ్ఞేయం రాజసంపత్కరం నృణామ్.

ఏడు నడిపి చక్రములు మరియు గొడుగు అంబులపొదితో గూడిన మూర్తి రాజరాజేశ్వరమని తెలియవలెను. అది నరులకు రాజసంపదను గలిగించును.

8. -: శంకరమూర్తి లక్షణమ్ :-

ద్విలింగావా త్రిలింగావా చతుః పంచాది లింగవాన్
యస్స్యాచ్ఛంకర నామాస్యాత్ దేవదేవత్వ నాయకః
లింగైః పంచభిరాదీప్తః షడ్భిర్వా పంచభిస్తువా
తత్తన్మూర్తి ఫలంపుణ్యాం మయావక్తుం నశక్యతే.

రెండు, మూడు, నాలుగు, లేదా అయిదు లింగములతో గూడిన శిల దేవతలకు నాయకుడైన శంకరుడనబడును.

అయిదు ఆరు లేదా ఏడు లింగములతో గూడిన మూర్తి ఆ యా ఆకారములకు దగిన పుణ్యఫల మిచ్చును. అది యంతయు నావంటి వానికి జెప్పుటకు సాధ్యముగాదు.

-: విష్ణురువాచ :- -: అథ చక్రభేదాః :-

శృణుతార్క్ష్య మహాభాగ ! వినతా ప్రియనందన
ఏతాసా మేవమూర్తీనాం చక్రసంఖ్యా ఉదాహృతా
సంస్థానభేదా శ్చక్రాణాం సంఖ్యాభేదా శ్చ కథ్యతే
అనుక్తానాంతు మూర్తీనాం చక్రసంఖ్యా నవిద్యతే.

వినతా కుమారుడవైన ఓ గరుత్మంతుడా ! ఇక ఈ మూర్తులకు చక్ర సంఖ్యను జెప్పెదను వినుము.

చక్రములకు స్థానభేదమును మరియు వాని సంఖ్యాభేదమును చెప్పెదను. ఈ భేదములు జెప్పబడని మూర్తులకు చక్రము లుండవు.

వాసుదేవః జగద్యోనిః కృష్ణః పీతాంబరోవ్యయః
శిరఃపార్శ్వే సమేకక్షో ద్వారచక్రః ప్రకీర్తితః
అనిరుద్ధోభిదో కృష్ణో జామదగ్న్య స్తథైవచ
వామేవా దక్షిణేవాపి పార్శ్వే చక్రసమన్వితః
లక్ష్మీనృసింహో విష్ణుశ్చ నారసింహశ్చ భీతిదః
బలరామో భూవరాహః సయజ్ఞా వామచక్రిణః

వాసుదేవము, జగద్యోని, కృష్ణము. పీతాంబరము, అవ్యయము, అను మూర్తులు శిరమునకు ప్రక్కగా సమానమైన కక్షలు మరియు ద్వారమున చక్రములు గలిగియుండును. అనిరుద్ధము, కృష్ణము, జామదగ్న్యము కుడిపైపున గాని ఎడమవైపుగాని చక్రములు గలిగియుండును.

లక్ష్మీనృసింహము, విష్ణువు, భీతినారసింహము,బలరామము, భూవరాహము మరియు యజ్ఞమూర్తి ఎడమవైపున చక్రముగల మూర్తులు.

సీతారామ స్త్రిమూర్తిశ్చ శ్రీధరః పురుషోత్తమః
మత్స్యమూర్తి తదాహ్యేతే త్రిచక్రః పరికీర్తితః
చతుశ్చక్రో హరిహరః సీతారామో జనార్దనః
విశ్వంభరః కంసమర్ది లక్ష్మీనారాయణ స్తథా
పట్టాభిరామో దత్తశ్చ పంచచక్రః ప్రకీర్తితః
సీతారామః త్రిమూర్తిశ్చ లక్ష్మీనారాయణ స్తథా
షట్చక్రలాంఛితాశ్చైతే హ్యతీవ శుభదస్మృతాః
సప్తమంతు సమాఖ్యాతో నృసింహః సర్వతోముఖః
పట్టాభిరామశ్చ తథా సర్వాభీష్ట ఫలప్రదః
అష్టచక్ర శుభోజ్ఞేయా చక్రపాణి పితామహా
నవచక్రోచ్యతో జ్ఞేయః సర్వపాప హరస్మృతః

సీతారామము, త్రిమూర్తి శ్రీధరము, పురుషోత్తమము, మత్స్యము ఇవి మూడు చక్రములుగల మూర్తులు.

హరిహరము, సీతారామము, జనార్దనము నాలుగు చక్రము గల మూర్తులని చెప్పబడును.

కంసమర్దనము, లక్ష్మీనారాయణము, విశ్వంభరము, పట్టాభిరామము, దత్తాత్రేయము అయిదు చక్రములుగలవిగా యెన్నబడును.

సీతారామము, త్రిమూర్తి, లక్ష్మీనారాయణము ఆరుచక్రములు గలవందురు. ఇవి మిక్కిలి శుభములు.

సర్వతోముఖ నారసింహము, పట్టాభిరామము ఏడు చక్రములు గలవి. ఇవి సర్వాభీష్టము లిచ్చును.

చక్రపాణి, పితామహము అను రెండు ఎనిమిదిచక్రములు గలవి. అచ్యుతము తొమ్మిది చక్రములు గలది. అది సర్వపాపహరము.

*దశచక్రస్తు గోవిందో హ్యానంతో ద్వాదశ స్తథా*
*జనార్దన ముకుందౌచ చక్రద్వాదశ సంయుతౌ*
*త్రయోదశ శ్చక్రధరః చతుర్దశ సుచక్రకః*
*విశ్వంభరశ్చా పి తథా వింశశ్చక్ర సమన్వితః*
*తతః పరమనంతాఖ్యో సర్వకామ ఫలప్రదః*
*పూర్వోక్త చక్రహీనశ్చ బహువక్త్రి సమన్వితః*
*పాతాళ నృసింహోవా బహురూపోఽథవాభవేత్*
*ఏవం లక్షణసంపన్నాః శిలాచక్రాద్యలంకృతాః*
*పూజయేద్యః ప్రతిదినం ముక్తోభవతి నిశ్చయమ్.*

గోవిందము పది చక్రములు గలది. అనంతము, జనార్దనము, ముకుందము పన్నెండు చక్రములు గలవి. చక్రధరము పదమూడు, సుచక్రము పదునాలుగు చక్రములు గలవి. విశ్వంభరము ఇరువది చక్రములు గలది. అంతకు మించి నది అనంత మనబడును. అది అన్ని కోరిక లిచ్చును.

పైజెప్పిన చక్రములు లేక, అనేకమైన ముఖములు గలది పాతాళ నృసింహము లేదా బహురూప మూర్తి యగును.

ఈ చక్రపు గుర్తులతో అలంకరింపబడిన శిల లెవడు ప్రతిదినము పూజించునో వాడు తప్పక ముక్తిజెందును.

-: అథ ద్వారకాశిలాచక్ర లక్షణమ్ :-

ద్వారవత్యా శిలాయాం తదేకచక్రం సుదర్శనమ్
లక్ష్మీనారాయణో జ్ఞేయః చక్రద్వాయ సమన్వితః
త్రిచక్ర మచ్యుతం విద్యాత్ చతుశ్చక్రే జనార్దనః
పంచచక్రో వాసుదేవః షట్చక్రో మీనకేతనః
సంకర్షణ స్తు సప్తచక్రో హ్యష్టాచే త్పురుషో త్తమః
నవక శ్రీధరజ్ఞేయో దశకో దశజన్మవాన్
ఏకాదశానిరుద్ధో ద్వాదశో ద్వాదశాత్మవాన్
త్రయోదశభిశ్చక్రైః యోనరః పరికీర్తితః
ద్వారకాయాః శిలాభేదాః ప్రోక్తః సంక్షేపతః ఖగ ।

ద్వారవతిలో పుట్టిన శిలలందు ఒక చక్రము గలది సుదర్శనము, రెండు గలది లక్ష్మీనారాయణము, మూడుగలది అచ్యుతము, నాలుగు గలది జనార్దనము, అయిదు గలది వాసుదేవము, ఆరుగలది ప్రద్యుమ్నము, ఏడుగలది సంకర్షణము, ఎనిమిదిగలది పురుషోత్తమము, తొమ్మిదిగలది శ్రీధరము, పదిగలది విష్ణువు.

పదకొండు చక్రములు గలది అనిరుద్ధము, పన్నెండు గలది సౌరము, పదమూడు గలది చక్రధరమని చెప్పబడును.

ఓ ఖగేశా! ఈ ద్వారకా శిలాభేదములు నీకు సంక్షేపముగా జెప్పితిని.

-: సాలగ్రామ శిలాపూజన విధిః :-

వాసుదేవో విప్రజనై రుపాస్యః పూజనేసదా
సంకర్షణః క్షత్రియస్య ప్రద్యుమ్నో వైశ్యపూజితః
అనిరుద్ధస్తు శూద్రాణాం పూజ్యః సర్వ వరప్రదః
విప్రాణాం మూర్తయః సర్వాః పూజనీయా ప్రయత్నతః
క్షత్రియస్య త్రయః పూజ్యా వైశ్యస్య ద్వయమేవచ
శూద్రస్యైకం భవేత్తార్క్ష్య సర్వపాపవిముక్తయే
స్వీయవర్ణశిలాపూజ్యా బ్రాహ్మణాద్యైః సుఖాప్తయే.

వాసుదేవమూర్తి యెల్లపుడు విప్రులచే పూజింపదగినది. సర్వపాప విముక్తికై సంకర్షణము క్షత్రియులకు, ప్రద్యుమ్నము వైశ్యులకు, అనిరుద్ధము శూద్రులకు పూజనీయములు.

విప్రులు ప్రయత్నించి సంపాదించి అన్ని మూర్తులను పూజింపవచ్చును. క్షత్రియులు మూడు, వైశ్యులు రెండు, శూద్రుడు ఒకటి మాత్రమే పూజింపవలెను.

సుఖమును గోరువారు తమ వర్ణమునకు విహితమైన శిలనే పూజింపవలెను.

-: అథ పూజాఫలమ్ :-

పూజయిత్వా ఫలం సద్యః ప్రాప్నోతీహ పరత్రచ
సాలగ్రామ శిలాయత్ర నిర్మితా కృత్రిమా భవేత్.
అపితాన్ పూజయేద్భక్త్యా సర్వాన్ కామానవాప్నుయాత్
నప్రతిష్ఠాన సంస్కారో నప్రాయశ్చిత్తమేవచ
నాపరాధశ్చ పూజాయాం విద్యతే వైఖగేశ్వర
సాలగ్రామ శిలాయాంతు యష్టవ్యా సర్వమూర్తయః
మూర్తిబింబేన యష్టవ్యా మన్యాబింబే తథైవచ.

ఈ శిలలను పూజించుటవలన నరు డిహ పరములందు వెంటనే ఫలమును బొందును. సాలగ్రామ శిల లెచట కృత్రిమముగా జేసి పూజింతురో అచట గూడ సకల కోరిక లందవచ్చును.

ఓ ఖగేశ్వరా ! సాలగ్రామ శిలల విషయమున ప్రతిష్ఠ, సంస్కారము, ప్రాయశ్చిత్తము, అపరాధము అను వానిని లెక్కింపరాదు. ఆ శిలయందు సమస్త దేవతామూర్తుల నావాహనము జేసి పూజింపవచ్చును.

చక్రాంకిత శిలావాపి ద్వారకాయాః సముద్భవాః
యఃపూజ్యో దనుదినం సయాతి పరమాంగతిమ్
స్ఫుటితం కృత్రిమం వాపి చక్రాంకిత శిలానవై
సాలగ్రామ శిలామాత్రాత్ పూజయేనాత్ర సంశయః
సాలగ్రామ శిలాయత్ర యత్ర ద్వారవతీశిలా
తులసీయత్ర శంఖశ్చ తత్ర సన్నిహితో హరిః
నియమే నతుయోమర్త్యః సయాతి పరమాం గతిమ్.

ద్వారకయందు పుట్టిన శిలలు చక్రాంకితములైన చాలును. ఎవడు వానిని దినదినము పూజించునో వాడు పరమ పదమునకు బోవును. సాలగ్రామశిల పగిలినను లేదా కృత్రిమముగా జేయబడినను దానికి చక్రముండి అది సాలగ్రామ శిలయైనచాలును, ఏ సందేహములేకుండ పూజింప వచ్చును. ఎచ్చట సాలగ్రామ పర్వతమున బుట్టిన శిల ద్వారకలో బుట్టిన శిల తులసి మరియు శంఖముండునో అచట శ్రీహరి సన్నిహితుడై యుండును. ఎవడు వానిని నియమ ప్రకారముగ పూజించునో అతడు పరమ పదమును బొందును.

-: ఆకార ఫలమ్ :-

*కరాలం కులనాశస్స్యాత్ ద్వికరాల మరిష్టదమ్*
*త్రికరాల కార్యవిఘ్నస్స్యాత్ తిర్యగ్వక్త్రంతు శోకదమ్.*
*అతుష్టిం స్థూలచక్రంచ ఊర్ధ్వ ముచ్చాటనం భవేత్*
*అధోవక్త్రం పార్శ్వవక్త్రం క్షయరోగ విధాయకమ్*
*శిరోవక్త్రం పుత్రహానిః మిత్రఘ్నం బహుచక్రకమ్.*
*అచక్రం సర్వశూన్యం స్యాత్ వక్రచక్రం భయప్రదమ్.*
*పాపదం భిన్నచక్రంచ స్తేయదం భగ్నచక్రమ్*
*విషదం విషయ చక్రంచ బహుచక్రం వినాశనమ్.*

సాలగ్రామ శిలవంకరగలది కులనాశము, రెండు వంకరలది అరిష్టము, మూడు వంకరలది పనులను చెడగొట్టును. వంకర చక్రము గలది శోకమునను పెద్ద చక్రముగలది అసంతుష్టిని, ఊర్ధ్వచక్రము గలది మూల నాశనమును జేయును. క్రింది మొగము గలది క్షయ రోగమును, తలపై మొగము గలది పుత్ర హానిని గలిగించును.

మిక్కిలి చక్రములు గలది మిత్ర నాశనమును,చక్రములు లేనిది పాపమును గలిగించును. భగ్నచక్రము దొంగతనము మోయజేయును. బేసిచక్రములు గలది సంకటమును, బహుచక్రములు గలది వినాశమును గలిగించును.

-: వర్ణఫలమ్ :-

*వివర్ణం కులనాశంచ ధననాశం తథైవచ*
*అంతర్ద్వారం ధూమవర్ణం అతిరక్తం చ శోకదమ్*

*కాపిలం పుత్రనాశం స్యాత్ మధువర్ణంతు మధ్యమమ్*
*మేచకా కీర్తిహాధౌతాం గారవత్సా యశోహరా*
*పాండురూపార్థశమనీ మలినా పాపధీకరీ*
*ఆరవర్ణాం సుతాంహరేత్ ధూమ్రమఖా హరతేమతిమ్*
*రోగప్రదా రక్తవర్ణా సింధురాభా మహాశిలిమ్*
*కపిలా చిత్తవైకల్యాం నేత్రరోగంచ కర్బురా*
*స్వీయవర్ణ శిలాపూజ్యా బ్రాహ్మణాద్యైః సుఖాప్తయే.*

పేలినరంగు కులనాశ ధననాశములను, పొగరంగు లోజ్వరమును, మిక్కిలి ఎఱుపైనది దుఃఖమును. కపిలము పుత్రనాశనమును, తేనెరంగు మధ్యమ ఫలమును కలుగజేయును. నల్లనిది కీర్తిని నిప్పుపలె నార్పును. తెల్లనిది ధననాశము జేయును. మలినవర్ణము పాపబుద్ధిని గలిగించును. ఇత్తడిరంగు పుత్రులను హరించును. నలుపు మించిన ఎఱుపు బుద్ధినాశము జేయును. రక్తవర్ణము గలది రోగమును, సింధూరపురంగు పాపమును, కపిలవర్ణము చిత్తవికలమును, విచిత్ర వర్ణము నేత్రరోగమును గలిగించును.

సుఖముగోరునట్టి బ్రాహ్మణాదులను తమ తమ వర్ణములయుండు శిలలే పూజింపదగినవి.

### -: ఆకార ఫలమ్ :-

*స్ఫుటితం పుత్రహానిస్యాత్ భగ్నోష్ఠం బుద్ధినాశనమ్*
*అస్థాన భంగదం భంగం దుర్దరం క్లేశకారణమ్*
*భయావహం భగ్నశీర్షం అతిస్థూలం ధనాపహమ్*
*అతిహ్రస్వ మపూజార్హాం త్రికోణం బంధునాశనమ్*
*బహురేఖాంకితం దద్యాత్ అసత్యాం రాజసంపది*
*సుకృతఘ్న మచిహ్నంచ స్థాననాశం చలాసనమ్*
*ధనవృద్ధి వినాశంస్యాత్ అర్ధమున్నతి మేవచేత్*
*చిత్తదాహద ముష్ణంచేత్ దగ్ధపాపం రుజంభవేత్.*

పగులు గలది పుత్రహానిని, పెదవి విరిగినది బుద్ధినాశనమును కలిగించును. పగిలినది స్థానభంగము జేయును. దుర్దర్లు గలది కష్టకాలమును దెచ్చును. తల పగిలినది భయము, మిక్కిలి లావైనది ధననాశము, మూడు మూలలు గలది

బంధు నాశము గలిగించును. బహురేఖలు గలది సభలలో అసత్యదోషమును గలిగించును. ఏ గుర్తులు లేనిది పుణ్యనాశము జేయును. చలాసనముగలది స్థాననాశము, సగము ఎత్తయినది ధనవృద్ధి నాశనమును గలిగించును. వేడిగలది మనసును మాడ్చును. దగ్ధపాదముగలది వ్యాధిని గలిగించును.

*ఉద్వేగకారణం రూక్షం ఛిద్రపృష్ఠం తు రోగదమ్*
*పైశునదం బహుచ్ఛిద్రం స్ఫోటమాయుష్య నాశనమ్*
*దారిద్ర్యకారిణీవక్రా సమా సర్వార్థసాధికా*
*స్థూలా నిహ్నంతిచైవాయుః సూక్ష్మ స్వల్పా మతింహరేత్*
*పూజాఫలం లాంఛితం యా నిష్ఫలం పూజనంవినా*
*ఏత త్త్యాజ్యా గుణంహిత్వా గ్రాహ్యామేవ సుపూజయేత్.*

కఠినమైనది ఉద్వేగమును, వీపున రంధ్రముగలది రోగమును, అనేకమైన చిల్లులుగలది విజినతనమును, మిక్కిలి పగుళ్లుగలది ఆయుష్యహానిని గలిగించును. వంకరగలది దారిద్ర్యమును, సమానమైనది అన్ని కోరికలను యిచ్చును. లావుగలది ఆయుషు హరించును. అతి చిన్నది మరియు పలుచనిది మతిని పోగొట్టును. ఏ గుర్తులు లేనిది నిష్ఫలము గనుక చక్ర పద్మాది గుర్తులు గలిగిన వానినే పూజింపవలెను.

పై జెప్పిన త్యాజ్యగుణము గలవానిని వదిలి మంచివాని నెన్నుకొని పూజించుట లెస్స.

## -: సాలగ్రామ పరీక్ష :-

*క్షీరేవా తండులేనాపి సాలగ్రామం నివేశయేత్*
*దృష్ట్వాధిక్యం వయఃకించిత్ గృహీయాత్ బుద్ధిమాన్నరః.*

సాలగ్రామమును పాలలో మంచిగాని బియ్యములో కొంతసేపుంచిగాని అది మొదటికంటె ఏమాత్రమైన బరువెక్కువైన యెడల దానిని పూజించుటకు తగినదిగా బుద్ధిమంతులు గ్రహింతురు.

(సాలగ్రామమును మొదట తూచి పాలలోగాని, బియ్యములోగాని ఉంచి పిమ్మట మరల తూచినచో ఇది తెలియును.)

-: ద్వారమానమ్ :-

*వృత్తసూత్రాష్టమే భాగే ఉత్తమా మధ్యమాఉభౌ*
*భాగత్రయం కనీయశ్చ సాలగ్రామస్య లక్షణమ్.*

సాలగ్రామము యొక్క చుట్టుకొలతలలో దాని ద్వారము యొక్క కొలత ఎనిమిదవ వంతైన యెడల ఉత్తమము, రెండవ వంతైన యెడల మధ్యమము, మూడవ వంతైన యెడల అని కనిష్ఠమని యెరుగవలెను.

(ఈ కొలతను దారముతో కొలిచి గ్రహింపవచ్చును.)

-: గద్యము :-

గ్రంథోయం పాలమూరు మండలాంతర్గత అచ్చంపేట తాలూకాయాం జినుకుంట జనపద నివాసిభిః విశ్వబ్రాహ్మణ వంశ తిలకాయమానైః కపిలవాయి రామయ్య మహోదయైః తాళపత్రేషు సుసంపాదితమ్.

తస్య సుపుత్రః సింగోటమితి తస్యచ రాములు వీరణ్ణ వేంకటాచలమ్ నరసింహులు ఇతి చత్వారః పుత్రాః. తేషు వేంకటాచల సుపుత్రేణ కపిలవాయి లింగమూర్తి నామ్నా గ్రంథోయం పరిష్కృత్య సతాత్పర్యమ్ ప్రకాశితమ్.

## -: అనుబంధమ్ :-

మేరుతంత్రే :- యథాశివోక్తం :-

-: శివాదిభేదాః :-

*సాలగ్రామా మత్స్వరూపాః శృణుతేషాంతు లక్షణమ్*
*యత్సేవనా ద్భవేదిష్ట మిహలోకే పరత్రచ.*

ఏవి కొలుచుట వలన ఇహ పర లోకములందు కోరికలు దీరునో అట్టి సాలగ్రామములు నా యొక్క రూపములు. వాని లక్షణమును చెప్పెదను వినుడు.

-: శివనాభమూర్తి :-

*శివనాభస్స విజ్ఞేయః సలింగా కారతం మతః*
*యవమాత్రంతు గర్తస్యా ద్వ్యావర్ధం లింగముచ్యతే*
*శివనాభి రితిఖ్యాతో త్రిషులోకేషు దుర్లభః*
*స్వయంభూ లింగాకృతిమాన్ మంత్రసిద్ధి విధాయకః.*

శిల శివలింగమువలె నుండి దానిపై యవగింజ ప్రమాణమైన గుంత సగము యవగింజంత లింగము గలది శివనాభ మనబడును.

స్వయంభూ లింగాకృతిగల శిల శివనాభ మనబడును. అది ముల్లోకము లందు దుర్లభము. మంత్రసిద్ధుల నిచ్చును.

:- త్ర్యంబక మూర్తి :-

*త్ర్యంబక స్స తువిజ్ఞేయో బిందూత్తర విభూషితః*
*వ్యూహాకారా యథారేఖా గతపుంస్త్వ ప్రదాయకః.*

ఉత్తర భాగమున బిందువులు మరియు చిక్కు గీతలు గలది త్ర్యంబక మనబడును. అది, పోయిన పుంస్త్వమును మరల నిచ్చును.

-: ధూర్జటి మూర్తి :-

*ధూర్జటిస్సతు విజ్ఞేయో యత్రరేఖా జటానమా*
*త్రిస్రో యత్ర ప్రదృశ్యంతే సోఽర్చితో జ్ఞానదాయకః.*

ఏ శిలకు జడలవంటి మూడు రేఖలు గనిపించునో అది ధూర్జటి యని యెరుగవలెను. దానిని పూజించు వారికి జ్ఞానము నిచ్చును.

-: శంభుమూర్తి :-

*శంభుస్తు పాండురజ్ఞేయో బిందుః కృష్ణస్తు మస్తకే*
*బిల్వప్రమాణ స్తేజస్వీ పూజితః స్త్రీవశంకరః.*

తెల్లనై మారేడు పండంతనుండి మంచి తేజస్సు గలిగి, తలపై తెల్లని చుక్కలు గలది శంభువని యెరుగవలెను. అది స్త్రీ వశీకరము.

:- ఈశ్వరమూర్తి :-

*ఈశ్వరస్సతు విజ్ఞేయో రక్తబిందు స్తు మస్తకే*
*ఏకచక్రో ద్విచక్రోవా భ్యంతరేఽథచ గోష్పదమ్.*

తలపై ఎఱ్ఱని చుక్కలు, లోపల ఒకటిగాని రెండుగాని చక్రములు మరియు గోష్పదము గలిగినది యీశ్వరమనబడును.

### :- మృత్యుంజయమూర్తి :-

*మృత్యుంజయస్స విజ్ఞేయ స్త్వాపమృత్యు వినాశకః*
*అధశ్చక్రం తదూర్ధ్వంచ చ్ఛేతో రేఖా త్రిశూలవాన్.*

అడుగున మరియు లోపలి భాగమున చక్రముపైన త్రిశూల రేఖ గలది మృత్యుంజయ మనబడును. అది అపమృత్యువును తొలగించును.

### :- చంద్రశేఖర మూర్తి :-

*చంద్రశేఖర సామాసా వర్ణచంద్రా కృతి స్తుతే*
*మధ్యే చక్రద్వయం తస్య సేవనాద్రోగ నాశనమ్.*

చంద్రవర్ణము మరియు చంద్రాకారము గలిగి నడిమి భాగమున రెండు చక్రములు గలది చంద్రశేఖర మనబడును. అది సేవించుట వలన రోగ నివారణ మగును.

### -: రుద్రమూర్తి :-

*రుద్రస్సఏవ విజ్ఞేయః కపిలో మూర్ధ్ని లక్షితః*
*చక్రమధ్యే భవేద్రేఖా మారయేద్రిపు సంతతిమ్.*

కపిలమైన తల మరియు చక్రము నడుమ రేఖలు గలది రుద్రుని యెరుగవలెను. అది శత్రు సంతతిని నాశము జేయును.

### -: అథ శక్తిభేదాః :-

*సాలగ్రామా నథో వక్ష్యే శక్తికిట సుసంగవాన్*
*ఏషాం పూజనతో దేవీ భవానీ సుప్రసీదతి.*

ఈ క్రింద జెప్పబడు సాలగ్రామములు శక్తి చిహ్నము గలవి. అవి పూజించుట వలన భవానీదేవి సంతసించును.

### -: త్రైవిద్యామూర్తి :-

*త్రైవిద్యా సాతలేచక్ర మూర్ధ్వేచక్రం ప్రదృశ్యతే*
*బాహ్యే ఘంటాంకితో మూర్ధా స్నిగ్ధశ్యామాఖిలేష్టదా*

నల్లగా నుండి నునుపై అడుగున మరియు తలపై చక్రము గలిగి తల పైని మరియు వెలుపల గంట గుర్తులు గలది "త్రైవిద్య" యనబడును. అది సమస్తమైన కోరికలిచ్చును.

### -: మహాకాళీమూర్తి :-

*మహాకాళీతు సాజ్ఞేయా యోనిచిహ్నా సమన్వితా*
*ద్విఛిద్రాధ్యా సర్వాశిలా త్రికోణేనాంకితాచ యా*

త్రికోణాకారముగలిగి రెండు రంధ్రములతోగూడి యోని చిహ్నముగల శిల మహాకాళియని యెరుగవలెను.

*యథాయుధాకృతిశ్చోర్ధ్వం దేవీం తత్ర నిర్దిశేత్*
*దేవీశిలా సచక్రాయా దక్షమార్గేణ తాంయజేత్*
*సార్చితా వామమార్గేణ లోకద్వాయ సుఖావహా*
*యాచక్ర రహితాదేవీ శిలాంతాం వామతోర్చయేత్.*

పైభాగమున ఆయుధాకృతి మరియు చక్రముతోగూడిన దేవీశిలను దక్షిణ మార్గమున పూజింపవలెను.

చక్ర రహితమైన దేవీశిలను వామమార్గమున పూజింపవలెను. అటుల పూజించిన యెడల అది యిహ పరములలో సుఖము నిచ్చును.

### -: అథ గణపతిమూర్తి లక్షణమ్ :-

*గణేశస్సతు విజ్ఞేయః స్వల్ప శుండాంకితో భవేత్*
*శుండాకార శిలావాపి గజానన సమావివా*
*యస్యామధ్యే మహచ్చక్రం సూక్ష్మచక్రంచ యద్దిశి*
*సాశిలా తస్యాదిక్పత్యే సేవ్యా తద్దిశిరాజ్యతా॥*

ఏనుగు తలవలెగాని లేక తొండమువలెగాని యుండునది లేక చిన్న తొండముగలది గణేశ మూర్తియని యెరుగవలెను.

నడుమ ఒక పెద్ద చక్రము దాని ప్రక్కన ఒక చిన్న చక్రముగల శిలను పూజించిన యెడల పెద్ద చక్రమునకు చిన్న చక్రమేవైపున నుండునో అది ఆ దిక్కునందలి రాజ్యము నతనికి గలిగించును.

-: అథ నవగ్రహమూర్తిలక్షణాని :-

*సౌరీశిలా దుర్లభైవ ప్రాయః కలియుగే పునః*
*స్ఫటికాభా భవేత్ సాతు ధర్మం నిత్యం వినుంచతి*
*ఊర్ధ్వే చంద్రాకృతి ర్యత్ర దృశ్యతే శకలద్వయమ్*
*సాతు చంద్రశిలాత్ర్యస్ర యుక్తాభౌమ శిలామతా*
*బాణాసనేన చిహ్నేన జ్ఞేయా బుధశిలా సురాః*
*దీర్ఘేణ చతురస్రేణ యుక్తా గురుశిలా మతా*
*పంచకోణాతు శుక్రస్య చాపాకార శనేర్మతా*
*సర్పాకారాతు రాహోస్స్యాత్ కేతుస్తు ధ్వజరూపిణీ ॥*

కలియుగమున సూర్యశిల తఱుచుగా దుర్లభము. అది స్ఫటికమువలెనుండి ఆర్చకుల కెల్లపుడు ధర్మబుద్ధిని గలిగించును.

పైభాగమున చంద్రునివలెనుండి రెండు శకలములు గనిపించిన యెడల అది చంద్రశిల యగును.

త్రిభుజాకారము గలది అంగారక శిల యనబడును.

బాణాకారము గలది బుధశిల. దీర్ఘచతురస్రమైనది బృహస్పతి మూర్తి యగును.

అయిదు మొగములు గలది శుక్రశిల, విల్లువలె నుండునది శనిమూర్తి యందురు.

పామువలె నుండునది రాహుశిల, జెండావలె నుండునది కేతుశిల యని చెప్పబడును.

-: అర్చనా నిర్ణయమ్ :-

*గృహేలింగ ద్వయంనార్చ్యం సాలగ్రామ ద్వయంతథా*
*ద్వేచక్రే ద్వారకాయాస్తు నార్చ్యం సూర్యద్వయం తథా*
*శక్తి త్రయం తథానార్చ్యం గణేశ త్రయ మేవచ*
*ద్వౌశంఖం నార్చయేచ్చైవ భగ్నాంచ ప్రతిమా తథా*
*నార్చయేచ్చ తథామత్స్య కూర్మాది దశకంతథా*

ఒకే ఇంటిలో రెండు శివలింగములు రెండు సాలగ్రామములు, రెండు చక్రములుగల ద్వారకాశిలలు, రెండు సూర్యమూర్తులు, రెండు శంఖములు పూజించరాదు. అటులే ఇంటిలో మూడు శక్తిప్రతిమలను, మూడు గణపతిమూర్తులను, మత్స్యకూర్మాది అవతారదశకమును గూడ పూజించరాదు.

*గృహేగ్నిదగ్ధా భగ్నాశ్చ నార్చ్యాః పూజ్యా వసుంధరే*
*ఏతాసాం పూజనాన్నిత్య ముద్వేగం ప్రాప్నుయాన్నహి*
*బ్రాహ్మణః క్షత్రియోవైశ్య శూద్రశ్చ పృథివీపతే*
*స్వధర్మ తత్పరోవిష్ణు మారాధయతి నాన్యథా*
*సర్వవర్ణ్ణస్తు సంపూజ్యాః ప్రతిమా స్సర్వదేవతాః.*

ఓ భూదేవీ! ఇంటిలో విరిగిన, కాలిన, మరియు పగిలిన ప్రతిమలు పూజింపరాదు. అటుల జేసినచో యింటివారెప్పు డుద్వేగమును బొందుదురు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు ఎవరైననుసరే స్వధర్మతత్పరులు విష్ణువునే పూజింపవలెను. ఇతరమును పూజింపరాదు.

అన్ని దేవతా ప్రతిమలను అన్ని వర్ణములవారు పూజింపవచ్చును.

*లింగాన్యపితు పూజ్యాని మణిభిః కల్పితానిచేత్*
*తయో రసంభవేర్చ్యావై సాచేహ నవధాస్మృతాః*
*రత్నజా హేమజాచైవ రాజతీ తామ్రజా స్తథా*
*రైతిక్యార్చ్య తథాతాహీ శైలజా ద్రుమజా స్తథా*
*అధమాధమాచ విజ్ఞేయా మృణ్మయా ప్రతిమాచయా.*

లింగములను మాత్రము మణులతో జేసినవి మాత్రమే పూజింపవలెను. అవి దొరకనపుడు తొమ్మిది విధములైనవి పూజార్హముగా జెప్పబడినవి. రత్నము, బంగారము, వెండి, రాగి, ఇత్తడి, ఇనుము, రాయి, కఱ్ఱ అను వానిలో జేసినవి పూజింపవచ్చును. మట్టివి మాత్రము అన్నిటికంటె హీనమని యెరుగవలెను.

*నార్చ్యా గృహేశ్మజామూర్తి శ్చతురంగుళ తోధికా*
*నవితస్త్యధికాధాతు సంభవా శ్రేయయిచ్ఛతా*
*ఏతల్లక్షణ సంపన్నా పారంపర్య క్రమాగతా*
*ఉత్తమా సాతువిజ్ఞేయా గురుదత్తాపి తత్సమా*
*క్రయక్రీతా పరిజ్ఞేయా మధ్యమా యాచితాధమా,*

శ్రేయముగోరు వారింటిలో నాలుగంగుళములకు మించిన శిలామూర్తిని జేనకుమించిన లోహమూర్తిని పూజింపరాదు.

పూజకుదగిన లక్షణములుగల మూర్తులు వంశపరంపరగా వచ్చినవి ఉత్తమమని యెరుగవలెను. గురువులచే అనుగ్రహింపబడినవి గూడా అట్టివే యగును. కొనబడినది లేదా అమ్మినది మధ్యమము. విచ్ఛముగా అడిగి తీసికొనినది అధమమని యెరుగవలెను.

-: సాలగ్రామ పూజానిర్ణయమ్ :-

సాలగ్రామ స్సమాఃపూజ్యా సమేషు ద్వితయంనహి
విషయా నైవపూజ్యాస్తు విషమేష్వేక ఏవహి
చక్రాంక మిథునంపూజ్యం నైకచక్రాంక మర్చయేత్
చక్రాంక మిథునాత్పూర్ణం సాలగ్రామం ప్రపూజయేత్
తత్రాప్యమలకేతుల్యా పూజ్యా సూక్ష్మైవయా భవేత్
యథాయథా శిలాసూక్ష్మం తథాస్యాత్తు మహాఫలమ్.
సాలగ్రామ శిలాభగ్నా పూజనీయా సచక్రికా
ఖండితా స్ఫుటితావాపి సాలగ్రామ శిలాశుభా
యఃపునః పూజయేద్భక్త్యా సాలగ్రామ శిలాశతమ్
తత్ఫలం నైవశక్తోఽహం వక్తుం వర్షశతైరపి.

సాలగ్రామములను సరిసంఖ్యలో పూజింపవలెను గాని సరిలో రెండింటిని మాత్రము పూజింపరాదు. బేసి సంఖ్యలో పూజింపరాదుగాని బేసిలో ఒక్కటి పూజించుట దోషముగాదు.

సాలగ్రామ శిలలలో రెండు చక్రములుగల శిలను పూజింపవలెను. ఒంటి చక్రము గలది పూజింపరాదు. ద్వారకాశిల రెండు చక్రములు గలది పూజింపరాదు. దానితోబాటు సాలగ్రామ శిలను పూజించిన దోషము లేదు.

సాలగ్రామమును చిన్నగా ఉసిరికపండంతగల దానిని పూజింపవలెను. శిల ఎంతెంత చిన్నదైన ఫలమంతంత అధికముగా నుండును. అది విరిగినను పగిలినను చక్రముతో నున్నచో శుభమైనదే యగును. ఎవడు సాలగ్రామ శిలలను నూరిటిని పూజించునో వాని పుణ్యము నేను నూరేండ్లకైనను చెప్పజాలను.

సాలగ్రామ శిలాంవాపి చక్రాంకిత శిలాంతథా
బ్రాహ్మణః పూజయేన్నిత్యం క్షత్రియాది ర్నపూజయేత్
శూద్రోవా నుపనీతోవా స్త్రీయోవా పతితోపివా
కేశవంవా శివంవాపి స్పృష్ట్వా నరకమశ్నుతే
బ్రహ్మణ్యాప హరంవిష్ణుం నస్పృశేత్ శ్రేయయిచ్ఛతి
సనాథా మృతనాథావా తస్యానాస్తీహ నిష్కృతిః.

చక్రములతో గూడిన సాలగ్రామ శిలను బ్రాహ్మణుడు నిత్యము పూజింప వలెనుగాని క్షత్రియుడు పూజింపరాదు.

శూద్రుడు, ఉపనయనము గానివాడు, పతితుడు మరియు స్త్రీలు, సాలగ్రామములలో శివమూర్తినిగాని కేశవమూర్తిగాని తాకరాదు. తాకినచో నరకమును బొందుదురు. బ్రాహ్మణుడు గూడ శ్రేయమును గోరినచో వానిని తాకరాదు. ముత్తయిదువలుగాని విధవలుగాని తాకినయెడల ఆ పాపమునకు నిష్కృతి లేదు.

స్త్రీణా మనుపనీతానాం శూద్రాణాంచ జనేశ్వర
స్పర్శనే నాధికాధికారో స్తి విష్ణుర్వా శంకరస్యవేత్
సాలగ్రామం నస్పృశేత్తు హీనవర్ణో వసుంధరే
స్త్రీశూద్ర కరసంస్పర్శో వజ్ర స్పర్శాధికో మతః
మోహాద్యా నంస్పృశే చ్ఛూద్రో యోషిర్వాపి కదాచన
స్వపతే నరకే ఘోరే యావదాభూత సంప్లవమ్
యదిభక్తి ర్భవేత్తస్య స్త్రీణాంవాపి వసుంధరే
దూరాదేవ స్పృశన్ పూజాం కారయేత్సు సమాహితమ్.

ఓ రాజా! స్త్రీలకు, అనుపనీతులకు, శూద్రులకు విష్ణువునుగాని, శంకరునిగాని తాకు నధికారము లేదు. హీనవర్ణులు దానిని తాకరాదు. వారి స్పర్శ పిడుగుపాటునకంటెను గొప్పదని చెప్పుదురు. ఒకవేళ నిర్లక్ష్యమున శూద్రులుగాని స్త్రీలుగాని వానిని ముట్టిన యెడల ప్రళయము వరకు నరకమున బడుదురు.

ఓ భూదేవీ! ఒకవేళ వారికి భక్తియున్నయెడల దానినంటకుండ దూరము నుండియే పూజాదికమును నిర్వహింపవలెను.

## -: సాలగ్రామ మాహాత్మ్యమ్ :-

*సాలగ్రామ శిలాయత్ర తత్ర సన్నిహితోహరిః*
*తత్రైవ లక్ష్మీర్వసతి సర్వతీర్థ సమన్వితా*
*యానికానిచ పాపాని బహుజన్మ కృతానిచ*
*తానిసర్వాణి నశ్యంతి సాలగ్రామ శిలార్చనాత్.*

సాలగ్రామ శిల యెచ్చటనుండునో అచట శ్రీహరి సన్నిహితుడై యుండును. మరియు అచటనే శ్రీ మహాలక్ష్మి అన్ని తీర్థములతో గూడి యుండును. అనేక జన్మములలో జేసిన పాపము లేవేవిగలవో అవి యన్నియు సాలగ్రామ పూజవలన నశించును.

*సాలగ్రామాశ్చ సాన్నిధ్యాత్ ప్రశస్తం తచ్ఛవేదితి*
*సస్నాతః సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షితః*
*సర్వయజ్ఞేషు తీర్థేషు వ్రతేషుచ తపస్సుచ*
*పాఠే చతుర్ణాం వేదానాం తపసాం కరణేసతి*
*తత్పుణ్యం లభతేనూనం సాలగ్రామ శిలార్చనాత్.*

సాలగ్రామ సన్నిధివలన నరుడు ప్రశస్తుడగును. దానిచే అతడన్ని తీర్థములందు స్నానము జేసినవాడు, అన్ని యజ్ఞములకు దీక్ష తీసికొనిన వాడగును. అన్ని తపములుజేసినవాడగును. నాలుగు వేదములు జదివినను తపములు జేసినను కలుగు పుణ్యము సాలగ్రామ పూజకంటె తక్కువదే యగును.

*సాలగ్రామ శిలాతోయై యోభిషేకం సదాచరేత్*
*సర్వదానేషు యత్పుణ్యం ప్రదక్షిణం భువోయథా*
*సాలగ్రామ శిలాతోయం నిత్యం భుంక్తేన యోనరః*
*సురేప్సితం ప్రసాదంచ లభతే నాత్రసంశయః*
*యస్యా స్పర్శంచ వాంఛంతి తీర్థాని నిఖిలానిచ*
*జీవన్ముక్తో మహాపూతోఽ వ్యంతేయాతి హరేఃపదమ్*
*తత్రైవ హరిణాసార్థ మసంఖ్యం ప్రాకృతాలయమ్*
*యస్యాత్త్యేవహి దాస్యేచ నియుక్తో దాస్యకర్మణి*
*యానికానిచ పాపాని బ్రహ్మహత్యా సమానిచ*

తంద్రుష్ట్వాచ పలాయంతే వైనతేయాది వోరగః
తత్పాద రజసాదేవి సద్యఃపూతా వసుంధరా.

సాలగ్రామ శిల నెవడెల్లపు డభిషేకము జేయునో, వాడన్ని దానములు జేసిన పుణ్యమును మరియు భూప్రదక్షిణ పుణ్యమును బొందును. ఎవడు సాలగ్రామాభిషేక జలము దినదినము గ్రోలునో అతనికి దేవతల యొక్క దయ మరియు ప్రసాదము కలుగును. దీనిలో సందేహము లేదు. అతడు జీవన్ముక్తుడు, మరియు మిక్కిలి పూతుడై అంత్యమున శ్రీహరి పదమును బొందును. అచటనే శ్రీహరి సేవలో నియోగింపబడి అనేక సంవత్సరము లుండును. అతనిని సమస్త తీర్థములు స్పృశింపగోరును. బ్రహ్మహత్య మున్నగు నే యే పాపము లున్నవో అవి యన్ని యతనిని జూడగనే గరుడుని జూచిన సర్పములవలె పరుగెత్తును. ఓ దేవీ! అతని పాదధూళిచే భూమి సద్యః పవిత్ర మగును.

పుంసాంలక్ష్యం తత్పిత్రాణాం నిస్తరే తస్యాజన్మతః
సాలగ్రామ శిలాతోయం మృత్యుకాలేచ యోలభేత్
సర్వపాప వినిర్ముక్తో విష్ణులోకం సగచ్ఛతి
నిర్వాణ ముక్తింలభతే కర్మభోగాత్ ప్రముచ్యతే
విష్ణోపదే ప్రలీనశ్చ భవిష్యతి నసంశయః.

అట్టి పురుషుని జూచి వాని జన్మచేత అతని పితృదేవతలు తరింతురు. ఎవనికి మరణకాలమున సాలగ్రామ జలము లభించునో వాడు సమస్త పాపములు పోగొట్టుకొని విష్ణులోకమును పొందును. అతనికి కర్మ భోగములు విడిపోవును. నిర్వాణమను ముక్తి లభించును. ముందు ముందు విష్ణుపదమున లీనుడగును. దీనికి సందేహము లేదు.

సాలగ్రామ శిలాంధృత్వా స్వీకారం యోనపాలయేత్
సప్రయా త్యసిపత్రంచ లక్ష మన్వంతరావధి
నయాతి కుంభీపాకేచ, యావద్విప్రో బ్రాహ్మణోవయః
తులసీ పత్రవిచ్ఛేదం సాలగ్రామే కరోతియః
తస్య జన్మాంతరే కాంతే స్త్రీవిచ్ఛేదో భవిష్యతి
సాలగ్రామంచ తులసీం శంఖం యోహికరోతిచ

భార్యాహీనో భవేత్ సోపి రోగీచ సప్తజన్మసు
సాలగ్రామంచ తులసీం శంఖంచైకత్ర ఏవచ
యోరక్షతి మహాజ్ఞానీ సభవేత్ శ్రీహరిప్రియః.

సాలగ్రామమును ధరించి ఎవడు దాని నియమమును పాలించడో అతడు లక్షమన్వంతరముల కాలము అసిపత్రవనమున పయనించును. బ్రహ్మదేవుడు బ్రతికినంతకాలము కుంభీపాక నరకమున నుండును.

ఎవడు సాలగ్రామమును తులసియాకంత పగులగొట్టునో వాడు మరు జన్మమున స్త్రీ యెడబాటును బొందును. సాలగ్రామమును, తులసిని, శంఖమును ఎవడు వేరు జేయునో వాడు ముందు జన్మమున భార్యాహీనుడగును. మరియు ఏడు జన్మలలో రోగియై బాధపడును. ఎవడు సాలగ్రామమును, తులసిని, శంఖ మును ఒకచోట నుంచి రక్షించునో వాడే మహాజ్ఞాని. అతడు భగవంతునికి ప్రియుడగును.

అభక్ష్యం శివనిర్మాల్యం పత్రంపుష్పం ఫలంజలమ్
సాలగ్రామ శిలాస్పర్శాత్ పావనం తత్ భవేత్ సదా
దద్యాత్ భక్త్యాయయోదేవి సాలగ్రామ శిలానరః
సువర్ణ సహితంపృథ్వీం సపర్వత వనాన్వితా
ససముద్రా భవేద్దత్తా న త్వాత్రేచ వసుంధరే
సాలగ్రామ శిలాయాస్తు మూల్యముద్ఘాటయేత్ క్వచిత్
విక్రేతా క్రయకర్తావా నరకేపై పతేత్ ధృవమ్
సాలగ్రామే హరిర్మూర్తిః జగన్నాథశ్చ భారతమ్
కలే దశసహస్రాంతే యాతిత్యక్త్వా హరేఃపదమ్
సాలగ్రామ శిలారూపీ యత్రతిష్ఠతి కేశవ
తత్ర దేవాసురాయత్తా భువనాని చతుర్దశ
సాలగ్రామ స్యావరేవా నావాహన విసర్జనే.

తినరానట్టి శివనిర్మాల్యమైన పత్రముగాని పుష్పముగాని ఫలముగాని జలముగాని సాలగ్రామ శిలాస్పర్శనచే అవి ఎల్లప్పటికొఅకు పవిత్రములగును. ఓ దేవీ! ఎవడు భక్తులకు సాలగ్రామ దానముజేయునో వాడు లోకమున బంగార ముతో గూడ పర్వతములు, వనములు, సముద్రములు గల భూమినంతను దానము జేసిన ఫలమును బొందును.

సాలగ్రామమున కెవడు వెలగట్టునో, ఎవడు అమ్మునో లేదా కొనునో వాడు తప్పక నరకమున బడును.

భారతదేశమున సాలగ్రామమందు శ్రీహరి కలియుగము పదివేలు గడుచు వరకు నిలుచును. ఆపైన దానిని విడిచి తన నివాసమున కేగును.

(కలియుగము క్రీ. శ. 1984 నాటికి 5085 ఏండ్లు గడిచి పోయినది కనుక ఇంకను 4015 సంవత్సరముల వరకు మనము సాలగ్రామమును పూజింప వచ్చును.)

సాలగ్రామ రూపమైన కేశవుడెచట నుండునో అచటికి పదునాలుగు లోకములలోని దేవతలు వత్తురు. (కావున) సాలగ్రామమును ఆవాహన విసర్జనములు లేకుండగనే పూజింప వచ్చును.

*సాలగ్రామ మయీముద్రా సుస్థితా యత్ర కుత్రచిత్*
*వారణాస్యా యవాధిక్యం సమంతాత్ యోజన త్రయమ్*
*యో మృత స్తత్సమీపేతు మృతోవా నీయతేంతికమ్*
*సవై మోక్షమవాప్నోతి సత్యం సత్యం నచాన్యథా*
*మ్లేచ్ఛదేశే శుచౌవాపి చక్రాంకో యత్రతిష్ఠతి*
*యోజనానాం తథా త్రీణి మమక్షేత్రం వసుంధరే :*

సాలగ్రామ మయమైన ముద్ర యెచ్చటనుండునో ఆ ప్రదేశము మూడు యోజనములవరకు కాశికంటె యవగింజంత యెక్కువగా భావింపబడును. ఎవడు సాలగ్రామ సమీపమున మరణించునో లేక మరణించి దాని సమీపమునకు తేబడునో వాడు తప్పక మోక్షమును పొందును. ఇది నిజము, ముమ్మాటికి నిజము.

ఓ భూదేవీ! ఎచట చక్రాంతమైన సాలగ్రామ ముండునో అది మ్లేచ్ఛుల గల దేశమైనను శుచిగలదే యగును. అది మూడు యోజనముల వరకు నాక్షేత్రముగ భావింపబడును.

## -: అథ తులసీదేవి చరిత్రమ్ :-

*దేవీభాగవతే నారాయణ నారద సంవాదమ్:*

తులసీదేవికథ దేవీభాగవతమున ఇరువది నాలవ అధ్యాయమున నున్నది. భగవంతుడైన శ్రీమహావిష్ణువు సాలగ్రామ రూపము ధరించుటకు తులసీదేవి యొక్క శాపము కారణము గాన ఆ కథ నిట అవసరమైనంత వరకు ఉదాహరింతును.

తులసీదేవి ఒక విప్రకన్య ఆమెపేరును గురించి యిటుల చెప్పబడినది.

*పీతచంపక వర్ణాభా సుందరీష్వేవ సుందరీ*
*నరానార్యాశ్చ తాందృష్ట్వా తులనాం దాతుమక్షమః* 12
*తేననామ్నాచ తులసీ తాంవదంతి మనీషిణః*
*సాచ భూయిష్టమానేద యోగ్యాస్త్రీ ప్రకృతిర్యథా.* 13
*దేవీ - అ. 17*

ఆమె పచ్చనై సంపెంగ కాంతితో సుందరులలోనెల్ల సుందరియై యుండెను. ఆమెను జూచిన స్త్రీపురుషు లామెకు సాటిలేదనుచుండిరి. అందువలన ఆమెను పండితులు "తులసి" యని పిలిచిరి. ఆమె యోగ్యమైన ప్రకృతి గుణము లతో నిండియుండెను.

ఈమెను శంఖచూడుడను దానవుడు వివాహమాడెను. అతనికి జలంధరు డని మరియొక పేరు. అతడు దేవతలను బాధించు చుండెను. తులసీదేవియొక్క పాతివ్రత్య మహిమచే వానికి చావు లేకుండెను. అపుడు విష్ణువామెను పతిరూపమున సమీపించి శీలచ్యుతురాలిని జేసెను. పిమ్మట నతనిని యుద్ధమున శంకరుడు జంపెను.

ఆ శంఖచూడుని అస్థులనుండియే శంఖములు జనించినవి. వాని మాహాత్మ్య మిటుల జెప్పబడినది.

*అస్థిభిః శంఖచూడస్య శంఖజాతి బభూవహ* 23
*నానాప్రకార రూపేణ శశ్వత్పూజా సురార్చనే*
*ప్రశస్తం శంఖతోయంచ దేవానాం ప్రీతిదంపరమ్* 24
*తీర్థతోయ స్వరూపంచ పవిత్రం శంభునావినా*
*శంఖశబ్దో భవేద్యత్ర తత్రలక్ష్మీః సుసంస్థితా* 25

*సుస్నాతః సర్వతీర్థేషు యఃస్నాతః శంఖవారిణా*
*శంఖో హరేరధిష్ఠానం యత్రశంఖ స్తతోహరిః* 26
*తత్రైవ వసతేలక్ష్మీర్దూరీభూత మమంగళమ్.*
*స్త్రీణాం శంఖధ్వనిభిః శూద్రాణాంచ విశేషతః* 27
*భీతా రుష్టా యాతిలక్ష్మీ తత్స్థలా దన్యాదేశతః.* -దేవీ-భా.అ. 23

శంఖచూడుడునియొక్క యెముకలనుండి నానాప్రకారములైన శంఖ జాతులు బుట్టినవి. అవి ఎల్లపుడు పవిత్రమైనవి మరియు దేవపూజకు ప్రశస్త మైనవి. శంఖముయొక్క జలము శివునకుదప్ప దేవతలందరికి మిక్కిలి ప్రియము మరియు పవిత్రమైనది.

ఎచట శంఖధ్వని యగుచుండునో అచట లక్ష్మి చక్కగా నిలిచి యుండును. ఎవడు శంఖజలముచే స్నానముజేయునో అతడు సర్వతీర్థములలో స్నానము జేసిన వాడగును.

శంఖము శ్రీహరికధిష్ఠానము గనుక ఎచట నదియుండునో అచట శ్రీహరి యుండును. అచటనే లక్ష్మీదేవి యుండి అమంగళములను దూరము జేయును. స్త్రీలయొక్క మరియు విశేషించి శూద్రులయుక్క శంఖధ్వనిచేత లక్ష్మీదేవి భయము జెందును. ఆమె కోపించి ఆచోటు విడిచి యితర ప్రదేశములకు వెళ్లును.

(కావున స్త్రీలు శూద్రులు శంఖమును పూరింపరాదు.)

శివుడు శంఖచూడుని జంపి తనలోకమునకు వెళ్లిన పిమ్మట జరిగిన మోసము దెలిసి తులసీదేవి శ్రీహరినిట్లు నిందించెను:

**-: తులస్యువాచ :-**

*ఛలేన ధర్మభంగేన మమస్వామి త్వయాహతః*
*పాషాణ హృదయ స్త్వంహి దయాహీనో యతఃప్రభో* 24
*తస్మాత్ పాషాణరూపత్వం భవేదేవ భవాధునా*
*ఎవదంతిచ సాధుత్వాం తే భ్రాంతాహి నసంశయః* 25
*భక్తో వినాపరాధేన పరార్థేచ కథంహతః*
*భృశం రురోధ శోకార్త విలలాప ముహుర్ముహుః.* 26

మోసమున మరియు అధర్మమున నా స్వామి నీచే జంపబడెను. ఓ ప్రభూ! నీవు దయాహీనుడవు మరియు నింతపాషాణహృదయుడ వెటులైతివో అటులే యిపుడు పాషాణరూపుడవు గమ్ము. ఎవరు నిన్ను సాధువని యందురో వారు నిజముగా భ్రాంతి జెందినవారు. ఏ యపరాధము లేకుండ పరులకై నీకుభక్తుడైన వానినెటుల జంపితివి? అని ఆమె మిక్కిలి దీనముగా భర్తను దలచుకొని మరల మరల విలపించెను.

*తతశ్చ కారణంద్రుష్ట్వా కరుణా రససాగరః*
*నయేనతాం బోధయితుం ఉవాచ కమలాపతిః* 27
*తవ స్త్వయా కృతంభద్రే మదర్థే భారతం చిరమ్*
*త్వదర్థం శంఖచూడశ్చ చకార సుచిరంతపః* 28
*కృత్వా తాంకామినీం సోపి విజహారచ తత్క్షణాత్*
*అధునా దాతుముచితం తవైవ తపసఃఫలమ్* 29
*ఇదం శరీరం త్యక్త్వాచ దివ్యదేహం విధాయచ*
*రామే రమమయాసార్థం త్వంరమాణ సదృశీభవ* 30
*ఇయం తను ర్నదీరూపా గండకీ తీచ విశ్రుతా*
*పూతా సుపుణ్యదా నృాణాం పుణ్యోభవతు భారతే.* 31

అపుడా శోక కారణ మెరిగి దయాసముద్రుడైన కమలాపతి ఆమె నోదార్చుట కిట్లనెను.

ఓ భద్రా! నాకొఱకు నీవు భారతవర్షమున చిరకాలము తపము జేసితివి. నీ కొఱకటులే శంఖచూడుడు చాలాకాలము తపము జేసెను.

నీవు స్త్రీవైనప్పటికి తపము జేయుటవలన నీయొక్క ఆ తపమునకు ఫలమీయ వలసియున్నది. కనుక ఓ రామా నీవీశరీరము విడిచి దివ్యదేహమును ధరించి నాతోపాటు లక్ష్మీదేవివలెనే క్రీడింపగలవు. ఈయొక్క నీ శరీరము భారత వర్షమున నరులకొఱకు పూతమై పుణ్యమిచ్చునట్టి "గండకి" అను నదిగా నగును.

*తవ కేశ సమూహశ్చ పుణ్యావృక్షో భవిష్యతి*
*తులసీ కేశసంభూతా తులసీతిచ విశ్రుతా*
*త్రిషులోకేషు పుష్పాణాం పత్రాణాం దేవపూజనే*

ప్రధానరూపా తులసీ భవిష్యతి వరాననే
స్వర్గే మర్త్యే చ పాతాళే గోలోకే మమసన్నిధౌ
భవత్వం తులసీవృక్ష వరాపుష్పేషు సుందరీ
గోలోకే విరజాతీరే రాసే బృందావనే వనే
భాండీరే చంపకవనే రమ్యే చందనకాననే
మాధవీ కేతకీ కుంద మల్లికా మాలతీ వనే
వాసస్తేఽత్రైవభవతు పుణ్యస్థానేషు పుణ్యతః.

నీయొక్క వెంట్రుకలనుండి పుణ్యవృక్షములు పుట్టగలవు. తులసివైన నీయొక్క వెంట్రుకలచే బుట్టుటచే యవి తులసి యనబడును. ఓ వరాననా! ముల్లోకములందు దేవపూజయొక్క పుష్పములందు పత్రియందు ఆ యొక్క తులసి ప్రధానమైన దగును.

ఓ సుందరీ! స్వర్గలోకమున మనుష్యలోకమున పాతాళలోకమున గోలోకమున మరియు నా సన్నిధియందు నీవు తులసీ వృక్షమవు గమ్ము. గోలోకమున విరజాతీరమున, రాసమున బృందావనమున, భాండీరమున చంపక వనమున, చందన వనమున, మల్లె, మొగిలి, మొల్ల,విరజాజి, మరియు జాజివనము లందు, ఇంకను ఇక్కడగూడ పుణ్యస్థానములలో నీవు పుణ్యురాలివై యుండ గలవు.

-: తులసీ మాహాత్మ్యమ్ :-

తులసీ తరుమూలేషు పుణ్యగేహేషు పుణ్యదమ్
అధిష్ఠానంచ తీర్థానాం సర్వేషాంచ భవిష్యతి. 37
తత్రాచ సర్వదేవానాం మమాధిష్ఠాన మేవచ
తులసీ పత్రపతన ప్రాప్త్యేచ వరాననే 38
సుస్నాతః సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దీక్షితః
తులసీ పత్రతోయేన యోభిషేకం సమాచరేత్ 39
సుధాఘట సహస్రాణాం యాతుష్టిస్తు భవేత్ హరేః
సాచతుష్టి భవేన్నూనం, తులసీపత్ర దానతః 40

*గవామయుత దానేన యత్ఫలం తత్ఫలం భవేత్*
*తులసీ పత్రదానేన తత్ఫలం కార్తికేసతి* **41**
*తులసీ పత్రతోయంచ మృత్యుకాలేచ యోలభేత్*
*ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకే మహీయతే.* **42**

తులసీ వృక్ష మూలమున పుణ్య గృహములందు, పుణ్యము నిచ్చు సర్వ తీర్థము లుండగలవు. అచట సమస్తమైన దేవత లుండగలరు. ఓ వరాననా! తులసీ దళము వేసిన నీటిలో స్నానమాడిన యెడల వాడు సర్వతీర్థములందు స్నాన మాడినవాడు, అన్ని యజ్ఞదీక్షలు పొందిన వానితో సమానుడగును. ఎవడు తులసీ పత్ర జలముతో శ్రీహరి నభిషేకము జేయునో ఆ తృప్తి యతనికి వేయి అమృతపు కడవలతో జేసినట్లుగా నుండును.

ఎవడు కార్తీక మాసమున తులసీ పత్రదానము జేయునో వాని కంటే వేయి గోదానములు జేసిన వాని ఫలముగూడ కొంత తక్కువగనే యుండును. ఎవనికి మరణ కాలమున తులసీ జలము లభించునో వాడు సర్వపాపములు తొలగి విష్ణు లోకమును బొందును.

*నిత్యం యః తులసీతోయం భుంక్తేభక్త్యాచ మానవః*
*లక్షాశ్వ మేధజం పుణ్యం సంప్రాప్నోతి సమానవః* **43**
*తులసీం స్వకరేకృత్వా ధృత్వాదేహేచ మానవః*
*ప్రాణాన్ త్యజతితీర్థేషు విష్ణులోకం సగచ్ఛతి* **44**
*తులసీ కాష్ఠనిర్మాణ మాలాం గృహ్ణాతి యో నరః*
*పదేపదేశ్వమేధస్య లభతే నిశ్చితంపదమ్.* **45**
*తులసీం స్వకరేకృత్వా స్వీకారం యోనయిచ్ఛతి*
*సయాతి కాలసూత్రంచ యావచ్చంద్ర దివాకరౌ* **46**
*కరోతి మిథ్యాశపథం తు రస్యాం యోత్రమానవః*
*సయాతి కుంభీపాకంచ యావదింద్రా చతుర్దశ* **47**
*తులసీ తోయకణికం మృత్యుకాలేచ యోలభేత్*
*రత్నయానం సమారుహ్య వైకుంఠం ప్రాప్యతే ధృవమ్.* **48**

ఎవడు భక్తితో ప్రతిదినము తులసీ జలము సేవించునో వానికి లక్షాశ్వమేధములు జేసిన పుణ్యఫలము లభించును. ఎవడు తులసిని తన చేతిలో గాని దేహమునగాని ధరించి తీర్థస్థానములందు ప్రాణము విడుచునో వాడు విష్ణులోకమును బొందును. ఎవడు తులసి కఱ్ఱతో జేసిన మాలను ధరించునో అతని కడుగడుగున అశ్వమేధఫలము నిశ్చయముగా లభించును. ఎవడు తులసిని చేతులతో తాకుటకు పట్టుకొనుటకు యిష్టపడడో వాడు సూర్యచంద్రులున్నంత వరకు కాలపాశమున కట్టుబడును.

ఎవడు తులసిని చేత ధరించి అబద్ధపు శపథము జేయునో వాడు పదునలుగురు యింద్రులున్నంత కాలము వరకు కుంభీపాక నరకమున బడును. మరణ కాలమున తులసి తీర్థమొక చుక్కయైన యెవనికి లభించునో వాడు రత్నయానము నెక్కి వైకుంఠమునకు బోవును.

*పూర్ణిమా యామమాయాచ ద్వాదశ్యాం రవిసంక్రమే*
*తైలాభ్యంగంచ కృత్వాచ మధ్యాహ్నే నిశిసంధ్యయోః* 49
*అశౌచే ఉచికాలేయే రాత్రివాసో న్వితానరాః*
*తులసీం యోవిచిన్వంతి తేఛిందంతి హరేశ్శిరః* 50
*త్రిరాత్రిం తులసీపత్రం శుద్ధం పర్యూషితం సతి*
*శ్రాద్ధే వ్రతేచ దానేచ ప్రతిష్ఠాయా సురార్చనే.* 51
*భూగతం తోయపతితం యద్దత్తం విష్ణవేనతి*
*శుద్ధంచ తులసీపత్రం క్షాళనా దన్యకర్మణే* 52
*వృక్షాధిష్ఠాతృ దేవీయా గోలోకేచ నిరామయే*
*కృష్ణేన సార్ధనిత్యంచ నిత్యక్రీడాం కరిష్యసి* 53
*నద్యాధిష్ఠాను దేవీయా గోలేకే సాసుపుణ్యాదా*
*లవణోదస్య సాపత్నీ మదంశస్య భవిష్యతి* 54
*త్వంచ స్వయం మహాసాధ్వీ వైకుంఠే మమసన్నిధౌ*
*రమానమాచ రామాచ భవిష్యసి నసంశయః.* 55

పూర్ణిమ, అమావాస్య, ద్వాదశి, సూర్యసంక్రమణము, మరియు నూనె రాచికొనినవేళ, మధ్యాహ్నమున, రాత్రిని, సంధ్యలందు, మైలవేళ, అశుచివేళ నెవడు తులసిని గిల్లునో వాడు విష్ణువుయొక్క తలను నరికినవాడగును.

శ్రాద్ధములు వ్రతములు దానములు ప్రతిష్ఠలు మరియు దేవపూజలు జరుగునపుడు తులసి మూడురాత్రుల పాచిదైనను శుద్ధమైనదిగనే భావింపవలెను. తులసియాకు నేలపైబడినను దానిని కడిగి విష్ణువునకు బెట్టవచ్చును.

వృక్షాధిష్ఠాత్రియైన తులసీదేవత నిత్యము నిరామయమైన గోలోకమున శ్రీకృష్ణునితో క్రీడించుచుండును. ఏ దేవత ఈ యొక్క తులసీదేవి దేహమునుండి ఏర్పడిన నది నధిష్ఠించి యుండునో ఆమె గోలోకమున నా యంశమున గంగకు మారుగా కాగలదు. నీవు స్వయముగా మహాసాధ్వివి గనుక వైకుంఠమున నా సన్నిధిలో లక్ష్మీదేవితో సమానురాలివి కాగలవు; సందేహము లేదు.

-: సాలగ్రామ మాహాత్మ్యమ్ :-

*అహంచ శైలరూపేణ గండకీ తీరసన్నిధౌ*
*అధిష్ఠానం కరిష్యామి భారతే తవ శాపతః* 56
*కోటిసంఖ్యా స్తత్రకీటా స్తీక్ష్ణదంష్ట్రా వరాయుధైః*
*యచ్ఛిలా కుహరేచక్రం కరిష్యంతి మదీయకమ్.* 57

నేను భారతవర్షమున నీ శాపముచేత గండకీతీరమున పర్వతమున నివసింపగలను. అచట వాడియైన కోరలే ఆయుధములుగాగల కీటకములు కోట్లకొలది యున్నవి అవి నా యొక్క శిలలకు గుహలు మరియు చక్రములు చేయగలవు.

*సకృదేవహి యోయస్యాం వీర్యాధానం కరోతిచ*
*తద్విచ్ఛేదే తస్యదుఃఖం భవేదేవ పరస్పరమ్.* 95
*త్వంప్రియా శంఖచూడస్య చైకమన్వంత రావధి*
*శంఖేన సార్ధంత్వద్భేదః కేవలం దుఃఖద స్తథా* 96
*ఇత్యుక్త్వా శ్రీహరిం స్తాంచ విరరామంచ నారద*
*సచదేహం పరిత్యజ్య దివ్యరూపం విదాయచ* 97
*యథాశ్రీచ తథాసాచ వ్యువాస హరివక్షసి*
*సజగామ తథాసార్ధం వైకుంఠం కమలాపతిః.* 98

ఎవరు ఎవరికి వీర్యాధానము జేయుదురో వారి యెడబాటు ఎప్పుడైనను పరస్పరము దుఃఖకారణమగును. నీవు ఒక మన్వంతరకాలము శంఖచూడునకు ప్రియురాలుగా నుంటివి. అతనితో ఎడబాటిపుడు కేవలము నీకీదుఃఖమునకే అయినది. ఓ నారదా! ఇటులజెప్పి శ్రీహరి తనమాటలు చాలించి పిదప ఆదేహ మును విడిచి దివ్యరూపమును ధరించెను. అపుడు తులసీదేవి మాలయై లక్ష్మీ దేవివలె శ్రీహరివక్షమున నివసించెను. అంత కమలాపతి యామెతో గూడి వైకుంఠమునకేగెను.

*లక్ష్మీ సరస్వతీ గంగా తులసీ చాపినారద*
*హరేః ప్రియాశ్చ త్రిస్రశ్చ బభూవు రీశ్వరస్యాచ* 99

*సద్యస్తద్దేహ జాతాచ బభూవ గండకీనదీ*
*ఈశ్వరస్సోపి శైలాశ్చ తత్తీరే పుణ్యదో నృణామ్* 100

*కుర్వంతు తత్రకీటాశ్చ శిలాం బహువిధాం మునే*
*జలేపతంతి యాయాశ్చ ఫలదా స్తాశ్చ నిశ్చితమ్* 101

*స్థలస్థాః పింగళాజ్ఞేయా శ్చోపతాప ప్రవేరితి*
*ఇత్యేవం కథితం సర్వం కింభూయః శ్రోతుమిచ్ఛసి* 102

ఇతి శ్రీ దేవీ భాగవతే మహాపురాణే నవమ స్కంధే నారాయణ నారద సంవాదే చతుర్వింశోధ్యాయః.

ఓ నారదా! లక్ష్మి సరస్వతి గంగ తులసి ఈ నలువురు విష్ణువునకు ప్రియ మైనవారు. వీరిలో ముగ్గురు ఈశ్వరునకు ప్రియమైనవారు. (ఇటుల జెప్పిన పిమ్మట) వెంటనే ఆమె ఆ దేహమునుండి గండకీనది బుట్టెను. దాని తీర్థమున ఈశ్వరుడు గూడ నరులకు పుణ్యమునిచ్చు పర్వతమాయెను. అచటి కీటకములా పర్వతముపై గల అనేకశిలలను చక్రములు గలవిగా జేసెను. వానిలో ఏవేవి చక్ర నదిలో వచ్చి గండకీనదిలో బడెనో అవి ఫలము నిచ్చునవని వానిలో నిర్ణయింప బడెను.

నదిలోగాక ఒడ్డున బడినవి సూర్యతాపముచేత పింగళ వర్ణము గలవిగా నాయెను (ఇవియే స్థలజము లనబడును). ఇది యంతయు నీకు జెప్పితిని.

ఇది మహాపురాణమైన దేవీ భాగవతమునకల నారాయణ నారద సంభా షణలోగల ఇరువది నాల్గవ అధ్యాయమందలి కథ సర్వము సమాప్తము.

## -: తులసీ మాహాత్మ్యమ్ :-

తులసీ శ్రీర్మహాలక్ష్మీ ర్విద్యాఽ విద్యా యశస్వినీ
ధర్మాఽధర్మాననా దేవీ దేవదేవ మనః ప్రియా
లక్ష్మీః ప్రియసఖీ గౌరీ ద్యౌర్భూమి రచలాచలా
షోడశైతాని నామాని తులస్యాః కీర్తయేన్నరః
లభతేఽతితరాం భక్తి మంతే విష్ణుపదం భజేత్.

తులసి- శ్రీ- మహాలక్ష్మి -విద్య -అవిద్య -యశస్విని -ధర్మాన -న-అ ధర్మానన-దేవి -దేవమనఃప్రియ-లక్ష్మీఃప్రియసఖి -గౌరి- ద్యౌః-భూమి- అచల-చల -అను ఈ పదునారు పేర్లు ఏనరులు దలతురో వారు భక్తిగలవారై అంత మున విష్ణుపదమును బొందుదురు.

## -: తులసీ స్తోత్రమ్ :-

జగద్ధాత్రి నమస్తుభ్యం విష్ణోశ్చ ప్రియవల్లభే
యతో బ్రహ్మాదయో దేవా సృష్టి స్థిత్యంత కారిణో
నమస్తులసి కల్యాణి నమో విష్ణుప్రియే శుభే
నమో మోక్షప్రదే దేవి నమ స్సంపత్ప్ర దాయకే
నమామి శిరసా దేవీం తులసీం విలసత్తరుమ్
యాం దృష్ట్వా పాపినో మర్త్యా ముచ్యంతే సర్వకిల్బిషాత్
నమంత్యతి తరాం యస్యై యస్యై బద్ధాంజలిః కలా
కలయంతి సుఖంసర్వం స్త్రీయో వైశ్యో స్తథాపరే
నమస్తులసి సర్వజ్ఞే పురుషోత్తమ వల్లభే
పాహిమాం సర్వపాపేభ్య స్సర్వ సంపత్ప్ర దాయకే
తులసీ భూర్మహాలక్ష్మీః పద్మినీ శ్రీర్హరిప్రియా
తులసీ శ్రీసఖి శుభే పాపహారిణి పుణ్యదే
నమస్తే నారదనుతే నారాయణి నమోస్తు తే
ఇతి స్తోత్రం పురాగీతం పుండరీకేన ధీమతా
విష్ణు మర్చయతాం నిత్యం శోభనై స్తులసీదళైః.

## 2

నమః ప్రసాదజననీ సుఖ సౌభాగ్య వర్ధనీ
ఆధివ్యాధించ హరణీ తులసీ త్వాం నమోస్తు తే
యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతా
యదగ్రే సర్వవేదాశ్చ తులసీ త్వాం నమామ్యహమ్
తులస్యమృతజన్మాసి సదా త్వం కేశవప్రియే
కేశవార్థం విచిన్వామి వరదే భవ శోభనే
నమః పరమకల్యాణి నమస్తే పాపనాశని
భుక్తిముక్తి ప్రదే దేవి తులసీ త్వాం నమోస్తుతే.

యాదృష్ట్వా నిఖిలాఘ సంఘ శమనీ స్పృష్ట్వా వపుః పావనీ
రోగాణా మభివందితా నిరశనీ శిక్తాంతక త్రాయనీ
ప్రత్యాసక్తి విధాయనీ భగవతః కృష్ణస్య సంరోపితా
న్యస్తా తచ్చరణే విముక్తి ఫలదా తస్యై తులస్యైనమః

మోక్షైక హేతో ధరణి ప్రసూతే
విష్ణో స్సమర్థస్య గురోశ్చ సుప్రియే
ఆరాధనార్థం పురుషోత్తమస్య
చిన్వామి పత్రం తులసి క్షమస్వ.

* * * *

జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరమ్
పాణిద్వంద్వ సమర్చయా చ్యుతకథా శ్రోత్రద్వయ త్వం శృణు
కృష్ణం లోకయ లోచనద్వయ హరే గచ్ఛాంఘ్రి యుగ్మాలయమ్
జిఘ్ర ఘ్రాణ ముకుంద పాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్.

శుభమ్

# సాలగ్రామ పూజా విధానమ్

మానవ జీవితంలో పరిపూర్ణమైన శాంతిని పొందటానికి ఈశ్వర పూజా ధ్యాన పారాయణా లవసరమని జగద్గురువులు శ్రీశ్రీశ్రీ కంచి కామకోటి పీఠాధి పతుల సందేశం.

పూజావిధానం స్వార్థం పరార్థం అని రెండు విధాలు. స్వ-స్వజన యోగ క్షేమాలు కోరిచేసేది స్వార్థమైతే, గ్రామనగరాది క్షేమాలు కోరి చేసేది పరార్థం అనబడుతుంది. స్వార్థపూజ మానసికం, బాహ్యం అని మళ్ళీ రెండు విధాలు. సాధకు డిష్టదైవాన్ని మనస్సులోనే ధ్యానబలింతో నిల్పుకొని ఉపచారాలన్నీ భావనామూలంగనే జరిపేది మానసికం; లేదా ఎదురుగా ఒక పటాన్నో ప్రతిమనో పెట్టుకొని దానికి ఉపచారా లర్పించటం బాహ్య పూజ అనబడుతుంది. ఈ బాహ్య పూజలో అర్పించబడే రూపం బహిర్ముఖమైన మనస్సును ఏకాగ్రం చేసి అంతర్ముఖంగా చేయటానికి దోహదం చేస్తుంది.

ఈ బాహ్యప్రతీక స్థానంలో కొన్ని సందర్భాలలో ఉత్తమ కులశీలాదులు గల వ్యక్తులనే నిలిపి వారిపై దేవతావాహనజేసి పూజిస్తారు. దేవీ నవరాత్రుల సందర్భంలో కన్యలను, సుబ్బరాయ షష్ఠినాడు వటువులను, శ్రాద్ధ సమయంలో బ్రాహ్మణులను అర్చించటం ఇందుకుదాహరణలు. ఇక రెండవ కోవకు మణిలోహ నిర్మితాలైన ప్రతిమలు, పటాలు చెందుతవి. అర్చకుడు వానిలోగూడ ఇష్టదైవాన్నావాహనచేసి పూజిస్తాడు. అయితే ఈ ప్రతిమాదులకు పూజావసరంలో ఎప్పటి కప్పుడు ఆవాహన ప్రాణప్రతిష్ఠలు చేసికోవలసి ఉంటుంది. స్థిరప్రతిష్ఠగాని సాలగ్రామంగాని అయితే ఆ అవసరం ఉండదు. అందునా సాలగ్రామంలో శ్రీహరి నిత్యసన్నిహితుడు గాబట్టి పంచాయతనంలో దానికే ప్రాముఖ్యమెక్కువ. అభిషేకాదులన్ని దానికే నిర్వహిస్తారు. అందుచేత ఆస్తికుల ఉపయోగం కొఱకు ఆ పూజావిధానం ఇక్కడ యిస్తున్నాను.

అర్చన ఏ దేవునికి సంబంధించినా దానిలో ఆచమన ప్రాణాయామాలు, ఉపాసనా పారాయణాదులేవైనా వానికి అంగన్యాస కరన్యాసాలు విధిగా ఉంటవి.

మనలోని ప్రాణశక్తి వాయుజల తత్వాల సమ్మేళనం కాబట్టి అవ్యవధానమైన ఆచమన ప్రాణాయామా లాశక్తి నుద్దీపింపజేసి క్రమబద్ధంచేసే ఒక ప్రక్రియ. ఇక అంగన్యాస కరన్యాసాలు దేహంలోని భౌతిక శక్తిని మొదట మంత్రోచ్చారణతో వ్రేళ్ళలో ప్రేరేపింపజేసుకొని వానితో దేహంలోని ముఖ్య స్థానాలు స్పృశించి అంతర్నిహితమైన శక్తిని జాగృతం చేసికొనేవిధానం. వీనిలో ప్రాణాయామం మాత్రం కొంత కష్టసాధ్యం. సాధకుడు వీటిని సక్రమంగా ఆచరిస్తే ఆధ్యాత్మిక రంగంలో ఎన్నో లాభాలు కలుగుతవి.



పూజ ఏ దేవునికైనా దానిలో అంగవిధులు, ప్రధానార్చన అని రెండు భాగాలు కనిపిస్తవి. మొదటిదానిలోని ఆచమన ప్రాణాయామాదులు యజమానికి, కలశ గణాధిపతి పూజలు ప్రధానార్చనకు చెందుతవి. 

అర్చనలో ఒకే ఒక్కదానికి శృతి వాక్యం, పురాణ శ్లోకం, ఉపచార వాక్యం అని మూడు ఉంటవి కనుక అర్చకులు తమ సమయాన్ని, ఓపికనుబట్టి ప్రతిదానికి మూడు రీతులు చెప్పుకోవచ్చు. లేదా శృతివాక్యం విడిచి రెండింటితోనే చేయవచ్చు. ఇంకా సమయం చాలనపుడు ఉపచారవాక్యంతోనే గూడ ముగించవచ్చు. ఈ విషయంలో కావలసింది వ్యక్తి యొక్క నిష్ఠ మరియు క్రియా పూర్ణత్వంగాని తక్కింది అంతగా ప్రధానంగాదు. 

పఠనపాఠన సమయంలో వేదానికి స్వరం- పురాణాదులకు శయ్య- సంగీతానికి రాగం అవసరం. అవి లేకుండా చదివితే ఆయా విషయాలు శ్రోతలలోగాని పాఠకులలోగాని కవి యొక్క ఉద్దేశాన్ని సాధించలేవు. అంతేగాక, అపస్వరోచ్చారణంతో విపరీత పరిణామం గూడ కలుగవచ్చు. దానికి వృత్రాసుర వృత్తాంతం ఒక ఉదాహరణం. కనుక శృతిని సస్వరంగానే చదువవలె.

శృతియొక్క ఈ స్వర విధానం ఆచార్యముఖతః విని నేర్చుకోవలసిందే గాని ఆ అభ్యాసం లేని వారక్షరాలపై స్వర చిహ్నలుంచినంతమాత్రంతో చూచి చదువుకోలేరు. ఔత్తరాహులు వేదాన్ని కంఠస్వరంతోగాక హస్తస్వరంతో చదువుతారట. అంటే, స్వరం గొంతుతో పలకక చేతితో చూపుతుంటారట. ఇపుడార్యసమాజికు లది గూడ లేకుండా ఋక్కులను సామాన్య శ్లోక ధోరణితోనే చదువుతారు. అయితే ఎట్లా చదివినా దానిలో స్పష్టత, అపశబ్ద రాహిత్యం ఉండే అంతవరకైనా చూసుకోవటం అవసరం.

-: పూజకు కావలసిన సామగ్రి :-

తనకొఱకు - పంచపాత్ర (గ్లాసు) ఉద్ధరణి (స్పూను) పళ్లెం (ప్లేటు).

భగవంతునకు - అభిషేకం కొఱకు, అర్ఘ్యాదులకు, నారికేళ జలానికి పళ్లెలు, ఒక పంచపాత్ర మరియు ఉద్ధరణి.

పూజకు - కలశం, హారతిపాత్ర, ధూపపాత్ర, గంట.

పూజాసామాగ్రి - టెంకాయ, పండ్లు (ఏవైనా)

పంచామృతాలు (పాలు, పెరుగు, నెయ్యి, తేనె, చక్కెర)-పూజకు పాలు గాని, పెరుగుగాని, నెయ్యిగాని ఆవువే వాడవలె, అవి సాధ్యం కానపుడు తక్కినవి.

నైవేద్యంకొఱకు - బెల్లం, పటికబెల్లం లేదా కొంత చక్కెర.

ఉపచారాలకు - వత్తిపత్తి, గంధం, బుక్క, పసుపు, కుంకుమ, అక్షతలు, పూలు, తులసిపత్రి, అగరువత్తులు, కర్పూరం, తమలపాకులు, వక్కలు, దక్షిణగా ఉంచటానికి కానులు-

ఇవి అన్నీ చక్కగా పళ్లెంలోగాని మరెందులోనైనాగాని ఉంచుకొని దగ్గర పెట్టుకుంటే అర్చనావిధానం తాను లేపకుండా ఆలస్యం గాకుండా నిరాటంకంగా జరిగిపోతుంది.

-: పూజా ప్రారంభం :-

*త్రైలోక్య చైతన్య మయాదిదేవ శ్రీనాథ విష్ణో భవదాజ్ఞయైవ*
*ప్రాతస్సముత్థాయ తవప్రియార్థం సంసారయాత్రా మనువర్తయిష్యే*
*జానామిధర్మం నచ మే ప్రవృత్తిః జానామ్యధర్మం నచ మే నివృత్తిః*
*కేనాపి దేవేన హృదిస్థితేన యథానియుక్తోస్మి తథా కరోమి.*

భగవంతునికి నమస్కారము చేయవలెను.

అయం ముహూర్త స్సుముహూర్తోస్తు -

*తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ*
*విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతేంఘ్రియుగం స్మరామి.*

పూజాపీఠమున దీపమును వెలిగించవలెను.

మార్జనం -

అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాన్ గతోపివా
యస్మరే త్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతర శ్శుచిః.

పంచపాత్రలోని నీరు అంగుష్ఠముతో తలపై చల్లుకొనవలెను.

ఆచమనం - ఉద్ధరణితో అరచేతిలో నీరుపోసికొనుచు -

| | |
|---|---|
| ఓం కేశవాయస్వాహ | ప్రథమాచయనం చేయవలెను |
| ఓం మాధవాయస్వాహ | ద్వితీయాచమనం చేయవలెను |
| ఓం నారాయణాయస్వాహ | తృతీయాచమనం చేయవలెను. |
| ఓం గోవిందాయ నమః<br>ఓం విష్ణవే నమః | ఉద్ధరణిలో నీరు వేసికొని రెండు అర చేతులను తుడుచుకొనవలెను. |
| ఓం మధుసూదనాయ నమః<br>ఓం త్రివిక్రమాయ నమః | పై పెదవిని-<br>క్రింది పెదవిని తుడుచుకొనవలెను. |
| ఓం వామనాయ నమః<br>ఓం శ్రీధరాయ నమః | శిరస్సుపై ఉదకము చల్లుకొనవలెను. |
| ఓం హృషీకేశాయ నమః | వామహస్తమున నీళ్ళు చల్లవలెను. |
| ఓం పద్మనాభాయ నమః | పాదములపై నీరు చల్లుకొనవలెను. |
| ఓం దామోదరాయ నమః | శిరస్సుపై మరల ఉదకము చల్లుకొనవలెను. |
| ఓం సంకర్షణాయ నమః | కుడిచేతి వ్రేళ్ళను గొప్పవలె వంచి గడ్డము తుడుచుకొనవలెను. |
| ఓం వాసుదేవాయ నమః<br>ఓం ప్రద్యుమ్నాయ నమః | వ్రేళ్ళతో ముక్కు-పుటములను తుడుచుకొనవలెను. |
| ఓం అనిరుద్ధాయ నమః<br>ఓం పురుషోత్తమాయ నమః | రెండు కన్నులను కుడిచేతితో తాకవలెను. |
| ఓం అధోక్షజాయ నమః<br>ఓం నారసింహాయ నమః | రెండు చెవులను తాకవలెను. |
| ఓం అచ్యుతాయ నమః | బొడ్డును తాకవలెను. |
| ఓం జనార్ధనాయ నమః | వక్షస్థలమును తాకవలెను. |
| ఓం ఉపేంద్రాయ నమః | చేతి కొనను శిరస్సుపై ఉంచుకొనవలెను. |
| ఓం హరయే నమః<br>ఓం శ్రీకృష్ణాయ నమః | కుడి మరియు ఎడమ మూపులను తాకవలెను. |

పై నామములలో మొదటి మూడు స్వాహాకారాలు, తాపత్రయ బాధానివారకాలు. తరువాతి నమస్కారాలు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, పంచప్రాణ, ఉపప్రాణ, మనశ్శుద్ధి కారకాలు. వీనికి కేశవ నామాలని పేరు. ఇవి 24.

శ్రీమహావిష్ణువు మొదట గోలోకంలో శ్రీకృష్ణతత్వంగా, తర్వాత వాసుదేవాది చతుర్వ్యూహ తత్వంగా, పిమ్మట ఈశ్వరరూపమైన అంతర్యామి తత్వంగా, అనంతరం రామకృష్ణాద్యవతారాలు ధరించి వైభవతత్వంగా, ఆ పిమ్మట వెంకటేశ్వరాది అర్చావతార తత్వంగా అవతరించినట్లు వైష్ణవ గ్రంథాలు చెప్పుతవి. ఈ అవతరణలకు ''అర్థపంచకం" అని పేరు. వీనిలో రెండవది చతుర్వ్యూహతత్వం. దానిలో వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అని నాలుగు వ్యూహాలున్నవి.

జ్ఞానం. శక్తి. బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు ఈ ఆరు గుణాలకు భగవద్గుణ షట్కం అని పేరు. అవి సంపూర్ణంగా గలవాడు వాసుదేవుడు. ఆతడే పరబ్రహ్మం. పై ఆరు గుణాలనుండి క్రమంగా రెండు రెండు వేరై సంకర్షణ-ప్రద్యుమ్న-అనిరుద్ధ వ్యూహా లేర్పడినవి. తరువాత ఈ నాలుగు వ్యూహాలలో ఒక్కొక్క దానినుండి మూడు ప్రకాశమూర్తులు రెండు విలాస మూర్తులు పుట్టినవి. ఈ చక్రాన్ని చూదండి—

| వ్యూహ మూర్తి | ప్రకాశ మూర్తులు | విలాస మూర్తులు | వ్యూహ మూర్తులు | ప్రకాశ మూర్తులు | విలాస మూర్తులు |
|---|---|---|---|---|---|
| 1<br>వాసుదేవ | కేశవ<br>నారాయణ<br>మాధవ | పురుషోత్తమ<br>అధోక్షజ<br>— | 3<br>ప్రద్యుమ్న | త్రివిక్రమ<br>వామన<br>శ్రీధర | జనార్దన<br>ఉపేంద్ర<br>— |
| 2<br>సంకర్షణ | గోవింద<br>విష్ణు<br>మధుసూదన | నారసింహ<br>అచ్యుత<br>— | 4<br>అనిరుద్ధ | హృషీకేశ<br>పద్మనాభ<br>దామోదర | హరి<br>శ్రీకృష్ణ<br>— |

పైచక్రంలోని ప్రకాశమూర్తులు 12-వ్యూహమూర్తులు 4, విలాసమూర్తులు 8 కలసి పై కేశవనామాల క్రమం ఏర్పడింది కాబట్టి విష్ణుపూజలో వీటికి చాలా ప్రాముఖ్యం ఉంది. (ఈ మూర్తులు ఎట్లా ఏర్పడేది తెలిపే స్తుతి దీని చివరయిచ్చినాను).

ఘంటానాదం-

*అగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసాం*
*కురు ఘంటారవం తత్ర - దేవతాహ్వాన లాంఛనమ్.*

—గంటను మ్రోగించవలె.

---

భూతోచ్చాటనమ్-

*ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమిభారకాః*
*ఏతేషామ విరోధేన బ్రహ్మకర్మ సమారభే.*

—వెనుకవైపు అక్షతలు చల్లుకొనవలె.

ప్రాణాయామమ్-

(ఇది, 1. పూరకం=గాలిని పీల్చుట. 2. కుంభకం=పీల్చినగాలిని నిలుపుట. 3. రేచకం=నిలిపినగాలిని విడుచుట అని మూడు అంగాలతోకూడి ఉంది. ఆ మూడు కలిసితే ఒక ప్రాణాయామం అవుతుంది. సాధకుడు గాయత్రీ మంత్రాన్ని సులభంగా మూడు తడవలు జపించే అంతసేపైనా పీల్చినగాలిని నిలిపే అలవాటు చేయవలసి ఉంటుంది.)

*ఓంభూః, ఓంభువః, ఓగ్ంసువః, ఓంమహః, ఓంజనః, ఓంతపః, ఓగ్ం సత్యాం*

*ఓం తత్సవితుర్వరేణ్యాం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్*

*ఓం ఆపోజ్యోతి రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.*

(పైమంత్రంతో మొదటి దళాలకు సప్తవ్యాహృతులని, తరువాతి దానికి ''గాయత్రి'' అని పేరు. సాధకుడు కుడిచేతి అనామికతో ముక్కుయొక్క ఎడమ రంధ్రాన్ని అదిమి మూసి, కుడివైపునుండి నిండుగా గాలినిపీల్చి నిలిపి మనస్సులో పైమంత్రాన్ని మూడుతడవలు జపించి తరువాత బొటనవ్రేలితో కుడివైపు నాసారంధ్రాన్ని మూసి ఎడమవైపునుండి నిలిపిన గాలిని మెల్లమెల్లగా విడువవలె. ఇది ఒక ప్రాణాయామం క్రింద లెక్క. సంధ్యావందనంలో సూర్యునికి అర్ఘ్యం ఇచ్చేఅపుడు- గాయత్రీజపం చేసేఅపుడుగూడ ప్రాణాయామావసరం అవుతుంది. అపుడుగూడ ఇదేవిధంగా చేయవలె.

ప్రాణాయామం ఎపుడేగాని ఆచమనం లేకుండా ఉండదు. ఇది మనలోని ప్రాణశక్తిని ఉద్దీపింపజేసి క్రమబద్ధపరచి అటు యోగసాధనకేగాక ఇటు ఆరోగ్యానికి గూడ ఎంతో దోహదం చేస్తుంది. ప్రాణాయామంతో చేసే మంత్ర జపంగూడ తొందరగా ఫలిస్తుందిగాని, ఈ సాధన అనుకున్నంత తేలిక కాదు. ఏమాత్రం తొందర పనికిరాదు.)

1. గురుధ్యానం- వారి వారి సంప్రదాయ ప్రకారం చెప్పుకొని —

అస్మదాచార్య పర్యంతాం వందేగురుపరంపరాం-అని నమస్కరించవలె-

2. గణపతిధ్యానం-

*శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం*
*ప్రసన్నవదనం ధ్యాయేత్స ర్వవిఘ్నోప శాంతయే.*

3. నవగ్రహధ్యానం—

*ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ*
*గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః.*

సంకల్పం —

శ్రీ గోవింద గోవింద గోవింద—

మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూ ద్వీపే భరతవర్షే భరతఖండే మేరోఃదక్షిణదిగ్భాగే శ్రీశైలస్య- ప్రదేశే మమగృహే అస్మిన్ వర్తమానేన వ్యవహారిక చాంద్రమానేన -సంవత్సరే- అయనే-ఋతౌ- మాసే-పక్షే-తిథౌ-వాసరే-నక్షత్రే-యోగే-కరణ ఏవం గుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ -గోత్రః- నామధేయః ధర్మపత్నీసమేతోహం శ్రీమతః- గోత్రస్య-నామధేయస్య ధర్మపత్నీసమేతస్య ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం సకల మనోభీష్ట సిద్ధ్యర్థం సాలగ్రామస్థిత శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం షోడ శోపచార పూజాంకరిష్యే.

(పల్లెములో అక్షతలు నీళ్ళు విడువవలెను.)

(ఈ సంకల్పంవరకు గల విధానమంతా వ్యక్తియొక్క శుద్ధికే చెందుతుంది.)

-: గణపతి పూజ :-

(దేవతారాధనలో గణపతినుండి ఉపచారపూజ లారంభమౌతవి. దేవతలకు పూజాసందర్భంలో చేసే ఉపచారాలు 16 కాని, అవి పునరావృత్తులతో శాఖాభేదాంలో యిపుడు చాలా పెరిగినవి. అర్చకులవన్నీ ప్రధాన దైవానికి ఎలాగూ చేస్తారుకాబట్టి దానికి అంగాలైన ఈ కలశ గణాధిపతులకు, పన్నెండు, ఎనిమిది, లేదా అయిదుమాత్రమే ఉపచారాలు చెప్పుకుంటూ ముందుకు సాగుతారు. కొన్ని వ్రతాది పుస్తకాలలో అవి ఏమాత్రం చెప్పకుండా- ఆచమ్య- ప్రాణాయామ్య- కలశ గణాధిపతి పూజాంకృత్వా అనిమాత్రమే సూచించి తరువాయి ఆరంభిస్తారు.

దేవతారాధనకు కలశం ముఖ్యం కాబట్టి గణపతిపూజ ఎప్పుడైనా కలశ పూజలోనే చేరిఉంటుంది.)

*ఓం శ్రీమహా కలశదేవతాభ్యాంనమః స్థాపయామి పూజయామి*

(కలశానికి బంగారు వెండిపాత్రల తరువాత చెప్పదగింది రాగిపాత్ర మాత్రమే- స్వచ్ఛమై పరిశుభ్రమైన రాగిపాత్రలోని నీరు ఆరోగ్యాని కెంతో దోహదం చేస్తుంది. రాగిది లేనపు డిత్తడిపాత్ర నుపయోగించవచ్చు. కాని, సీమ వెండి, స్టీలు పాత్రలు ఎంత మాత్రం కూడదు.

కలశపాత్రను నీటితోనింపి పూజాపీఠంపై దేవునికి కుడివైపున ఉంచి అలంకరించి అక్షతలు వేసి నమస్కరించవలె)

*ఆదౌ కలశపూజా నిర్విఘ్న పరిసమాప్త్యర్థం గణాధిపతి పూజాం కరిష్యే*

(కలశపూజ నిరాటంకంగా సాగే అందుకు మొదట గణపతిని పూజించవలె.)

*ఓం శ్రీ మహాగణాధిపతయే నమః స్థాపయామి పూజయామి*

(గణపతికి ప్రతిమలేకుంటే గొంటుపోక నుంచవలె)

గణపతి భూతత్వదేవత. మన భూగోళం దక్షిణ ధ్రువం చట్టిగా కొంచెం అణిగి ఉత్తరధ్రువం అండాకారంగా పైకిలేచి ఉందట. గొంటుపోకగూడ అలాగే అడుగుభాగం అణిగి పైభాగము అండాకారంగా లేచి ఉంటుంది. పూర్వం

మట్టితో చేసే వెంకయ్యలు. ఆనాటి శిల్పాలు గూడ లావుపాటి బొజ్జతో కూర్చుని అడుగు భాగం చట్టిగా శిరోభాగానికి వచ్చేవరకు అండాకారంగానే సన్నమయ్యేవి; కాబట్టి ఇదొక విచిత్రమైన సాదృశ్యం.)

ధ్యానం- 1. *ఓం కవిం కవీనా ముపమశ్రవ స్తమం*
*జ్యేష్ఠరాజం బ్రాహ్మణాం బ్రాహ్మణస్పతిః*
*అజిశృణ్వా న్నూత్నభిః సత్యసాదనం.*

2. *అగజానన పద్మార్కం గజానన మహర్నిశం*
*అనేకదంతం భక్తానాం ఏకదంత ముపాస్మహే.*

*ఓం శ్రీ మహాగణాధిపతయే నమః*

ఆవాహయామి - ఆసనం సమర్పయామి.

పాదయోః - పాద్యం సమర్పయామి- ఉద్ధరణితో నీరెత్తి గణపతికి చూపి పళ్లెరంలో విడువవలె.

హస్తయోః - అర్ఘ్యం సమర్పయామి - ఉద్ధరణితో నీరెత్తి గణపతికి చూపి పళ్లెరంలో విడువవలె.

ముఖే - ఆచమనీయం సమర్పయామి - ఉద్ధరణితో నీరెత్తి గణపతికి పళ్లెరంలో విడువవలె.

ఉపచారికస్నానం- ఘంటానాదంతో కలశజలంలో పూవుఅద్ది గణపతిపై చల్లుతు-

*నారికేళోదకం గంగా యమునానది సముద్భవం*

*శుద్ధోదకం గృహాణేశ స్నానంకురు యథావిధిః-*

(ఇక్కడ "యమున" చోట తమ ప్రాంతం నది పేరు చేర్చుకోవచ్చు).

ఓం శ్రీ మహాగణాధిపతయేనమః

| | |
|---|---|
| స్నానానంతరం వస్త్రయుగ్మం సమర్పయామి యజ్ఞోపవీతం సమర్పయామి | గణపతికి వత్తి-పత్తి అలంకరించవలె. |
| గంధం సమర్పయామి | గంధం అలంకరించవలె. |
| అక్షతాన్ సమర్పయామి | అక్షతలు చల్లవలె. |
| పుష్పాని పూజయామి | ఈ క్రింది పేర్లతో పూవులలంకరించవలె. |

ఓం సుముఖాయ నమః
ఓం ఏకదంతాయ నమః
ఓం శూర్పకర్ణాయ నమః
ఓం విఘ్నరాజాయ నమః
ఓం ఆఖువాహనాయ నమః
ఓం హేరంబాయ నమః
ఓం లంబోదరాయ నమః
ఓం గణనాథాయ నమః

నానావిధ పరిమళ పత్రపుష్పాని సమర్పయామి
ఓం శ్రీమహాగణాధిపతయే నమః

ధూపమాఘ్రాపయామి — అగరువత్తి ముట్టించి చూపవలె.
దీపం దర్శయామి — దీపం ఎత్తి చూపవలె.
నైవేద్యం సమర్పయామి — బెల్లం లేదా చక్కెర నైవేద్యం పెట్టవలె.
ఓం సత్యంతు ఋతేన పరిషించామి — నైవేద్యం చుట్టు పూవుతో కలశంలోని నీరు చల్లవలె.

ఓం శ్రీమహా గణాధిపతయే నమః
తాంబూలం సమర్పయామి — తమలపాకు నుంచవలె.
సువర్ణ పుష్పం సమర్పయామి — కాసు ఏదైనా ఉంచవలె.
మంగళనీరాజనం సమర్పయామి
కర్పూరం వెలిగించి ఘంటానాదంతో త్రిప్పవలె

మంత్రపుష్పం-
*ఓం శూర్పకర్ణాయ విద్మహే ఏకదంతాయ ధీమహి*
*తన్నోదంతిః ప్రచోదయాత్.*

శ్రీమహాగణాధిపతయే నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.
అక్షతలు వేసి నమస్కరించవలె.

## -: కలశపూజ :-

(హిందువులకు పూర్ణకుంభదర్శనం శుభసూచకం. వారు పెద్దలకు పూర్ణ కలశంతో స్వాగతం పలుకుతారు. ఈ పూజలోని కలశస్యముఖేవిష్ణు అనే ధ్యానంలో బ్రహ్మాండ కటాహభావన ''ఆపోవా ఇదగ్ంసర్వం'' అనే శృతిలో ఈ విశ్వంలో సమస్త సృష్టి జలమూలమే అనే విజ్ఞాన దృష్టి ఇమిడి ఉంది.)

ధ్యానం- కలశస్య ముఖేవిష్ణుః కంఠే రుద్ర సమాశ్రితాః
మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృ గణాస్మృతాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితః
ఓం ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః
ప్రాణావా ఆపః పశవ ఆపోఽన్న మాపోఽ
మృతమాప స్సమ్రాడాపో విరాడాప స్వరాడాప
శ్ఛందాగ్ంస్యాపో జ్యోతీగ్ంష్యాపో యజూగ్ంషాప
స్సత్యమాప స్సర్వాదేవతాఆపో భూర్భువస్సువరాప ఓమ్.

ఓం శ్రీ కలశదేవతాభ్యాం నమః
గంధం సమర్పయామి-
కలశం పొట్టపై మూడు గంధపు బొట్లు పెట్టవలె.
గంధస్యోపరి అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి-
గంధపు చుక్కలపై అక్షతలంటించవలె.

వస్త్రయుగ్మం సమర్పయామి "పత్తి-పత్తిని" పెట్టవలె
ధూప మాఘ్రాపయామి అగరుపత్తిని చూపవలె
దీపం దర్శయామి దీపం ఎత్తి చూపవలె

నైవేద్యం సమర్పయామి బెల్లం లేదా చక్కెర నుందుంచవలె.
సత్యంతు ఋతేన పరిషించామి - నైవేద్యం పై పూవుతో నీరు చల్లవలె.
నైవేద్యానంతరం తాంబూలం సమర్పయామి - తమలపాకుంచవలె.
మంగళ నీరాజనం సమర్పయామి - కర్పూరం వెలిగించి చూపవలె.

ప్రార్థన- గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి
నర్మదా సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధింకురు.
ఓం శ్రీ కలశదేవతాభ్యాం నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్
సమర్పయామి.
అక్షతలు వేసి నమస్కరించవలె.

*కలశోదకేన దేవమాత్మానంచ సంప్రోక్ష్య - పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య*

కలశజలం దేవతపై చల్లవలె - తన నెత్తిని చల్లుకోవలె - పూజా ద్రవ్యాలపై చల్లవలె.

**-: శంఖపూజ :-**

ఓం శ్రీ మహా శంఖదేవతాభ్యాం నమః స్థాపయామి పూజయామి

(శంఖం మనకు మంగళమై దర్శించదగిన వస్తువులలో ఒకటి. అది లేకుంటే దైవాభిషేకం సాగదు - దాన్ని ఎందుకు పూజించవలెనో ఈ ధ్యాన మంత్రం తెలుపుతుంది.)

ధ్యానం—

*శంఖం చంద్రార్క దైవత్యం వరుణం చాధిదైవతం*
*పృష్ఠే ప్రజాపతిం విద్యా దగ్రేగంగా సరస్వతీ*
*పృథివ్యాయానితీర్థాని వాసుదేవస్య చాజ్ఞయా*
*శంఖే తిష్ఠంతి సర్వాణి తస్మాచ్ఛంఖం ప్రపూజయేత్.*

(కలశోదకేన శంఖం ప్రక్షాళ్య - కలశ జలంచే శంఖం కడుగవలె)

పునఃపూరయిత్వా - మళ్లీ నీటితో నింపవలె.)

శ్రీ మహా కలశదేవతాభ్యాం నమః

| | |
|---|---|
| గంధం సమర్పయామి | గంధం అలంకరించవలె |
| అక్షతాన్ సమర్పయామి | అక్షతలు చల్లవలె |
| పుష్పాని పూజయామి | పూవులలంకరించవలె |
| ధూప మాఘ్రాపయామి | అగరువత్తిని చూపవలె |
| దీపం దర్శయామి | దీపం ఎత్తి చూపవలె |
| నైవేద్యం సమర్పయామి | బెల్లం లేదా చక్కెర ముందుంచవలె. |

మంగళనీరాజనం సమర్పయామి - కర్పూరం వెలిగించవలె.

మంత్రపుష్పమ్-

*పవనరాజాయ విద్మహే పాంచజన్యాయ ధీమహి*
*తన్నోశ్శంఖం ప్రచోదయాత్.*

ప్రార్థన- మహామేరు గిరిస్సర్వో వేదానా మాలయే యథా
తథా బ్రహ్మాది దేవానాం మమగేహ స్థిరోభవ.

శంఖాన్ని కలశాని కెదురుగా ఉంచవలె- దానిపై అక్షతలు వేసి నమస్కరించవలె.

-: అథ సాలగ్రామార్చన :-

( ఇక్కడినుండి ప్రధానపూజ ఆరంభం. దీనిలో ఉపచారాలకు శృతి వాక్యాలు శ్లోకాలు రెండూ ఉంటవి. శృతిలో భగవంతుని స్తుతి, శ్లోకాలలో ఉప చార ద్రవ్యం యొక్క లక్షణం ఉంటుంది.

ఈ శృతి వాక్యాలు అన్ని ఉపచారాలకు లేవు. కొన్నిటికి మాత్రమే ఉన్నవి. లేనివాటికి పురుషసూక్తాన్ని జోడించి చెబుతారు. కొన్ని ఉపచారాల కేమో పురాణ శ్లోకాలే లేవు. దీనిలో లభించినంతవరకు చెప్పినాను.

అర్చకులు మొదట చెప్పినట్టు తమ సమయాన్నిబట్టి ఉపచార మంత్రా లుగా రెండూ చెప్పుకోవచ్చు, లేదా ఒకటిగాని. అదేవిధంగా అర్చనా ద్రవ్యాలలో గూడ తమకు లభించనంత మేరకు, సమకూర్చగలిగినంతమేరకే ఉపచారాలు చెప్పుకోవలె.)

ధ్యానం- చేతిలో పూలు పట్టుకొని

1. ధ్యాయేత్ సత్యం గుణాతీతం గుణత్రయ సమన్వితమ్
లోకనాథం త్రిలోకేశం కౌస్తుభాభరణం హరిమ్.

2. శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందేవిష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్.

3. సశంఖచక్రం సకిరీటకుండలం సపీతవస్త్రం సరసీరుహేక్షణమ్
సహార వక్షస్థల శోభి కౌస్తుభం నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్.

సాలగ్రామంపై పూలుంచవలె.

(సామాన్య ప్రతిమలకైతే ఇక్కడ ఆవాహన ప్రాణప్రతిష్ఠ చెప్తుతారు కాని సాలగ్రామంలో శ్రీహరి నిత్యసన్నిహితుడు కనుక అది అవసరముండదు. విష్ణు గాయత్రిని మాత్రం జపం చేస్తారు)

ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి
తన్నోవిష్ణుః ప్రచోదయాత్ - పదిసార్లు జపించవలె.

(ఇది మంత్రపుష్పంలోని భాగం. దీని పాదాంతాలలో గాయత్రి ఉంది. ఇందులో నారాయణ - వాసుదేవ - విష్ణు -అని శ్రీమహావిష్ణువు స్మరింపబడినాడు కనుక ఇది విష్ణు గాయత్రి అనబడుతుంది.

పై పర్యాయ పదాలు మార్చి దీన్ని ఏ దేవతపరంగానైనా చెప్పుకోవచ్చు. ఉదాహరణం గణపతిపూజలో, శంఖపూజలో చూడండి)

ఆవాహనమ్-

ఓమ్ సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష సహస్రపాత్
సభూమిం విశ్వతోవృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్.
అస్మిన్ బింబే శ్రీమహావిష్ణు మావాహయామి
పార్శ్వే లక్ష్మీం పశ్చాత్ భూమిం నీళామ్ ధ్యాయామి.

సాలగ్రామంపై తులసీదళాలు లేదా పూలుంచవలె.

(కొందరి మతంలో సాలగ్రామానికి ఆవాహనం కూడా అక్కరలేదు. కనుక ఇది ఇక్కడ ఉపచారార్థంగా భావించవలె)

ఆసనమ్-

1. ఓమ్ - పురుష ఏవేదగ్ంసర్వం యద్భూతం యచ్చభవ్యమ్
ఉతామృతత్వస్యే శానః యదన్నే నాతిరోహతి

2. మౌక్తికైః పుష్పరాగైశ్చ నానారత్న విరాజితైః
రత్నసింహాసనంచారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్.
ఓమ్ శ్రీమహావిష్ణవే నమః - ఆసనం సమర్పయామి

సాలగ్రామాన్ని పూజాస్థానంలో ఉంచుకోవలె.

పాద్యమ్-

1. ఓమ్ ఏతావానస్య మహిమా అతోజ్యాయాగ్ంశ్చ పూరుషః
పాదోஉస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి.

2. దూర్వాసర్షప సంయుక్తం కేసరాద్యై స్సువాసితం
పాద్యం గృహాణ భగవన్ మాతురుత్సంగ సంస్థితః
ఓం శ్రీ మహావిష్ణవే నమః - పాదయోః పాద్యం సమర్పయామి.

ఉద్ధరణెడు జలం పళ్లెంలో విడువవలె.

అర్ఘ్యమ్-

1. ఓమ్ త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోஉస్యేహ భవాత్పునః
తతోవిష్వఙ్వ్యక్రామత్ సాశనా నశనేఅభి.

2. కురుష్వమే దయాన్దేవ సంసారార్తి భయావహ
దధిక్షీర జలోపేతం గృహాణార్ఘ్యం నమోస్తుతే.
ఓం శ్రీమహా...హస్తయోః- అర్ఘ్యం సమర్పయామి.

ఉద్ధరణెడు జలం పళ్లెంలో విడువవలె.

ఆచమనీయమ్-

1. ఓమ్ తస్మాద్విరాడజాయత విరాజో అధిపూరుషః
సజాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మధోపురః

2. ఏలా లవంగ కర్పూర చందనాద్యై స్సువాసితమ్
పానీయంచ మయానీతం సమ్యగాచ మనీయకమ్.
ఓం శ్రీ మహా......ముఖే- ఆచమనీయం సమర్పయామి.
ఉద్ధరణితో జలం ఎత్తి దేవునికి చూపి పళ్ళెంలో విడువవలె.

మధుపర్కమ్- (దీన్ని కొందరు "పంచామృతమని కూడా అంటారు.)

1. ఓమ్ మధువాతా ఋతాయతే మధుక్షరంతిసింధవః
మాధ్వీర్నస్సంతోషధీః
మధునక్తమలోషసి మధుమత్పార్థివగ్ం రజః.

2. దధ్నీమధ్వాజ్యా సంయుక్తం పాత్రయుగ్మం సమన్వితమ్
మధుపర్కం గృహాణేదం వరదోభవ శోభనే.
ఓమ్ శ్రీ మహా......మధుపర్కం సమర్పయామి.
బెల్లం ముక్క నేతిలో లేదా పెరుగులో అద్ది దేవునిముందుంచవలె.
ఓమ్ శ్రీ మహా...మధుపర్కానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి

-: పంచామృత స్నానములు :-

(పంచామృతాలు విడిగా చాలినన్ని లేనపుడుగాని, వానితో విడివిడిగా అభిషేకించే సమయం లేనపుడుగాని పాలలో తక్కినవి లాంఛనంగా కలిపిగాని లేదా అన్ని కలిపిగాని ఆ మిశ్రమంతో అభిషేకించవచ్చు. ఆ అభిషేక మంత్రం పంచామృతాల క్రింద చెప్పబడింది.

అభిషేకానికి శంఖం ఉపయోగించవలె. శంఖం లేనపుడు చిన్న గిన్నెతో గాని లేదా ఉద్ధరిణితోగాని ముంచి అభిషేకం చేయవచ్చు.

అభిషేక సమయంలో గంటగూడ మ్రోగిస్తూ ఉండవలె.)

పయస్నానం—

ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియమ్
భావావాజస్య సంగథే.
ఓం శ్రీమహా...పయస్స్నానం సమర్పయామి.
సాలగ్రామాన్ని పాలతో అభిషేకించవలె.

దధిస్నానం—

దధిక్రావణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః
సురభినో ముఖాకరత్ప్రాణ ఆయుగ్ంషి తారిషత్.
ఓం శ్రీమహా...దధినా స్నాపయామి.
సాలగ్రామాన్ని పెరుగుతో అభిషేకించవలె.

ఘృతస్నానం—

శుక్రమసి జ్యోతిరసితే జ్యోతిదేవో వత్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ వసో సూర్యారశ్మిభిః.
ఓం శ్రీమహా...ఘృతేన స్నాపయామి.
సాలగ్రామాన్ని నేయితో అభిషేకించవలె.

మధుస్నానం-

ఓమ్ మధు ద్యౌర స్తునః పితా మధుమానో వనస్పతి
ర్మధుమాగ్ం అస్తుసూర్యః
ఓం శ్రీమహా...మధునా స్నాపయామి

సాలగ్రామాన్ని తేనెతో అభిషేకించవలె.

శర్కరాస్నానము-

స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే
బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః.
ఓం శ్రీమహా...శర్కరేణ స్నాపయామి.
సాలగ్రామానికి శర్కరాభిషేకం చేయవలె.

పంచామృతస్నానం- (అన్నీ కలిపి)

1. అపాగ్ం రసముద్వయసగ్ం సూర్యే సంతగ్ం సమాహితం
అపాగ్ం రసస్యయో రస స్తంవోగృహ్ణా మ్యుత్తమ ముపయామ
గృహీతో ఽసీంద్రాయ త్వాజుష్టం గృహ్ణామ్యేషతే
యోనిరింద్రాయత్వా జుష్టతమమ్.

2. పయోదధి ఘృతోపేతం శర్కరా మధుసంయుతం
పంచామృత స్నానమిదం గృహాణ పరమేశ్వర.
ఓం శ్రీమహా...పంచామృత స్నానం సమర్పయామి.
సాలగ్రామానికి పంచామృత స్నానం చేయించవలె.

నారికేళోదకస్నానం- (టెంకాయ నీటితో)

యాఫలానీ ర్యాఽఫలా పుష్పాతు యాశ్చపుష్పిణో
బృహస్పతి ప్రసూతాస్తనో ముంచత్వాగ్ం హసః
ఓం శ్రీమహా...నారికేళ ఫలోదకస్నానం సమర్పయామి.
సాలగ్రామాన్ని టెంకాయనీటితో అభిషేకించవలె.

శుద్ధోదకస్నానం- కలశ జలంతో

1. ఓమ్ ఆపోహిష్ఠా మయోభువః ఓమ్ తానఊర్జేదధాతనః
ఓమ్ మహేరణాయచక్షసే ఓమ్ ఏవశ్శివతమోరసః
ఓమ్ తస్యాభాజయతేహనః ఓమ్ ఉశతీరివమాతరః
ఓమ్ తస్మాదరంగమామావో ఓమ్ యస్యక్షయామజిన్వథః
ఓమ్ ఆపోజనయథాచనః.

2. కావేరీ నర్మదాకృష్ణా తుంగభద్రా సరస్వతీ
గంగాచ యమునా చైవ తాభ్యః స్నానార్థమాహృతమ్
శుద్ధోదకంగృహాణేశ - స్నానం కురుయథావిధిః.
ఓం శ్రీమహా...శుద్ధోదక స్నానం సమర్పయామి.
సాలగ్రామాన్ని కలశ జలంతో అభిషేకించవలె.

ఓం శ్రీమహా...స్నానానంతరం పునరాచమనీయం సమర్పయామి.
ఉద్ధరణితో నీరెత్తి చూపి పళ్ళెరంలో విడువవలె.

వస్త్రయుగ్మమ్-

1. ఓమ్ అభివస్త్రాసువసన్యా న్యర్షాభిధేను సదుఘాః పూయమానాః
అభిచంద్రా భర్తవేనో హిరాణ్యాభ్యాశాన్ రథినో దేవసోమః

2. పీతాంబరాణి సర్వేశ నానావస్త్రాప శోభిత
ధారయేద్విశ్వ రూపాత్మన్ శ్రీకృష్ణా జగతాంపతే.
ఓం శ్రీమహా...వస్త్రయుగ్మం సమర్పయామి.
ప్రత్తితో వస్త్రంవలె చేసిన రెండువత్తు లలంకరించవలె.

యజ్ఞోపవీతం-

1. ఆపోభువన స్వరితోర్మిత విశ్వకర్మాభువనా
అజ్ఞాధాతా విధాతా పరామాశ్చ చంద్రికే
బ్రహ్మప్రతిష్ఠాం మనూనాం మనసా యజ్ఞోపనీతినామ్.

2. యజ్ఞోపవీతం పరమంపవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్
ఆయుష్యమగ్రియమ్ ప్రతిముంచశుభ్రం యజ్ఞోపవీతం బలమస్తుతేజః.
ఓం శ్రీమహా...యజ్ఞోపవీతం సమర్పయామి.
యజ్ఞోపవీతంవలె చేసిన వత్తిని అలంకరించవలె.

ఆభరణాని-

1. ఓం యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞమతన్వత
వసంతో అస్యాసీదాజ్యం గ్రీష్మఇధ్మశ్శరద్ధవిః.
2. కేయూర వలయంచైవ గ్రైవేయం కుండలద్వయం
అంగుళీయక రత్నాని భూషణానితు గృహ్యతామ్.
ఓం శ్రీమహా...ఆభరణాని సమర్పయామి.
దేవుని ముందు ఉంగరంగాని మరేదైనా ఆభరణంగాని ఉంచవలె.

శ్రీగంధమ్-

1. గంధద్వారాన్ దురాన్ దర్షాన్ నిత్యపుష్టాం కరీషణీమ్
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయేశ్రియమ్.
2. శ్రీఖండం చందనోన్మిశ్రం కర్పూరేణ సుసంయుతమ్
విలేపనం సురశ్రేష్ఠం ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం.
ఓం శ్రీమహా...శ్రీగంధం సమర్పయామి.
సాలగ్రామానికి గంధం అలంకరించవలె.

సుగంధచూర్ణం-

నానా పరిమళై ర్ద్రవ్యై నిర్మితం చూర్ణముత్తమమ్
అబీరనామకం చూర్ణం గంధం చారు ప్రగృహ్యతామ్.
ఓం శ్రీమహా...సుగంధచూర్ణం సమర్పయామి.
బుక్కాగులాలు చల్లవలె.

అక్షతలు-

1. ఆయనేతేపరాయణే దూర్వారోహంతు పుష్పిణీః
హ్రదాశ్చ పుండరీకాని సముద్రస్య గృహాఇమే.

2. అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలీయాన్ తండులాన్ శుభాన్
భక్త్యా సమర్పితందేవ భక్తానా మక్షతంపదం.
ఓం శ్రీమహా...అక్షతాన్ సమర్పయామి.

'అక్షతలు చల్లవలె.

(శివునకైతే కుంకుమాక్షతలు, విష్ణువునకైతే హరిద్రాక్షతలుపయోగిస్తారు)

పుష్పమ్-

1. ఓం సప్తాస్యాస న్పరిధయః త్రిస్స ప్త సమిధః కృతాః
దేవాయద్యజ్ఞం తన్వానః అబధ్నన్ పురుషం పశుమ్.

2. చామంతికా వకుళచంపక పాటలాబ్జపున్నాగజాజికరవీరరసాలపుష్పైః
బిల్వప్రవాళ తులసీదళ మల్లికాని త్వాం పూజయామి జగదీశ్వర
వాసుదేవ.

ఓం శ్రీమహా...పుష్పాని సమర్పయామి.

పూవు లలంకరించవలె.

పత్రమ్-

తులసీం హేమరూపాంచ రత్నరూపాంచ మంజరీమ్
భవమోక్ష ప్రదాంతుభ్య మర్పయామి హరిప్రియామ్.
ఓం శ్రీమహా...తులసీపత్రం సమర్పయామి.

తులసీ పత్రిని ఉంచవలె.

(తీర్థానికి కృష్ణతులసిని, అర్చనకు లక్ష్మీతులసిని ఉపయోగించవలెనని శ్రీవైష్ణవ సంప్రదాయం)

నామపూజ—ప్రతిమార్చనమైతే పుష్పార్పణ తరవాత అంగపూజ ఉంటుంది కాని సాలగ్రామాలకు, శివలింగాలకు అది ఉండదు. కేవల నామావళియే చెబుతారు. విష్ణుపూజలో ద్వాదశ నామాలకు మిక్కిలి ప్రాధాన్యం ఉంది కనుక అవి ఈ క్రింద చెప్పబడినవి. ఒక్కొక్క పేరుతో ఒక్కొక్క పూవు పెట్టవలె. ఇక్కడ అవకాశం ఉన్నవారు అష్టోత్తరం గూడ చెప్పుకోవచ్చు.

ఓం కేశవాయనమః ఓం మాధవాయనమః
ఓం నారాయణాయనమః ఓం గోవిందాయనమః

ఓం విష్ణవేనమః ఓం శ్రీధరాయనమః
ఓం మధుసూదనాయనమః ఓం హృషీకేశాయనమః
ఓం త్రివిక్రమాయనమః ఓం పద్మనాభాయనమః
ఓం వామనాయనమః ఓం దామోదరాయనమః

నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి
వివిధమైన పూవులన్ని అలంకరించవలె.

ధూపమ్-

1. ఓమ్ తంయజ్ఞం బర్హిషిప్రోక్షన్ పురుషం జాతమగ్రతః
తేనదేవా అయజంత సాధ్యా ఋషయశ్చయే.
2. దశాంగం గుగ్గులోపేతం గోఘృతేన సమన్వితమ్
ధూపం గృహాణ దేవేశ సర్వలోక నమస్కృత.
ఓం శ్రీమహా...ధూప మాఘ్రాపయామి.
ధూపపాత్రలో దశాంగంవేసి చేతితో ఆ పొగను దేవునికి చూపవలె.

దీపమ్-

1. ఓమ్ తస్మాద్యజ్ఞా త్సర్వ హుతః సంభృతం పృషదాజ్యమ్
పశూగ్ం స్తాగ్ంచక్రే వాయవ్యాన్ అరణ్యాన్ గ్రామ్యాశ్చయే.
2. త్ర్యైలోకేశ మహాదేవ సర్వజ్ఞాన ప్రదాయక
దీపం దాస్యామి దేవేశ రక్షమాం భక్తవత్సల.
ఓం శ్రీమహా...దీపం దర్శయామి.
కైవత్తి వెలిగించి చూపవలె లేదా దీపంగాని.

పూర్వాపోశనం-

1. ఓమ్ తస్మాద్యజ్ఞా త్సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే
ఛంధాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ యజుస్తస్మాద జాయత.
2. సుధారసం సువిపులం మయానీతంతు మాధవా
గృహాణ కలశానీతం యథేష్ట ముపభుజ్యతామ్.
ఓం శ్రీమహా...పూర్వాపోశనం సమర్పయామి.
ఉద్ధరిణితో జలం చూపి పళ్లెంలో విడువవలె.

నైవేద్యం–

1. ఓమ్ తస్మాదశ్వా అజాయంత ఏకేచో భయాదతః
గావోహ జజ్ఞిరేతస్మాత్ తస్మాజ్జాతా అజావయః.
2. సర్వాభక్ష్యైశ్చ భోజ్యైశ్చ రసైషడ్భిః సమన్వితమ్
నైవేద్యాంతు మయానీతం గృహాణ పురుషోత్తమ.

నైవేద్యం దేవునిముందుంచవలె.

ఓమ్ భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి
ధియోయోనః ప్రచోదయాత్.
ఓం సత్యంత్వా ర్తేన పరిషించామి
నైవేద్యం చుట్టు నీరు త్రిప్పవలె.
(రాత్రివేళ అయితే ''ఓం ఋతంతా సత్యేన పరిషించామి'' అని చెప్పవలె)

ఓం అమృతమస్తు - అమృతోపస్తరణ మసి

ఆహుతులు–

ఓం ప్రాణాయస్వాహా - కనిష్ఠిక-అనామిక-అంగుష్ఠము
ఓం అపానాయస్వాహా - అనామిక-మధ్యమ-అంగుష్ఠము
ఓం వ్యానాయస్వాహా - మధ్యమ-తర్జని-అంగుష్ఠము
ఓం ఉదానాయస్వాహా - తర్జని-మధ్యమ-అనామిక-అంగుష్ఠము
ఓం సమానాయస్వాహా - తర్జని-మధ్యమ-అనామిక-కనిష్ఠిక-అంగుష్ఠము
కలిపి ముద్రపడుతు, నైవేద్యం దేవునికి చూపుతు.

ఓం శ్రీమహావిష్ణవేనమః - మహానైవేద్యం సమర్పయామి.

అని దేవునికి నైవేద్యం పేరు చెప్పి నివేదన చేయవలె.

పానీయమ్–

1. ఓమ్ యత్పురుషం వ్యదధుః కతిధావ్యకల్పయన్
ముఖం కిమస్య కేబాహు కావూరూ పాదవుచ్యేతే.

2. పానీయం పావనం శ్రేష్ఠం ఏలకాది సువాసితమ్
కర్పూర మిశ్రితం తోయం గృహాణ మధుసూదన
ఓం శ్రీమహా...పానీయం సమర్పయామి.
ఉద్ధరణితో నీరుచూపి పళ్లెంలో విడువవలె.

ఉత్తరాపోశనము-
ఉత్తరాపోశనార్థంతే దద్మితోయ సువిస్తరమ్
గృహాణ సుముఖోభూత్వా ఉత్తరాపోశనం కురు.
ఓం శ్రీమహా...ఉత్తరాపోశనం సమర్పయామి
ఉద్ధరణితో నీరుచూపి పళ్లెంలో విడునవలె.

హస్తప్రక్షాళనమ్-
పానీయమ్ పావనంశ్రేష్ఠం గంగాదిసరిదుద్భవం
హస్తప్రక్షాళనందేవ గృహాణ ముఖశోధనమ్.
ఓం శ్రీమహా...హస్తౌ ప్రక్షాళయామి.
ఉద్ధరణితో నీరు చూపి పళ్లెంలో విడువవలె.

పాదప్రక్షాళనమ్-
ఏలోశిర లవంగాది కర్పూర పరివాసితమ్
సమర్పితం మయాతుభ్యం పాదౌ ప్రక్షాళనంకురు.
ఓం శ్రీమహా...హస్తౌ ప్రక్షాళయామి.
ఉద్ధరణితో నీరు చూపి పళ్లెంలో విడువవలె.

తాంబూలమ్-
1. ఓమ్ బ్రాహ్మణోస్య ముఖమాసీత్ బాహూరాజన్యకృతః
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రోఅజాయత.
2. పూగీఫలైశ్చ కర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతమ్
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్.
ఓం శ్రీమహా...తాంబూలం సమర్పయామి.
దేవుని ముందు తమలపాకులు వక్కలుంచవలె.

సువర్ణపుష్పం-

1. ఓమ్ నాభ్యాఆసీదంతరిక్షమ్ శీర్ష్ణోద్యౌ సమవర్తత
పద్భ్యాంభూమిర్దిశ శ్రోత్రాత్ తథాలోకాగ్ం అకల్పయన్.

2. స్వర్ణపుష్ప మిదందేవ గృహాణ పురుషోత్తమ
కోటిసూర్య ప్రతీకాశం స్వర్ణపుష్పం మనోహరమ్.
ఓం శ్రీమహా...స్వర్ణపుష్పం సమర్పయామి.

దేవుని ముందు ఏదైనా కాసు ఉంచవలె.

నీరాజనం-

1. ఓమ్ వేదాముమేతం పురుషం మహాన్తమ్ ఆదిత్యవర్ణం తమస స్తుపారే
సర్వాణి రూపాణి విచింత్య ధీరా నామానికృత్వాభి వదన్ యదాస్తే.

2. మంగళం భగవాన్విష్ణో మంగళం మధుసూదన
మంగళం పుండరీకాక్ష మంగళం గరుడధ్వజ
వేద వేదాంత వేద్యాయ మేఘశ్యామల మూర్తయే
పుంసాం మోహన రూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్.

మంత్రపుష్పమ్-

1. ఓం ధాతాపురస్తాద ముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః
తమేవంవిద్వా నమృత ఇహభవతి నాన్యఃపంథా అయనాయవిద్యతే.

2. అనంత గుణగంభీరః విశ్వరూప ధరానఘ
శ్రీధరాయ నమస్తుభ్యం విష్ణవే పరమాత్మనే
నమస్సత్యాయ శుద్ధాయ నిత్యాయ జ్ఞానరూపిణే
సర్వలోకైక నాథాయ సంసార త్రాహిమాం హరే.
ఓం శ్రీమహా...మంత్రపుష్పం సమర్పయామి.

సాలగ్రామముపై పుష్పాక్షత లుంచవలెను.

**ఫలమ్-**

ఇదంఫలం మయాదేవ స్థాపితంపురతస్తవ
తేనమే సఫలావాప్తి ర్భవేజ్జన్మని జన్మని
ఓం శ్రీమహా...ఫలం సమర్పయామి.

దేవుని ఎదురుగా ఏదైనా ఒక పండు పెట్టవలె.

(దేవుని దగ్గర ఉండేది విత్తనంగల పండై ఉండవలె. అరటి పంటిది ప్రసాదానికేగాని ఫలసమర్పణకు పనికిరాదు.)

**పుష్పాంజలి-**

నమస్తే పుండరీకాక్ష నమస్తే హ్యమరప్రియ
పుష్పాంజలిం ప్రదాస్యామి గృహాణేశ మయార్పితమ్.
ఓం శ్రీమహా...పుష్పాంజలిం సమర్పయామి.

దేవుని ఎదురుగా పూలుంచేది.

**ఆత్మప్రదక్షిణ-**

యాని కాని చ పాపాని జన్మాంతర కృతానిచ
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే
పాపోఽహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః
త్రాహిమాం కృపయాదేవ శరణాగతవత్సల
అన్యథా శరణంనాస్తి త్వమేవ శరణంమమ
తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష జనార్దన.
ఓం శ్రీమహా...ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

లేచి ఆత్మ ప్రదక్షిణ చేసి నమస్కారం చేయవలె.

**విశేషోపచారములు-**

ఛత్రం ధారయామి
ఆందోళికాన్ వాహయామి
చామరం వీజయామి
నృత్యం దర్శయామి
గీతం శ్రావయామి
వాద్యం ఘోషయామి

సమస్త దేవోపచార, రాజోపచార, భక్త్యోపచార పూజాం సమర్పయామి.

పూజాఫల సమర్పణమ్-

*యస్యస్మృత్యాచ నామోక్త్యా తపఃపూజా క్రియాదిషు*
*న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే త మచ్యుతమ్*
*మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన*
*యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే.*

అనయాధ్యానావాహనాది షోడశోపచార పూజయాచ భగవాన్ సాలగ్రామ సంస్థితః శ్రీ మహావిష్ణుః సుప్రీతః సుప్రసన్నః వరదోభవతు.

*ఏతత్ఫలం ఓం తత్సత్ నారాయణార్పణమస్తు*

(ప్రతిమాదులకైతే ఇక్కడ విసర్జన చెబుతారు కాని సాలగ్రామానికి ఆవాహనలేదు; గాబట్టి విసర్జనకూడ ఉండదు.)

తులసీ గ్రహణం-

*పూజనాంతరం విష్ణోరర్పితం తులసీదళమ్*
*భక్షయే దేహశుద్ధ్యర్థం చాంద్రాయణ శతాధికమ్.*

భగవంతునిపైనుండి పూజించిన తులసీదళం తీసికోవలె.

తీర్థప్రాశనం-(అర్ఘ్యపాద్యాలుగా విడిచిన జలం, సాలగ్రామాన్ని లభిషేకం చేసిన పంచామృతాలు మరియు జలం అంతా ఒక పాత్రలోపోసి కలిపి ఈ క్రింది మంత్రంతో తీర్థంగా తీసికొనవలె-)

*శంఖమధ్యే స్థితంతోయం భ్రామితం కేశవోపరి*
*అంగలగ్నం మనుష్యాణాం బ్రహ్మహత్యాదికం దహేత్*
*సాలగ్రామ శిలావారి పాపహారి విశేషతః*
*అశేషకృత పాపానాం ప్రాయశ్చిత్తం దినేదినే*
*అకాలమృత్యు హరణం సర్వవ్యాధి నివారణమ్*
*సమస్తపాప క్షయకరం విష్ణుపాదోదకం పిబేత్-*

(తీర్థం శంఖంతో తీసికోవలె-అది లేనిపక్షంలో ఉద్ధరణితో. తీర్థానంతరం మొదట తులసీపత్రం తినవలె, తరువాత తక్కిన ప్రసాదం)

-: స్వ స్తి :-

(సాలగ్రామాన్ని పై విధంగా పూజించటమే గాక దాన్ని ఉపాసించను గూడ వచ్చు. "ప్రపంచ సారసంగ్రహం" అనే గ్రంథంలో దాని మహామంత్రో పాసన ఈ విధంగా ఉంది. ఇది సాలగ్రామ శిలోత్పత్తి విమర్శనంలో చెప్ప బడింది.

ఆచమ్య - ప్రాణాయామ్య

*అస్య శ్రీ సాలగ్రామ మహామంత్రస్య నారాయణ ఋషిః*
*అనుష్టుప్ ఛందః లక్ష్మీనారాయణో దేవతా శ్రీం బీజం హ్రీం శక్తిః*
*సౌం కీలకం, మమ సర్వాభీష్ట ప్రసాద సిద్ధయే జపేవినియోగః.*

అంగన్యాసమ్-

ఓం నమో భగవతే హృదయాయ నమః విష్ణోః శిరసే స్వాహా
సాలగ్రామ నివాసినే శిఖాయైవషట్ సర్వాభీష్ట పల ప్రదాయ కవచాయహుమ్
సకలదురిత నివారణే నేత్రత్రయాయ వౌషట్ సాలగ్రామాయ స్వాహా.అస్త్రాయఫట్

(అస్తు, స్వాహా, స్వధా, వషట్, అలం, ఇవి వేదపరిభాషలో నమస్కార వాచకాలు.)

-: ధ్యానం :-

*తుల్య ప్రభం తపనకోటిభి రబ్జచక్రమ్*
*కౌమోదకీ దర విరాజిత పాణిపద్మమ్*
*లక్ష్మీమహీసహిత మత్త విచిత్ర భూషమ్*
*నారాయణం కవిశవాననమాశ్రయామి.*

మంత్రం-

ఓం నమో భగవతే విష్ణవే శ్రీసాలగ్రామ నివాసినే
సర్వాభీష్ట ఫలప్రదాయ సకలదురిత నివారణే సాలగ్రామాయ స్వాహా.

-: ధ్యానం :-

ధ్యాయామి దేవం లక్ష్మీశం శంఖచక్ర గదాధరమ్
పీతాంబర పరీధానం, పద్మసన్నిభ లోచనమ్
మందస్మిత ముఖాంభోజం మదనాయుత సుందరం
మాయానిర్మిత లోకౌఘం మేఘశ్యామల విగ్రహమ్.

నమో నమస్తే కరుణాలయాయ
నమో నమస్తే కమలాధవాయ
నమో నమస్తే జగతాంచరాష్ట్రే
నమో నమస్తే నతశోకహర్త్రే!
త్రాహిమాం కరుణాసింధో - పాహిమాం కమలాపతే
త్వాయిభక్తిస్స దైవాస్తు మమసర్వార్థ దాయినీ-

(ఈ ఉపచారపూజలు ఉపాసనలు ఏవీ చేయలేనివారు ప్రతిదినం ఉదయం శ్రీ మహావిష్ణువు యొక్క ఇష్టమైనాల్గు పేర్లు తలుచుకుంటె చాలు. అపవిత్రుడు గాని పవిత్రుడుగాని ఏ అవస్థలో ఉన్నా ఎవడు పుండరీకాక్షుని స్మరిస్తాడో వాడు లోపల వెలుపల సుచిగలవాడే అవుతాడని మార్జన మంత్రం చెబుతుంది.

శ్రీ మహావిష్ణువును ఎప్పుడెపుడే పేరుతో తలువవలెనో బ్రహ్మాండ పురాణం ఈ విధంగా చెబుతుంది.)

-: శ్రీమహావిష్ణు షోడశ నామస్తోత్రమ్ .-

ఔషధే చింతయేద్విష్ణుం దుస్వాప్నేచ జనార్దనమ్
సయినే పద్మనాభంచ వివాహేచ జనార్దనమ్
నారాయణాంత్యా కాలేచ శ్రీధరః ప్రియసంగమే
సంగ్రామే చక్రపాణిచ ప్రవేశేచ త్రివిక్రమమ్

భోజనే స్మరగోవిందం బీభత్సే మధుసూధనం
కాననే నారసింహంచ పర్వతే రఘునందనం
జలమధ్యేతు వారాహం పావకం జలశాయినమ్
అవ్యాహే వామనంచైవ సర్వకార్యేషు మాధవం
ఏతే షోడశ నామాని త్రిసంధ్యా యఃపఠేన్నరః
వ్యాధి చోర భయంనాస్తి గ్రహపీడా వినశ్యతి.

ఇతి బ్రహ్మాండపురాణే - బ్రహ్మనారద సంవాదే.

**-: చతుర్వింశతి మూర్తి స్తోత్రకథనమ్ :-**

(దీనిలో కేశవాది మూర్తి భేదాలు ఏర్పడే విధానం రూపమండనం అనే గ్రంథాన్ని అనుసరించి చెప్పబడింది. కాబట్టి ఈ స్తోత్రం విష్ణువుయొక్క మూర్తుల పరిశీలనకు గూడ ఉపయోగపడుతుంది.

ఇందులోని ఆయుధాలు 1. క్రింది కుడిచేయి, 2. పై కుడిచేయి, 3. మీది ఎడమ చేయి, 4. క్రింది ఎడమ చేయి- అనే ప్రదక్షిణ క్రమంలో చెప్పబడినవి.

ఇది గూడ సాలగ్రామ శిలోత్పత్తి విమర్శనంలోనే ఉంది. (పు. 59)

ఓం రూపః కేశవఃపద్మ శంఖచక్ర గదాధరః
నారాయణం శంఖపద్మ గదాచక్రీ ప్రదక్షిణమ్
తలోగదీ మాధవోఽరి శంఖపద్మో నమామితమ్
చక్రీ కౌమోదకీ పద్మశంఖీ గోవింద ఊర్జితః
మోక్షదః శ్రీగదీపద్మ శంఖీ విష్ణుశ్చ చక్రధృత్
శంఖం చక్రాబ్జ గదినం మధుసూదన నమామ్యహమ్
భక్త్యా త్రివిక్రమః పద్మగదీచక్రీచ శంఖ్యపి
శంఖచక్ర గదాపద్మీ వామనః పాతుమాంసదా
గతిదః శ్రీధరః పద్మీ చక్రశార్ఙ్గీచ శంఖ్యపి

హృషీకేశో గదీచక్రీ పద్మశంఖీచ పాతునః
వరదః పద్మనాభస్తు శంఖాబ్జారి గదాధరః
దామోదరః పద్మశంఖ గదాచక్రీ నమామితమ్
తతోగదీ శంఖచక్రీ వాసుదేవోబ్జ భృజ్జగత్
సంకర్షణో గదీచక్రీ పద్మీచక్రీచ పాతువః
చక్రీ గదీ శంఖధారీ ప్రద్యుమ్నః పద్మభృత్ ప్రభుః
అనిరుద్ధ శ్చక్రగదీ శంఖీ పద్మీచ పాతునః
సురేశో ర్యబ్జ శంఖాఢ్యః శ్రీగదీ పురుషోత్తమః
అధోక్షజః పద్మగదీ శంఖచక్రీచ పాతువః
దేవో నృసింహ శ్చక్రాబ్జ గదీ శంఖీ నమామితమ్
అచ్యుతః శ్రీగదీపద్మ చక్రీ శంఖీచ పాతువః
బాలరూపీ శంఖిగదీ ఉపేంద్ర శ్చక్రపద్మ్యపి
జనార్దనః పద్మచక్రీ శంఖధారీ గదాధరః
శంఖీ పద్మచ చక్రీచ హరిః కౌమోదకీధరః
కృష్ణః శంఖీ గదీపద్మ చక్రిమే భుక్తి ముక్తిదః
ఆదిమూర్తిః వాసుదేవో స్తస్మాత్ సంకర్షణోఽభవత్
సంకర్షణాచ్చ ప్రద్యుమ్నః ప్రద్యుమ్నా దనిరుద్ధకః
కేశవాది ప్రభేదేన ఏకైకస్మిన్ త్రిధాక్రమాత్
ద్వాదశాక్షరకం స్తోత్రం చతుర్వింశతి మూర్తిమత్
యః పఠేచ్ఛృణుయద్వాపి నిర్మలః సర్వమాప్నుయాత్.

-: సర్వం వాసుదేవార్పణ మస్తు :-

యదక్షర పదభ్రష్టం, మాత్రాహీనంచ యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాందేవ పరమేశ్వర నమోస్తుతే.

ఓమ్

శ్రీరామచంద్రాయనమః



1. మహబూబు నగరమండల అసదచ్చమపేట నామధేయాయామ్
తాలూకాయా మాసీత్ప్రథితా జినుకుంట నామతః పల్లీ

2. మైత్రేయస గోత్ర శ్రీ విశ్వబ్రహ్మాన్వయాయ వార్ధిశశీ
శ్రీ వేంకటాచలాఖ్య స్తత్రాఽసీ త్కవిలవాయి గృహనామీ.



-: యుగ్మమ్ :-



3. పుత్రేణ తస్యవిదుషా విరచిత బహ్వాంధ్ర కావ్యజాలేన
శ్రీ లింగమూర్తి కవినా శాసన పరిశోధన ప్రవీణేన.



4. సాలగ్రామ శిలాతతి లక్షణ మహిమాది బోధకం శాస్త్రమ్
సంపాదై్యత జయతాల్లోకే ప్రథితం ప్రకాశితం సుచిరమ్.

-: కవికామనా :-

5. శ్రీ తిరుపతి తిరుమలగిరి వాసస్య శ్రీనివాస దేవస్య
కరుణాదత్త ధనేన ప్రకటితమేతత్ జగద్ధితాయాస్తు.

అభినవ కాళిదాసః

తెలకపల్లె రామచంద్రశాస్త్రి.



# కవి పరిచయం

జననం 31-1-1928 ప్రభవ మాఘ శుద్ధనవమి
జినుకుంట గ్రామం, అచ్చంపేట తాలూకా,
మహబూబ్‌నగరం జిల్లా.

జననీ జనకులు : మాణిక్యాంబ, వెంకటాచలం

విద్యాభ్యాసం : మేనమామ వేపూరు పెద్దలక్ష్మయ్యగారి వద్ద.

ఉద్యోగాలు : 1954 నుండి 71 వరకు నాగర్‌కర్నూల్ జాతీయ పాఠశాలలో, 71 నుండి 83 వరకు పాలెం ఓరియంటల్ కళాశాలలో.

## ముద్రితాలు - వాటి ప్రచురణలు

1. ఆర్యాశతకం - చిత్రపది
1. చక్ర తీర్థ మాహాత్మ్యం - స్థలచారిత్రక కావ్యం
3. శ్రీ మత్స్యతాపగిరిఖండం - స్థల చారిత్రక కావ్యం
4. మాతపురీ విలాసం - ఎల్లూరి నరసింగకవి కృతి పరిష్కృతం
5 భాగవత మాహాత్మ్యం-బోయనపల్లి వేంకటాచార్య కృతి పరిష్కృతం

## అముద్రితాలు

1. పాండురంగ శతకం - నాగర్‌కర్నూలు స్వామిపై.
2. తిరుమలేశ శతకం - తెళ్ళరాళ్ళపల్లి స్వామిపై.
3. మహాక్షేత్రం మామిళ్ళపల్లి - ప్రాచీన క్షేత్ర చరిత్ర.
4. ఉప్పునూతల కథ - బాల సాహిత్యము.
5. పరమహంస శతకం - పరిష్కృతం.
6. మద్గ భర్గ శతకములు - లక్షణ శాస్త్రము
7. సాలగ్రామ శాస్త్రము

ముద్రణ కావలసినవి

పరిష్కృతకృతులు, వ్యాసాలు, ఇంకా అనేకం.

Cover Printed at Print Crafts Kachiguda Stn. Road, Hyderabad.